# ఉత్తరాలు

## తెలుగు వెలుగులు

23-11-60 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 60-వ 'తెలుగు వెలుగు' గా శ్రీ అనంతశయనం అయ్యంగారిని చిత్రించారు.

శ్రీ అయ్యంగారు (గారు) తెలుగు వారు కారు. వారిమాతృభాష తమిళం. అయ్యంగార్లు అనువారు తెలుగువారు కాదని మీకు తెలియదనుకోను.

మీరు ఆంధ్రదేశంలో నివసించేవారి నందరిని తెలుగువారుగానే భావించే ఉదారులు కావచ్చు. అదే మీ వాదం అయితే మద్రాసులో ఉండే తెలుగు వారు తమిళులుగను, ఉత్తర హిందూ స్థానములో నివసించుచున్న తెలుగు బిడ్డలు, ఉత్తరహిందూ స్థానీయులుగను పిలవబడాలి. అంటే వారిక తెలుగువారని మనవారని, పిలిచే హక్కు మనం కోల్పోయినా మన్నమాట.

ఎన్. కె. లింగం (గుంటూరు)

తెలుగు వారిలో కూడా అయ్యంగార్లు లేకపోలేదు.

* * *

23-11-60 పత్రికలో "లోపించిన 'ఔన్నత్యం' మరుగుపుచ్చే పుష్టిగల నిండైనవిగ్రహం" అన్న వాక్యం మినహా, శ్రీమాన్ మాడభూషి అనంత శయనం అయ్యంగార్ ని గూర్చి "తెలుగు వెలుగుల"లో చాలా ఆలస్యంగా వ్రాసినా, వ్రాసినది బాగున్నది. లోపించిన 'ఔన్నత్య' మేమిటో విపులంగా చర్చించివుండిన బాగుండెడిది.

చక్రవర్తి పి. యస్. వేణుగోపాల్
చక్రవర్తి పి. యస్. రామచంద్రన్
(అనంతపురం)

* * *

ఇప్పటికైనా శ్రీ అయ్యంగార్ని తెలుగువెలుగులలో వెలువరించి నందులకు చాలా సంతోషము కలిగినది. ప్రవాసాంధ్రులా అన్నట్లనిపించే వీరిని

అసలు వినాడో పరిచయం చేయవలసి నది.

రజ్ (ఏలూరు)

*  *  *

తెలుగు వెలుగు శీర్షికలో తెలుగు శాస్త్రజ్ఞులను గూర్చి ఇప్పటి వరకు వ్రాసినట్లు లేదు. ఇక ముందైనా ప్రచురించెదరా? అట్లే తెలుగు వేదాంతులు లేక సన్యాసులను గూర్చి కూడ.

జి ఖా నరసింహం (బొంబాయి)

*  *  *

## మనమూ-మన దేహస్థితి

మీ పత్రికలో ప్రచురించుచున్న "మనమూ-మన దేహస్థితి" అను శీర్షిక చాల బాగుగా ఉన్నది. కాని వ్యాధుల నివారణో పాయములను కూడ ప్రచురించినయెడల, ముఖ్యముగా మధ్యతరగతి కుటుంబాలకు చాల సహాయము చేసినట్లగును. పిల్లల పెంపకమును గూర్చి తీసికొనవలసిన జాగ్రత్తలను కూడ ప్రచురిస్తే బాగుంటుందని మనవి. పిల్లలకు ఏ వయస్సులో ఎట్టి ఆహారమును ఇవ్వవలెనో కొంతమంది తల్లులకు తెలియదు. అందువలన పిల్లల ఆరోగ్యము పాడై వ్యాధులకు లోనగుచున్నారు.

జె. యల్. యన్. శాస్త్రి, (కొండుర్గ)

*  *  *

మీ పత్రికలో (వారపత్రిక) కొన్ని వారాల నుంచి ప్రచురిస్తున్న "మనమూ-మన దేహస్థితి" అనే శీర్షిక ఎం. బి. బి. యస్. వాళ్ళ పాఠంలాగా ఉంది. మీ పత్రిక వినోదంకోసం గాని, ఎం. బి. వాళ్ళ టెక్స్టు బుక్కు కాదు.

ఎమ్. రామారావు, జె. కె. సింగ్.
(కాకినాడ)

*  *  *

## ముఖచిత్రం

ఈవారం (ది 23-11-60) పత్రిక ముఖచిత్రం 'మజిలీ' చాలా బావుంది. ఎంతో సహజంగా ఈ చిత్రాన్ని రచించిన శ్రీ తేజోమూర్తుల కేశవరావుగారిని మీ (మా) పత్రికద్వారా అభినందిస్తున్నాను. సినీమా తారల చిత్రాలతో విసుగెత్తిపోయిన మమ్మల్నందరను 'మజిలీ' చాలా ఆనందపరచింది ఇకముందు కూడ ఇటువంటి సహజమైన చిత్రాలు ముఖచిత్రాలుగా వస్తాయని ఆశించవచ్చు కదూ?

కె. ఎస్. పి. మూర్తి (వాల్తేరు)

*  *  *

23-11-60 వారపత్రిక ముఖచిత్రం 'ప్రయాణ విడిదిలో చెట్టుక్రింద వంట' బాగుగానే వుంది. కాని చిత్తరువులో చూపిన 'ఎడ్లబండ్లు' తెలుగు సాంప్రదాయాలకు పూర్తి విరుద్ధంగా తమిళ చిత్రాలలో చూపే మోటుబండ్లులా వున్నాయ్. మీరు తెలుగును తమిళీకరించారా? లేక, తమిళ పత్రికలనుండి చపుక కేటుకు బ్లాకు కొన్నారా? ఇకముందయినా కనీసం ఒకే రంగులో వేసినా, త్రివర్ణమయినా తెలుగు నాటి పద్ధతులను విస్మరించరని నమ్ముతున్నాను.

కె. కాంత (నెల్లూరు)

*  *  *

23-11-60 ఆంధ్ర పత్రిక మీద ముఖచిత్రం "మజిలీ" చాలా ఆకర్షణీయముగా నున్నది. ముఖచిత్రం పత్రికలో ప్రచురించిన ఏదో ఒక కథకు సంబంధించి ఉంటే బాగుండును.

సుపర్ల జగదీశ్వర్ (బొంబాయి)

*  *  *

## శృతిమించి రాగాన పడుతున్నాయి

ఆంధ్రుల అభిమాన పత్రిక ఆంధ్రపత్రికలో శంకర్ గారి "ఎప్పుడూ ఇంతే" బొమ్మలు శృతిమించి రాగాన పడుచున్నవి. ఆయన తన బొమ్మలలో స్త్రీలని దుయ్యబట్టుచున్నారే గాని దానివలన ఆయన తన జాతి సొంత హీనపరుస్తున్నది ఆయనకు తెలియటం లేదనుకొంటాము. కాబట్టి తమజాతి గౌరవం కోసమైనా ఇటువంటి బొమ్మలు తగ్గిస్తారని ఆశిస్తున్నాము.

ఐ. సుగుణ స్వరూప ఎం. వి. (మద్రాసు)

శ్రీ శంకర్ గారు "ఎప్పుడూ ఇంతేనా" మొగవాళ్ళు వంట చేయడమూను ఆడవాళ్లు అజమాయిషీ చేయడమూనూ. వేరే క్రొత్తవి చిత్రించలేరూ? ఎప్పుడూ ఇంతేకాక కొత్తవి ఎక్కువ హాస్యాన్ని కల్గించే చిత్రాల్ని వేస్తారని ఆశిస్తున్నాము.

ఎ. యమునారాణి (విస్సన్నపేట).

"  "  *

16-11-60 తేదీన వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వేసిన జి. రవీంద్రగారి కార్టూను ఆదర్శ దాంపత్యమునకు చక్కని నిదర్శనము. నేడు భర్తపట్ల స్త్రీ అనుసరించుచున్న అధికారదర్పము చక్కగా చిత్రింపబడినది. ఇంతకూ కార్టూనులోని విచిత్రము ఏమిటని ఊహిస్తే వింత సమాధానం వస్తుంది. భార్య సౌందర్యమునకు ముగ్ధుడయిన భర్త ఎంతటి కూలి పనికైనా వెనుదీయడు. ఈ కార్టూను స్త్రీయొక్క ఆధిక్యతకు, నానాటికి నశించిపోతున్న పురుషుని అధికారమునకు చక్కని చిహ్నము.

ఎం. రాధాకృష్ణ, (హైదరాబాదు).

*  *  *

మీకు వచ్చే కార్టూనులలో ఉత్తమమైనవిగా నిర్ణయించి, బహుమతులివ్వడంలో ఏదో పొరపాటు వున్నట్లు తోస్తోంది ఎందువల్లనంటే చాలా పత్రికలలో చివరి పేజీలో

వేసే బహుమతి పొందిన కార్టూన్‌కంటె, లోపల మామూలుగా వేసే కార్టూన్లే బాగుంటున్నవి.

సి. రాధ (అనంతపురం)

* " *

ఇటీవల ఆంధ్రసచిత్ర వారపత్రిక ప్రచురించిన "కన్యాశ్రమం" రసవత్తరముగా ఉన్నది. ధనాశచేత పేదవారు తమపిల్లలను ధనవంతులకు ఇచ్చి వారి భావిజీవితములను

## ఉత్తరాలు

గూర్చి ఆలోచించకపోవటంవల్ల కలిగే పరిణామాలను క్లుప్తముగా కథలో చెప్పిన కనుపర్తి వరలక్ష్మమ్మ గారికి నా అభివందనములు.

వి. సత్యనారాయణ (బొబ్బిలి)

మీ పత్రికలో ఈమధ్య అంతమంచి కథలు రావడంలేదే అనుకొంటున్నాను. ఆకొరత తీర్చేందుకు "మనుషులూ-మనసులు" మొదలెట్టారు. మొదలు చాలా బాగుంది.

వి. సుశీలాదేవి (భీమవరం)



# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 14

7-12-60
బుధవారం

శార్వరి మార్గశిర బహుళ చవితి



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
శ్రీ కృష్ణా పిక్చర్స్‌వారి 'దేశింగురాజుకథ' లో
భానుమతి



పైవారం పత్రికలో ఒక ప్రత్యేక ప్రకటనకోసం నిరీక్షించండి!

## వనితలకు వినతి

'వనితాలోకం' శీర్షికకు రచనలు పంపగోరేవారు కవరుపైన స్పష్టంగా 'వనితాలోకం శీర్షికకు' అని వ్రాయాలి. లేకపోతే అసంఖ్యాకంగా వచ్చే రచనలలో వనితల వ్యాసాలు వింగడించడం కష్టసాధ్యం.

వనితలు పంపే వ్యాసాలు తగుమాత్రపు పరిమితికి – అంటే అచ్చులో రెండుపేజీలకు మించకుండా ఉండాలి.

వ్రాసే రచన గనీ, చేసే సూచనగాని సమకాలీన సాంఘిక పరిస్థితులకు సంబంధించేదిగా ఉండాలి ప్రయోజనాత్మకమైన వ్యాసాలకు ప్రాధాన్యంలభిస్తుంది.

కాగితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిన రచనలే అంగీకారపాత్రంకాగలవు. డిజైనులు, పంపేవారు అవి పోస్టుకార్డు సైజు డ్రాయింగు పేపరుమీద ఇండియన్ ఇంకుతో వ్రాసి పంపవలెను. రచయిత్రుల చిరునామా లేని ఏ రచన ప్రచురణార్హంకాదు.

## గమనిక

కార్టూన్ పోటీలో పాల్గొనగోరేవారు తగుమాత్రపు సైజు కాగితంపై ఇండియన్ ఇంకుతో కార్టూన్ వ్రాసి పంపాలి. క్రింద చిరునామా స్పష్టంగా వ్రాయాలి. చాలీచాలని కాగితాలపై పెన్సిల్‌తోను, కలంతోను వ్రాసే బొమ్మలు పోటీకి స్వీకరించడం లేదు.

—సంపాదకుడు.



నా చిట్టిపాపల
పై నీదురాలోచన
లను నేను
సహించను
భూటాన్
సిక్కిం
ఇక మనం ఇక్కడ ఉండవద్దు
అంతా వెళ్లిపోయిన తరువాత
వాళ్లే కొట్టుకోటం
మానేస్తారు.
గుప్త
సంపూర్ణానంద్
చైనా
చైనీయుల
దురాక్రమణాపేక్ష.
భారత కమ్యూ
నిస్టు పార్టీ
వైఖరి
భారత భూభాగం



# తెలుగు వెలుగులు 62

కళాప్రపూర్ణ శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి పేరు స్మరించగానే వారొక విద్యారణ్యు లనిపిస్తుంది.

ఆయన కేవలం ఆంధ్ర భాషా పండిత ప్రకాండులు మాత్రమే కాదు. చిన్నతనంలోనే వారు తమ పినతాత చినవేంకట సిద్ధాంతిగారి సాన్నిధ్యంలో జాతక ముహూర్త సిద్ధాంత భాగాలు, లీలావతీ గణితము కూలంకషంగా అభ్యసించి పెద్ద పెద్ద సిద్ధాంతులందరిచేత ఔననిపించుకొన్నారు. ఇంకొక పినతాతగారివద్ద సంస్కృత వ్యాకరణ ధర్మశాస్త్రాలు ఆమూలాగ్రంగా ఆకళించుకొన్నారు. శ్రీమాన్ సడాదూర్ అనంతాళ్వార్ ఆచార్యులవారిదగ్గర తర్క వేదాంతశాస్త్రాలధ్యయనంచేసి అసమాన వైదుష్యం గడించుకొన్నారు. విద్యాభ్యాసం ముగించిన పిమ్మట చిత్రవిచిత్ర కవిత్వాలతో అష్టావధానాలతో తమ ప్రజ్ఞాపాటవం ప్రకటించుకొన్నారు.

శ్రీ శాస్త్రిగారిది చాలా ప్రాచీన కాలంనించి పేరెన్నికగన్న విద్వత్కుటుంబము. ఆపైన అనవరత విద్యాప్రదానంవల్ల ఆ వంశీయులందరికీ 'ఒజ్జలవా'రన్న సార్థకమయిన ఇంటిపేరేర్పడింది. ఒజ్జలవారే క్రమక్రమంగా వఝ్ఝలవారయినారు. అదే సంప్రదాయం చినసీతారామస్వామి శాస్త్రిగారికలవడింది. పదునాలుగు సంవత్సరాలపాటు విజయనగర సంస్కృత కళాశాల, అటుపిమ్మట చెన్నపుర విశ్వవిద్యాలయము, ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాల వారి భాషాబోధన పరిశోధనల కాలవాలాలయినవి. ఈనాడాంధ్రదేశంలో శిష్యప్రశిష్యులసంఖ్యాకులు కళాశాలలలో, పాఠశాలలలో ఆచార్యులై, అధ్యాపకులై వఝ్ఝలవారి విద్యావంశం తామరతంపరగా పెంపొందిస్తున్నారు.

ద్రావిడభాషల స్వభావ స్వరూపాల పరిశీలనలో, తెలుగు వ్యాకరణాల తీరుతెన్నులలో, లోతయిన సారస్వత విమర్శనలలో శ్రీ శాస్త్రిగారు కొనసాగించిన కృషి అపారము. ద్రావిడభాషా పరిశీలనము, ద్రావిడ భాషా సామ్యములు, ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము, చింతామణి విషయ పరిశోధనము, వసుచరిత్ర విమర్శనము, హరిశ్చంద్రనలోపాఖ్యానవిమర్శనము మొదలయిన ఉద్గ్రంథాలు వారి నిరంతర పరిశోధన కృషికి నికషోపలాలు.

విజయనగరసంస్కృత కళాశాలలో అంతేవాసులై విద్యాభ్యాసం చేసినవారెవ్వరు శ్రీ శాస్త్రిగారిని విస్మరించలేరు. చాలా కాలం క్రితమే మశూచికంవల్ల ఒక కంటిలో చిన్న పువ్వు పొటమరించింది. అయినా ఆ మిగిలిన ఒక్క కంటితోనే వారింతటి మహత్తర సాహిత్య సాధన సాగించారు. శ్రీ శాస్త్రిగారంతగా ఎత్తరి కారు. కాని కాస్త వత్తరి. ఆయన ఆకృతిలో అంత గొప్పగా చెప్పదగినవిశేషమేదీ కనిపించదు. కాని అల్లంతదూరంలో ఆయన గంభీరమూర్తి గోచరించగానే విద్యార్థులలో విపరీతమయిన భయము, భక్తి కలిగేవి. ఇక క్రమశిక్షణలోను, విద్యాబోధనలోను సాక్షాత్తు చండశాసనులే అనిపించేవారాయన! అయితే 'నిండుమనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణాఖండలశస్త్రతుల్యము' అన్న నన్నయ భట్టారకుని సూక్తి వారియెడల అక్షరశః యథార్థము.

ఇప్పుడాయన 82 ఏళ్ల వయస్సు నిండి పండిన వృద్ధమూర్తి. వెలిచూపు కొంచెం లోపించినా, వెల్లివిరిసిన లోచూపు వెలుగులోనే వారీనాడు 'నన్నయాథర్వణీయార్థ ప్రకాశిక' రచిస్తున్నారు. ఇంకా గ్రంథాలెన్నో ప్రకటించగల దిట్టతనం వారికున్నది. అంతే కాదు, ఆయుర్దాయంలో కూడా నూటపదారులందుకోగల అఖండదీక్షాపరులు శ్రీ శాస్త్రిగారు. ★



# నేనూ-నాపాప

ఆంధ్రసచిత్రవారపత్రికకు ప్రత్యేకం.

## పర్షియా మహారాణి ఫరాపహ్లావీ స్వీయ కథ

(గత సంచిక తరువాయి)

ఇంతలో నా భర్త గదిలోకి వచ్చారు. ఎక్కడివారక్కడ కిమ్మనకుండా సర్దుకున్నారు. ఆయన వచ్చినట్లు నాకు అప్పుడు అర్థమైంది. నా చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకున్నారు. కోటిజన్మల 'అనురాగంతో' నా నుదుట ఆయన ముద్దిడుకున్నారు. కలయ చూద్దును కదా ఆ గదిలో ఉన్నది మేమిద్దరమే. పుత్రోదయమైనప్పుడు తండ్రికి కలిగే ఆనందం ఆయన రూపుగొని ఆ గదిలో ఆనంద నర్తన చేసింది. ఏ తండ్రి మాత్రం అంత పొంగిపోడు? అది సహజమే. ఇక్కడ ఈ గదిలో నేను, నా భర్త- అంటే రాజ నిబంధనల ప్రకారం మహారాణి. మహారాజు, అటు ప్రక్క గదిలో నా పాప రెజా సైరస్ అలీ - ఇరాన్ మహాసామ్రాజ్య సింహాసనానికి వారసుడు! నా తనయుడు.

తరువాత కొంతసేపటికి మా అమ్మ వచ్చింది. ఆర్ద్రంగా అమ్మ నా తల నిమిరి ముద్దిడుకున్నది. ఆనంద బాష్పాలు రాల్చింది. ఆ క్షణంలో నాలో ముప్పిరిగొన్న భావాలకు భాష లేదు. ఏమని చెప్పమంటారు! గతం, గతించని ఆగతం - అంటే వర్తమానం రెండూ కలిసి - నామనసు ఉల్లోలమైపోయింది. అది అనుభవించగలిగానే గాని మాటల్లోకి అనువదించలేకపోతున్నాను.

మధుర క్షణాలు ఇలా దొరలిపోతున్నాయి. మధుర భావాలు రేగి సాగిపోతున్నాయి. తరువాత మరి కొంతసేపటికి మా నర్సు గయాన్ చేతుల్లో ఎత్తుకొని నా బహిఃప్రాణాన్ని నా పాపని తీసుకువచ్చింది.

అప్పుడు చూసుకున్నాను నా బాబుని. లోకంలో అనేకమంది పాపలను నేను చూశాను కాని...అంటే అపచారమేమో... నాకు నా భర్తకు.. మా పాప ఎంత ముద్దుగా కన్పించాడో చెప్పలేను. అందరు పాపలూ ఒకటి- నా పాప ఒక్కడూ ఒకటి. లోకానికల్లా అందాలకందు - కన్నులవిందు నా పసికందు అనుకుంది ఈ తల్లి హృదయం!

తొలి కాన్పు పసిపాపని తల్లిగా చూసుకునే అదృష్టం స్త్రీ జన్మకు గల అపరూప వరం. అది మరపురాని మధురక్షణం. నా బిడ్డని తొలిసారి చూసినప్పుడు నా గుండె పులకించింది. ఎన్ని జన్మలతపస్సునో ధారపోసి నేను లోకానికి సమర్పించిన మహాఫలం నా పాప - అనుకున్నాను. నేను జీవించి

**తొలికాన్పు పసిపాపను తల్లిగా చూసుకునే అదృష్టం స్త్రీజన్మకు గల అపురూపవరం. నా బిడ్డను తొలిసారి చూసినప్పుడు నాగుండె పులకరించింది. ఎన్నిజన్మల తపస్సునో ధారపోసి నను లోకానికి సమర్పించిన మహాఫలం నాపాప అనుకున్నాను.**

ఉన్నంతకాలం ఈ తల్లి నికని పెట్టి గౌరవించే కన్నకొడుకు పుట్టాడని పొంగిపోయాను. ఆ చిన్నారి చిట్టిబాబు మీద అప్పుడే ఎక్కడివి ఇన్ని ఆశలు?

నా బిడ్డడు ఒక్కసారి చిరాకుతో ఏడ్చాడు. ఆ పసిగొంతులో ఆశా సంగీతాలు ఎన్నో ఈ తల్లి విన్నది.

తన వారసుని చూసుకున్న చక్రవర్తి హృదయం సముద్రంలా ఉప్పొంగింది. సగర్వంగా ఆయన కంట ఏదో వెలుగురేక తళుక్కుమన్నది. మేము చేసింది కఠోర తపస్సు. పొందింది మహాఫలం. జీవితాంతం ఆనందించే మహదవకాశం. అయితే కొడుకును చూసుకున్న ఆయనలో కలిగిన ఆనందం ఎంతటిదో ఆయన బిడ్డలకోసం ఎంతగా అలమటించారో తెలిసినవారికే తెలుసు.

చక్రవర్తి కూడా మరో పసిపాప అయినారు ఆ సమయంలో. ఆ పాపడితో మాట్లాడాలని ప్రయత్నించారు. పాపల భాషలో పలకరించారు. చిటికెలు, ఈలలూ వేసి ఆడించారు. కాని నా బాబుకి ఇవన్నీ పట్టలేదు. తండ్రికి మళ్ళీ బదులు చెబుతాడేమో అని కూడా చూశాను. సామాన్యుడు కాదు సుమా ఈ భావి చక్రవర్తి అనుకున్నాను. కొంచెం వాడు గడుసుతనంగా మరి కొంత బిగ్గరగా ఏడవటమే!

ఆ సమయంలో నా హావభావాలు బహుశః చక్రవర్తి గమనించి కాబోలు 'ఓహో అదేం కుదరదు. ఈ పసికందు అచ్చంగా నీవాడే ననుకుంటున్నావేమో - నావాడుకూడా అనే సంగతి మరచిపోయేవ్' అని ఛలోక్తిగా అన్నారు! అందరికీ ఆ మాటలకు నవ్వువచ్చింది. నిర్మొహమాటంగా చక్రవర్తి ఛలోక్తిని పంచుకొని నవ్వుకున్నారు. ఆయన ఏదో గబగబా జేబులు తడుముకోటం మొదలు పెట్టారు. చివరకు తన వేస్టుకోటు జేబులోంచి ధగధగలాడే వజ్రాల ఉంగరం ఒకటి తీశారు. నా కళ్లు జిగేల్ మన్నాయి. అంతగా మెరసిపోయింది ఆ ఉంగరం. "నాకోసం నీవుపడిన శ్రమకీ, ఇచ్చిన ఫలానికి నీకీ ఉంగరం బహుమానం" అన్నారు ఆయన నా వేలికి అంగుళీయకం అమర్చి.

ఉన్నట్టుండి ఈ కోలాహలం గప్‌చుప్‌గా ఆగిపోయింది. నిశ్శబ్దం ఆవరించింది. బయటినించి బ్రహ్మాండమైన ధ్వనులు వినిపించాయి.

ఈ సంతోష సమయంలో ఆనందసూచనగా ఫిరంగులు పేల్చబడినాయి. టెహరాన్ రాజధాని అంతా ఆ ధ్వనులు 21 సార్లు ప్రేలి-వారసుడు ఉదయించిన వార్తనలు మూలలా అందించాయి! అయితే అవి అంతటితో ఆగలేదు. 21 సార్లు ఆడపిల్ల పుడితే నే. రాకుమారుడు ఉదయిస్తే 41 సార్లు ఫిరంగులు గర్జిస్తాయి. ఆ కుమారుడికి, నాకుమారుడికి, అంటే ఇరాన్ రాకుమారుడికి గౌరవ పురస్సరంగా అభివాదనం చేశాయి ఫిరంగులు.

ప్రసూతి గృహం బయట నిండిన మహాజనం 'షా చిరకాలం జీవించాలి' 'మహారాణి చిరకాలం జీవించాలి' అని నినాదాలు చేస్తూ "దీర్ఘాయురస్తు భావిపర్షియా అధినేతా— రాకుమారా" అని ఆశీర్వదించింది. ప్రజల హర్షధ్వానం సంతోషసముద్ర ఘోషంగా వినిపించింది.

చికిత్సాలయంలోనే మరోప్రక్క సమావేశమైన ప్రధానమంత్రిని, ఇతర అధికారులను కలుసుకునేందుకు చక్రవర్తి వెళ్లారు. వారంతా ఆయనను అభినందించడానికి వచ్చారు. ముస్లిం మతాధిపతికూడా వచ్చారు. రిజిస్ట్రేషన్, రికార్డ్సు డిపార్టుమెంటు అధినేతలు కూడా వచ్చారు.

వారంతా తమ భావి చక్రవర్తిని చూసుకున్నారు. మతాధిపతి ముల్లా పాపడి తలమీద పవిత్రమైన ఖురాన్ ఉంచి ఆశీర్వదించి, ఆ పవిత్రమైన గ్రంథం తొలిపుటలో నా బాబు పుట్టిన తేదీ, గంటలు వ్రాశారు. ప్రభుత్వపు రిజిష్టర్‌లో కూడా అన్నీ వ్రాశారు. కాని పేరుకు ఖాళీ వదిలారు. అప్పటికి అబ్బాయికి పేరు పెట్టలేదు.

అమ్మాయి అయితే అమ్మాయికి, లేకపోతే అబ్బాయికి ముందే మేము పేర్లు ఆలోచించాము. కాని అధికారపూర్వకంగా ఆరు రోజుల వరకు ప్రకటించరాదు. మా దేశాచారం అది. పుట్టిన ఏడవ రోజున జరిగే నామకరణోత్సవం మాకు ఒకచక్కని వేడుక.

అసలు సంప్రదాయం ప్రకారం బిడ్డ కలిగే వరకు పేర్ల ఆలోచనే ఉండదు మా దేశంలో. పుట్టింది మగశిశువో, ఆడశిశువో చూసి, అప్పుడు అనువయిన పేర్లు కొన్ని చిన్న కాగితాల మీద వ్రాసి ఖురాన్ పేజీలలో దాచి, ఏడవరోజున అల్లాను ప్రార్థించి తండ్రి ఏదో ఒక పేజీ తెరవాలి. అందులో అన్ని పేపరులో ఉన్న పేరే నిర్ణయం అవుతుంది. ఇదో పాతకాలపు తతంగం.

సాధారణ చికిత్సాలయంలో నేను ప్రసవించడం రాజకుటుంబంలో అందరికీ అంతగా నచ్చలేదు. గతసంవత్సరమే షా దానికి ప్రారంభోత్సవం చేశారు. ఇరాన్‌లోనే కాక మధ్య ప్రాచ్యంలోనే అది గొప్ప చికిత్సాలయమని నాకు తెలుసు. విదేశీ వైద్యులు అవసరం లేదని నేను మొదటనే చెప్పాను. మా వైద్యులమీద నాకు గల విశ్వాసం అచంచలం.

రాకుమారుడు రాజభవనంలోనే పుట్టాలని మరోచోట పుట్టరాదని రాజబంధువులు పట్టుపట్టారు. వారి యిష్టప్రకారమే కానిస్తేమంచిదని ఆయనకు నేను చెప్పాను. రాణిగాను ప్రజలకు సన్నిహితం కావలసిన రాజకీయాలకు శుభసూచనగా మనపాప మామూలు ప్రసూతి కేంద్రంలోనే జన్మించాలని ఆయన అన్నారు.

ప్రసూతికేంద్రం నాపాప పుట్టుకతో రాజభవనంలా రాణించింది. అక్కడగల నాలుగు వీధులకూడలి స్థలమంతా రంగు రంగుల విద్యుద్దీపతోరణాలతోనూ, జండాలతోనూ వెలిగిపోయింది. టెహరాన్ మహానగరమంతా అలానే మెరిసింది.

ఆ కూడలిస్థలం పేరు 'ఎక్జిక్యూషన్ స్క్వేర్.' ఆ పేరువింటేనే చిన్నప్పుడు నేను భయపడేదాన్ని. ఉరితీయడానికి 'ఎక్జిక్యూషన్' అంటారు. అందుకని ఆ పేరు నాకు భయం కలిగించేది. పూర్వం ఈ స్థలంలోనే హంతకులను బందిపోటు దొంగలను ఉరితీసి చంపేవారట! చిన్నతనంలో విన్న ఈ కథలకు భయంతో వణికిపోయేదాన్ని.

ఈ ప్రసూతీకేంద్రం తెరచినది మొదలు పుట్టినపాపల్లో నాపాపడు 2002వ వాడు. ఈసంగతి నాకు డాక్టర్ సాలే చెప్పారు. ఆయన మాప్రభుత్వంలో ఆరోగ్యశాఖా మంత్రికూడా. నన్ను గురించి అక్కడివారు తీసుకున్న శ్రద్ధ ఎంతటిదో చెప్పలేను అక్కడింకా కడుపెడుబిడ్డలను కనాలని నాకోరిక.

(ఇంకా వుంది)

గిలకమీద బాల్చీతాడు కిర్ కిర్ మంటూ జారింది. బుడుంగుమని బాల్చీ మునిగి మళ్లీ కిర్ కిర్ మంటూ పైకి వచ్చింది. కమల నీటిని అందుకొని బిందెలోకి వంచుకుంది. ఎర్రగా కందిన చేతులతో చెమటలు కారుతున్న చెంపల్ని తుడుచుకొని మళ్ళీ బాల్చీ నూతిలోకి వదిలింది. ఎదురుగా బాదంచెట్టుమీది నుండి సూర్యకిరణాలు కమల కళ్ళల్లోకి సూటిగా గుచ్చేయి. బాల్చీ టపా మని నూతి గట్టుకి కొట్టుకొంది.

"ఒసేకమలా, ఇంకా ఎంతసేపే. బియ్యం కడిగి ఏ రుషా మైందీ?...అబ్బబ్బా కుంపట్లో రా వేశావా...ఓ మొద్దూ, ఆ నీళ్ళలా పడేసి వీణ్ణి అవతలికి తీసికెళ్ళు. ఏనా ఏ పని చెప్తే అక్కడేనమ్మా పాతుకుపోవడం! ఒక్క మనిషిని నానా అవస్థా పడుతున్నా ఇంట్లో ఎవ్వరికీ లక్ష్యం లేదు. ఎందుకుంటుందీ? రక్త సంబంధమైతేకదా అయ్యో అమ్మ కష్టపడుతోందే అనీ, తోడపుట్టినవాళ్ళనీ బాధా అభిమానమూను. పరాయివాళ్లు చేయించుకోడానికే కాని..." బిందె తీసికొచ్చి వంటింట్లో పెట్టింది కమల. సవతితల్లి ధోరణి ఇలాగే సాగిపోతుందని ఆమెకి తెలుసు. రెండేళ్ళ తమ్ముణ్ణి చంక నేసుకుని హాల్లోకి నడిచింది. పెద్దగడియారం అప్పుడే ఏనిమిది చూపిస్తోంది. ఇంకొక్క గంటలో పరీక్షహాల్లో ఉండాలి తను. లెక్కలంటే మొట్టమొదటి నుండీ భయం తనకి. దానికి తగినట్టే పొద్దుటి నుండి ఒక్కసారికూడా పుస్తకం ముట్టుకొన్న పాపాన్న పోలేదు. కుర్చీలో పడి ఉన్న పుస్తకాన్ని అందుకొంది కమల.

'హీహీహీహీ' తమ్ముడు ఎప్పుడు కుర్చీ ఎక్కాడో కిందపడి గుక్క తిప్పుకోకుండా ఏడుస్తున్నాడు. పుస్తకం పడేసి వాణ్ణి ఎత్తుకొని ఊరుకోబెట్టబోయింది కమల.

"అయ్యో. పిల్లాణ్ణి చంపేస్తావు లే! వెధవ చదువు చట్టుబండలు గానూ. ఆడదానివి చదివి ఏం వెలగబెడతావే" అంటూ ఒక్క మొట్టు మొట్టి పిల్లాణ్ణి కమల చేతుల్లోంచి గుంజుకుని పిన్ని తీసికెళ్ళి పోయింది. కమల కళ్ళల్లో నీటిబిందువులన్నీ మేఘాలై చూపుని అడ్డేసేయి. నిర్ఘాంతపోయి నిలబడిపోయిన కమల పిన్ని అగుపుతో తెప్పరిల్లి వంటింటివైపు పరిగెట్టింది. 'బిందె తీసికెళ్ళి కొళాయిదగ్గర మంచినీళ్లు పట్టుకురా' అంటూ ఆర్డరు జారీ చేసింది. కమల యాంత్రికంగా బిందె తీసికొని నడిచింది. కొళాయిదగ్గర మహిళలు క్యూలో నిలబడి అర్థంలేని దెబ్బలాటలతో మునిగి తేలుతున్నారు. ఐదూ పదీ పదిహేను నిమిషాలూ అరగంటా గడిచిపోయాయి. కమల వంతు రాలేదింకా. అయ్యో తొమ్మిదై ఉంటుందా అన్న ఆలోచన వచ్చింది కమలకి. లెక్కల పరీక్ష పేపర్లోని అంకెలు పెదవై పెద్ద పెద్దవై రాక్షసి తలకాయలంతంతై తనని దడిపిస్తున్నట్లనిపించింది కమలకి. కళ్ళు చీకట్లు కమ్మేయి.

'ఇదిగో ఏమిటమ్మాయీ అలా మీదపడతావూ' అని సణాలు చెయ్యబోయి 'అయ్యో ఈపిల్ల పడిపోతోందర్రో' అంటూ పట్టుకొంది కమలకి ముందునిల్చున్న ఆవిడ. నలుగురూ నీళ్లు మొహంమీద జల్లేరు. కాస్త తేరుకొన్న కమల దృష్టిపథంలో లెక్కల పరీక్ష మెదిలింది మళ్ళీ. 'టైం ఎంతఅవుతుందండీ?'

'తొమ్మిది అవుతుందమ్మా ఏం?'

'అయ్యో లెక్కలపరీక్ష' అంది కమల గుండెలమీద చెయ్యి ఉంచుకుని.

'ఎవరదీ కమలా' అంటూ సీతమ్మగారు వచ్చింది రంగంలోకి.

'అదేమిటే కమలా...ఇవాళ నీకు పరీక్ష కదూ! మా పిల్లలు అప్పుడే వెళ్ళిపోయారు. నువ్వింకా ఇక్కడే ఉన్నావా' అని 'అయినా దాని మనస్సెలా ఒప్పుతోందో కాని పరీక్ష నాడు కూడా రాయిలాగ కూర్చుని పసిపిల్ల చేత పని చేయించుకొంటోందమ్మా'

'ఎవరమ్మా తల్లీ!'

'తల్లి ఉంటే దానికీ గతెందుకు వస్తుందమ్మా. ఏదో సామెత చెప్తారే తల్లి లేకపోతే తండ్రి పినతండ్రితో సమానముని – అల్లాగ తల్లిని దేవుడు దూరం చేస్తే సవతితల్లి వచ్చి తండ్రిని ఆ పిల్లకి కాకుండా చేసిం'దని నిట్టూర్పు విడిచి 'అయినా కమలా అలాగ నిలబడితే ఎలాగే......ఎవరికైనా కాస్త ముందు నీళ్ళు పట్టుకొంటానని అడగాలి కానీ...అడగందే అమ్మఅయినా పెట్టదట' అంటూ సీతమ్మగారు నీళ్ళు పట్టుకొంటున్న ఆవిడతో ఇచ్చకాలాడి బిందె కమల బిందెలోకి వంచి 'ఊం. త్వరగా వెళ్ళు. నీళ్లు మీ పిన్ని మొహాన్న కొట్టి పరీక్ష కెళ్లమ్మా' అంది. కమల ఆవిడకి మనస్సులోనే జోహార్లర్పించి బిందె చంక నేసుకొంది. "నోరూ వాయీ లేని పిల్లమ్మా. ఇలాగే వెట్టి చాకిరీ చేస్తూ కూడా మంచి మార్కులతో పేసవుతుంది. మా వాళ్ళూ ఉన్నారు, మొద్దుల్లా మెక్కబెట్టి చదవండ్రా అంటే మూడేసేళ్లు ఒక్కొక్క క్లాసులో దండయాత్రలు కొడుతూ...అయినా దీని చేతులిరగా. పందికొక్కులాగ కూర్చొని పసిపిల్ల చేత పని చేయించుకొంటుంది' అంది సీతమ్మగారు మెటికలు విరుస్తూ. "ఆ, ఇంకెన్నాళ్ళులెండి. ఈ అమ్మాయి పెళ్లి అయి అత్తారింటికెళ్ళిపోతే తెగులు చప్పగా కుదురుతుంది. పడ్డవాళ్లెప్పుడు చెడ్డవాళ్లు కారు పిన్నిగారూ...మా కామాక్షి పుట్టింట్లో నానా అవస్థా పడిందా-అత్తారింట్లో ఎంత హాయిగా ఉందనుకున్నారూ...తల్లి లేనిలోటు దానికి మొగుడూ అత్తగారూ తీర్చేరు. పురిటికి కూడా పుట్టింటి మొహం చూడదు' అని సుబ్బమ్మగారు అంటూ ఉండడం నీళ్ల బిందెతో ఇంటిగుమ్మం ఎక్కుతున్న కమల చెవిని పడింది.

> ఒకరు—మీరంత లావుగా ఉండడానికి కారణం ఏమిటండీ?
>
> వేరొకరు—నేను ఎప్పుడూ భోజనం చెయ్యనండి.
>
> కె.సుమతీ, బంగారుతల్లి (ఏనుగులమహల్)

"ఇంకా పరీక్షకి వెళ్ళలేదూ' అన్నాడు తండ్రి వంటింటి గుమ్మంలో నిల్చుని.

"ఇదిగో వెడుతున్నా"

'అన్నం చారూ మాత్రం అయ్యాయి. తింటే తినిపో' అంది పిన్ని.

'టైం అయిపోయింది. వచ్చి తింటా' నంటూ పరిగెట్టింది కమల హాల్లోకి.

"చూసేరా దాని విరగబాటు. ఇదంతా మీముందు నన్ను చులకన చెయ్యడానికేగా. అన్నం తినడానికి కూడా టైం లేకుండా నాకు పనిచేస్తున్నట్లు మీరనుకోవాలనేగా. అయినా ఇలాగ తిండికూడా మాని ఆచదువు వెలగబెట్టి ఏం చేస్తుందనీ. పెళ్ళయ్యాక మాలాగ ఈ పొయ్యిదగ్గర పాతుకుపోవడమేగా. ఏ పల్లెటూర్లోనో పడితే ఇల్లలుక్కొంటూ పేడ పిసుక్కొంటూ..." ఈ ధోరణి ఇంతవరకూ పెన్నూ పెన్సిలూ తీసికొని వీధిగడియ తీస్తున్న కమల వినవలసి వచ్చింది.

* * *

అన్ని ఆటంకాలలోనూ పరీక్ష బాగా వ్రాసింది కమల. ఆరాత్రి పడుకోబోతూ చల్లని చందమామని చూస్తూ అనుకొంది— సవతితల్లి వల్ల తండ్రికి దూరమైన తనని భర్త ఆదరంగా చూసుకొంటాడనీ, తను అసలు పెళ్ళి అయ్యాక పురిటికికూడా పుట్టింటి మొహం చూడకూడదనీ......

* * *

పెళ్ళిచేసి ఇంట్లోంచి పంపించేయాలన్న సవతితల్లి కోరికా, పెళ్ళిచేసుకొని సవతితల్లి బారినుండి తప్పించుకోవాలనుకొన్న కమల కోరికాకూడా నెరవేరేయి. కమల పెళ్లి నిశ్చయమైంది. అత్తవారిది పల్లెటూరు. పాడీ పంటా ఇల్లూ వాకిలీ గల కుటుంబం. భర్త ఆట్టే చదువుకోకపోయినా పొలం ఇల్లూ అవీ చూసుకొంటాడు. కమల రెండవ కోడలు. పెదకోడలు లక్ష్మి ఆమె భర్తా పట్నంలో ఉద్యోగపు ఊర్లో ఉంటారు. ఇంకా బడికిపోయే మరుదులూ ఆడబిడ్డలూ ఉన్నారు. పెళ్లిలో తమవల్ల లోపాలు జరిగినా భర్తా అత్తగారూ తనని ఏమీ అనకపోవడంచూసి వాళ్ళ ఉదార స్వభావానికి కమల ఎంతో పొంగిపోయింది. పెళ్లిలో తోడికోడలు లక్ష్మి తనమీద చూపించిన ఆదరంలోని జాలి కొంచెం

మీరు టూత్ పేస్ట్ లేక
టూత్ పౌడర్, ఏది వాడినా
# పళ్లను శుభ్రపరచేది టెక్

టెక్ టూత్ బ్రష్‌కు మాత్రమే ఈ క్రింది ప్రత్యేక అంశములు కలవు:
- ఎంచుకొందుకు వీలుగా రెండు ఆకారములు — 'ఓవల్' మరియు 'షార్ట్ ఓవల్'
- సౌమ్యమైన 'ఎక్స్‌టన్' కుచ్చులు
- ఆరు వివిధ ప్లాస్టిక్ రంగులలో స్ఫటికమువంటి 'మిరేకిల్ గ్రిప్' హేండిల్




జాన్సన్ అండ్ జాన్సన్ ఆఫ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

వింతగా అనిపించినా, కొత్తకోడల్ని చూడడానికి వచ్చిన అమ్మలక్కల్లో ఎదురింటి ఇల్లాలు ఎవరూ లేకుండా చూసి 'బంగారు బొమ్మలాగ ఉన్నావమ్మా. మాడూ... మీ అత్తగారు చూస్తే ఏం బోధిస్తున్నానో అనుకొంటుంది కర్మ...నీ భర్తని నీవాడిగా చేసుకో అమ్మా...వెడతాను తల్లీ...ఏమీ అనుకోకు" అని చెప్పటం చూసి కమల ఆశ్చర్యపోయింది.

కోడలిగా కమలకి పని ఎక్కువే ఉండేది. ప్రొద్దున్నే లేచి నీళ్ళపొయ్యి వెలిగించి, పాలు పిండి దాలిమీద పెట్టి, భర్తకి కాఫీ చేసి ఇచ్చి, మజ్జిగ చేసి వెన్నతీసి, పిల్లలకు చద్దన్నాలు పెట్టి వాళ్ళకు నీళ్ళు పోసి బట్టలు వేసి స్కూళ్ళకు పంపేది. తర్వాత నీళ్ళు పోసుకొని మామగారి పూజగది తుడిచి నీళ్ళుజల్లి ముగ్గుపెట్టి, అన్నీ తోమి పెట్టి, పువ్వులు కోసి పూజ సామగ్రి అంతా సమకూర్చేది. తర్వాత అత్తగారికి కూరలు తరిగి, బిందెతీసికొని కాలవకెళ్ళి ఇంటికి కావలసిన మంచినీళ్ళన్నీ మోసుకొచ్చేది. మధ్యాన్నం భోజనాలు పూర్తి అయ్యేసరికి ఒంటిగంట కొట్టేది. మళ్ళీ పిల్లలకి అన్నాలూ, కాఫీల దగ్గరనుండి సాయంత్రం వంటా భోజనానంతరం ఇల్లు కడగడం, పాలు తోడేయడంవరకూ కమల పనే! రాత్రి పదిన్నర దాటేవరకూ కమలకి భర్తతో మాట్లాడేందుకే వీలు చిక్కేది కాదు. అతడుకూడా స్నేహితులతో తిరుగుతూ పదకొండు గంటలు అయితేనే కాని ఇల్లు పట్టేవాడు కాదు. భర్తతో మాట్లాడే ఆ కొద్ది గడియలకోసం ఆమె రోజంతా నిరీక్షించేది.

"నువ్వు పని ఎక్కువని మా వదినలాగ గొణగకుండా చేసుకొనిపోతూ ఉండడం మా అమ్మా నాన్నకీ ఎంత సంతోషంగా ఉందనుకొన్నావూ. నీలాంటి కోడలు రావడం తమ అదృష్టమనుకొంటున్నారు వాళ్ళు" అన్నాడతను ఒకరోజు.

పని ఎక్కువనీ, అది తను చెయ్యలేదనుకాని ఆనాడు తోడికోడలు ఎదురింటి ఇల్లాలూ తనమీద జాలిచూపేరనిపించింది కమలకి. కాని పుట్టింట్లోనే తను విశ్రాంతి లేని పనికి అలవాటుపడింది.

"మరి...మరి...మీరో" అంది తను సిగ్గుపడుతూ.

"నీవు అందరిలాంటిదానవు కావు కమలా. నీలో ప్రత్యేకత ఉంది" అన్నాడతను కమల తల నిమురుతూ. పొంగిపోయింది తనా మాటలకి. అత్తమామల మెప్పు భర్త మెప్పూ పొందిన తనకంటే అదృష్టవంతురాలు ఉండదనుకొంది. కాని అదృష్టమూ, తృప్తీకూడా తాత్కాలికమే అయ్యాయి.

కమల నీళ్ళుపోసుకొందని విని అత్తగారెంతో సంతోషించింది.

# ఆశాజీవి

ఆనాడు కమలకి మల్లెపూలతో జడ వేసింది అత్తగారు. రాత్రి త్వరగా పని ముగించుకొని భర్తకి ఇష్టమైన చీర కట్టుకొని అతనికోసం చూస్తోంది కమల. అతడు ఎంతకీ రావడంలేదు. పదకొండు అయింది. కమలకి ఆవులింతలుకూడా వస్తున్నాయి. ఇంకా స్నేహితులేకాని భార్య గుర్తుకురాని భర్తని విసుక్కొంటూ, వస్తున్నాడేమోనని వీధి అరుగుదగ్గరకి వెళ్ళింది. ఎదురింటి ముందున్న వేపచెట్టు విరగబూసిన పూలతో గుప్పుమంది. ఆ మసక వెన్నెల్లో ఎదురింటి ఇల్లాలు తలుపుతీసి విస్తళ్ళు పారేసి 'ఎవరూ కమలా' అంటూ దగ్గరకి వచ్చింది. 'మీ అత్తవారే మంత్రం వేసేరో కాని మాతో ఒక్కమాటైనా మాట్లాడవు కదే కమలా.' అంటూ ప్రారంభించి 'పువ్వులజడ వేసుకొన్నావా? లక్షణంగా లక్ష్మీదేవిలాగ ఉన్నావే తల్లి. రంభలాంటి నిన్ను ఇంట్లో పెట్టుకొని వాడి కదేం పొయ్యేకాలమో కాని' అంది ఆవిడ. కమల తెల్లబోయి చూసింది ఆవిడవైపు. 'నీ మొగుడింకా రాలేదు కదూ...' అని "ఎందుకొస్తాడూ. అయినా చదువుకొన్నదానివి. ఇంత అమాయకురాలివైతే ఎలాగ తల్లీ...నీ మొగుణ్ణి నీవు దిద్దుకోకపోతే ఎలాగా?"

"దిద్దుకోవడమా?" అంది కమల అర్థం చేసుకోలేక.

"అయ్యో వెర్రిపిల్లా. నీ మొహంచూస్తే నా కడుపు తరుక్కుపోతోందమ్మా. ఏం అత్తో, ఏం మామో. నీచేత చాకిరీ చేయించుకోడానికే కాని నీ బాగు కొంచెమైనా చూస్తున్నారా? అయినా వాళ్ళనని లాభంలేదులే! తిట్టేరు, బెదిరించేరు. అక్కడికీ లొంగకపోతే పెళ్ళిచేస్తే బాగుపడతాడేమోనని పెళ్ళిచేసేరు. వాడే మరీ బరితెగించి పోయాడు. దానికిద్దరు పిల్లలు కూడానట."

కమలకి లోకం గిర్రున తిరిగిపోతోంది. అరుగు చివరకి పరిగెట్టి వాంతి చేసుకొంది. సావిట్లోకి వచ్చిన అత్తగారు ఈ సందడికి పరిగెట్టుకొచ్చి మొహంమీద నీళ్ళు జల్లి 'పాడుదిష్టి. తాచుపాములాంటి జడ పువ్వులు కుట్టేసరికి అందరి కళ్ళూ నీమీదే పడ్డాయి.' అని తిట్టుకొంటూ "ఉట్టి మనిషివికూడా కాదు. ఇంతసేపు మేలుకొని వాళ్ళతో వీళ్ళతో ఏం కబుర్లవి? పోయి పడుకో' అంది.

కమల పక్కమీదికి ఒరిగిపోయింది కన్నీటితో తలగడా తడిసిపోయింది. తోడికోడలి జాలికీ, 'నీ భర్తని నీవాణ్ని చేసుకో' అన్న మాటలకీ అర్థం ఇదా? కట్నం లేకుండా భూమీ పుట్రా ఉన్న సంబంధం వచ్చిందని పొంగిపోయిందప్పుడు. అత్తామామలు ఉదార స్వభావులని మురిసిపోయింది. ఆ ఉదారంలోని స్వార్థం ఇదేనా? అయినా నాలుగు నెలలుగా చూస్తున్నా స్నేహితులతో బాతాఖానీ అని భర్త అర్ధరాత్రి వరకూ తిరుగుతూ ఉంటే అమాయకంగా నమ్మిన తనబుద్ధిని నిందించుకొంది. ఊరందరికీ తెలిసిన భర్త ప్రవర్తన తాను పసికట్టలేక పోవడం తన తెలివితక్కువ తనమేనా అనిపించింది కమలకి.

అతడెప్పుడు వచ్చాడో అత్తరువాసన గుప్పున కొట్టింది. మంచంమీద కూర్చొని 'అమ్మాయిగారు పూలజడ వేసుకొంటే దిష్టి తగిలిందటగా' అన్నాడతను మీద చెయ్యి వేస్తూ. మొట్టమొదటిసారిగా కమలకి అతన్ని చూస్తే అసహ్యం వేసింది. అతన్ని దూరంగా తోసేస్తూ 'అందరిదిష్టీ తగిలిందికాని అసలు వారిదృష్టే కరవైంది' అంది నిట్టూరుస్తూ.

'కోపం వచ్చిందా? స్నేహితుల బాతాఖానీలో టైం తెలియలేదు.'

'ఎలా తెలుస్తుందీ? అందులో అలాంటి ఇలాంటి స్నేహితులు కారు; అంతరంగిక స్నేహితులు" అంది కసిగా.

'ఏమిటే వాగుడూ. నీకు మాట్లాడడం రాదనుకొన్నాను. సాధింపు కూడా చాతవునే' అన్నాడతడు కోపంగా.

కమలకి దుఃఖం పొంగిపొర్లింది. "నాలో ఏం లోపం ఉందని నన్నిలాగ బాధ పెడతారూ? నేనేం అపకారం చేసేను మీకు. అసలు నన్నెందుకు పెళ్ళి చేసుకొన్నారూ? నీవు అందరిలాంటిదానవు కాదంటే స్వభావంలో అనుకొన్నాను. మీకు ఎందరో

ఉండగా నన్నెందుకిలా..." ఇంక కమలకి మాట రాలేదు. వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. "నీకేదైనా పూనిందా? గిట్టనివాళ్లెవ్వరో చెప్తేనమ్మి నామీద ఎగురుతావేం... నోరుమూసుకుపడుకో"అంటూ అతను తన ప్రక్కమీదికెళ్లి పడుక్కొని

## ఆశాజీవి

ఐదు నిముషాలలో నిద్రపోయాడు. ఆ రోజు కమలకళ్ళు మూతపడలేదు. ఆ కళ్ళలో నీరు కూడా ఇంకిపోలేదు.

* * *

కమలలో ఉత్సాహం ఉడిగిపోయింది. యాంత్రికంగా పనిచేస్తూ ఎన్నో పొరపాట్లు చేసేది. మనస్సులోని ఆలోచనలతో చెయ్యి

(51-వ పేజీ చూడండి)



మొరాకో సుహృద్భావప్రతినిధివర్గం సభ్యులు గత నెల మూడవవారంలో న్యూఢిల్లీ వచ్చినప్పుడు ప్రధాని శ్రీ నెహ్రూను కలుసుకున్నారు. ప్రతినిధివర్గం నాయకునితో ప్రధాని కరచాలనం చేస్తున్నదృశ్యం. చిత్రంలో మూడవవ్యక్తి విదేశాంగశాఖ కార్యదర్శి శ్రీ ఎస్. దత్.

**న్యూఢిల్లీ లేఖ** — **శ్రీకృష్ణ**

# దేశ సమస్యలపై పార్లమెంటుసభ్యుల అనాసక్తి: నూనె కంపెనీల "ధరలయుద్ధం"

ఈమారు పార్లమెంటు సమావేశం ప్రారంభమైనది లగాయతు మందకొడిగా సాగుతోంది. దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్యలేవీ లేకపోవటంవల్ల సమావేశం ఇంత చప్పగా ఉంటోందనుకోరాదు. సభ్యులు, దేశవ్యవహారాలలో ఆసక్తి చూపకపోవటమే ఇందుకు ప్రధాన కారణం. ఉదాహరణకు, పంజాబ్, అస్సాం వ్యవహారాలను చర్చించేందుకు కొల్లలుగా విరామ తీర్మానాలు వచ్చాయి గాని, నానాటికీ పెరుగుతున్న జీవనవ్యయాన్ని గూర్చి చర్చించాలనే ప్రతిపాదన అసలు చర్చకు రానేలేదు. 20వ శతాబ్దంలో పట్టిన దుర్గతి ఏమంటే, మధ్య తరగతి ప్రజలు అధికారాన్ని చేజిక్కించుకునేందుకు నానాయాతనపడి, చివరకు తమను తామే నాశనం చేసుకున్నారు.

ఇంక వివరాలకు వద్దాం. పార్లమెంటులో అధికసంఖ్యాబలం కల కాంగ్రెసు పార్టీ సభ్యులు వచ్చే ఎన్నికలకు టిక్కెట్లు సంపాదించుకునే తాపత్రయంలో, విమర్శనతో నిమిత్తంలేని వైఖరిని అనుసరిస్తున్నారు. కమ్యూనిస్టులలో తాత్కాలికంగా గృహచ్ఛిద్రాలు ఏర్పడ్డాయి. ప్రాంతీయాభిమానమే కమ్యూనిస్టుపార్టీలో చీలికలకు కారణమై ఉండవచ్చు. చైనాకు అనుకూలమైన వైఖరి అనుసరించినందువల్లనే కమ్యూనిస్టులకు ఈ దేశంలో స్థానం లేకుండా పోయింది. ఇందులో రహస్యమేమీలేదు. ఈ సందర్భంలో మహారాష్ట్ర నాయకుడు శ్రీ డాంగే సజావైన మార్గం తొక్కారు. శ్రీ చౌఎన్‌లై ఎదుట కమ్యూనిస్టులు నల్లజండాల ప్రదర్శనం నిర్వహించి ఉన్నట్లయితే, భారతదేశంలో అధికారం యావత్తు వారి (కమ్యూనిస్టుల) పరం కాకుండా, ప్రపంచంలో ఏ శక్తి నిరోధించగలిగేది కాదు



# వెలుగు - శాంతి

## ఆర్. ఎస్. సుదర్శనం

బాహ్యనేత్రముల కెదురై పథము నిండి
చిత్రవర్ణవిన్యాసమ్ము చేసి, బ్రదుకు
సర్వమున్ లోగొనెడు కాలసర్పమొండు-
ఛాయయై వెంబడించి విశ్రాంతిలేని .
చోదకత్వము వహియించు స్ఫూర్తియొండు-
గోచరముగాని హృదయ నిగూఢశక్తి
సువ్యక్తమొనర్చు తార్కిక సూత్రశక్తి
ముందు వెనుకలై నగ్గానిపోవుచుండు!

"నిరపరాధిని నన్నేల చెఱగొనంగ?
నోచుకొనలేద స్వేచ్ఛకేను? వినువీధి
కెగసి పోనీవు, బంధింతువేల స్వామి?
మాయబంధమ్ము లివియేమి! మఱపుతెఱల

వెనుక జన్మాంతర స్మృతు లనెడు కాగఁ
డాల దోబూచులాట నాకేల స్వామి!
అంధకార నిశ్శబ్ద హృదంతరమ్ము
మ్రోగ చలియించు దివ్వెల మువ్వలేల!
'వెలుగు-శాంతి' నన్వేషించు స్వేచ్ఛవలయు!!

బహుమతి పొందిన కవిత

# న్యూఢిల్లీ లేఖ

సోషలిస్టులు ఎప్పుడూ కాంగ్రెసు పార్టీకి పేదబంధువులుగా మసులుతున్నవారే. కాంగ్రెసునుంచి వారిని విడదీస్తున్నది వారి ప్రతిష్ఠే గాని, సిద్ధాంతాలు కాదు. వారుచేసే ఆర్భాటానికికూడా ఇప్పుడు విలువలేకుండా పోయినది

ఇక స్వతంత్ర సభ్యులమాట. వీరికి ఏవిధమైన బాధ్యతలులేవు. కనుక సహజంగానే వీరొక శక్తిగా రూపొందే అవకాశం పూజ్యం.

ఎన్నికలు సమీపిస్తున్నాయి కాబట్టి, ప్రతి సభ్యుడు తన నియోజకవర్గంలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు. దేశం తన సంగతి తానే చూసుకుంటుంది.

పాశ్చాత్య నూనె కంపెనీలు "ధరల యుద్ధం" కొనసాగిస్తున్నాయని గనులమంత్రి ఆరోపిస్తున్నారు. నిజానికి రష్యాతో నూనె ఒప్పందం కుదుర్చుకునేప్పుడే ఇలాంటి యుద్ధం సంభవించవచ్చునని ఆయన ఊహించారు. ఈ సందర్భంలో పత్రికావిలేఖరులు "ప్రత్యేక సమాచారం"కోసం పోటీలుపడ్డారని ఆ తరువాత జరిగిన సంఘటనలవల్ల తెలిసింది.

ఈ గొడవ అంతా ఎలా ప్రారంభమైనదో ఇప్పుడు చెబుతాను. రష్యానుంచి నూనె దిగుమతి అయిన తరువాత సుమారు నెల రోజులకు, ఒక వార్తాపత్రిక, ఆ నూనె అమ్ముడు కాకుండా అనవసరంగా బొంబాయిలో నిల్వఉన్నదని ఒక వార్త ప్రకటించింది. ఆ తరువాత, ఇతర వార్తాపత్రికలు ఈ విషయాన్ని వివరించడానికిపూనుకొని, బొంబాయి రవాణాశాఖకు కావలసిన నూనె సరఫరా చేయడానికి స్టాండర్డ్ వాక్యూమ్ కంపెనీ తక్కువ ధరకు టెండర్ సమర్పించిందనీ, అందువల్లనే రష్యానుంచి దిగుమతి అయిన నూనె నిల్వఉండిపోయిందనీ ప్రకటించాయి. గనులమంత్రి హుటాహుటిగా కొన్ని రాష్ట్ర రాజధానులకు వెళ్లి రష్యన్ నూనె కొనిపించడానికి ప్రయత్నించారు. ఆ తరువాత బొంబాయిలో, రాష్ట్ర రవాణా కంపెనీల మేనేజర్లు సమావేశమై, అఖిల భారత స్థాయిలో అత్యధిక లాభం సమకూరాలంటే ధరలు ఏవిధంగా ఉండాలి అనే విషయం పరిశీలించారు.

వేరొకవంక నూనెకంపెనీలు, రష్యన్ నూనెసరలు పడగొట్టటం తమ ఆశయం కాదని ప్రభుత్వానికి హామీ ఇవ్వడమే కాక, ఆ నూనెను తమవద్ద నిల్వచేయడానికి సైతం సంసిద్ధత తెల్పాయి. మంత్రి ఎప్పటికప్పుడు అవసరమైన సమాచారం తెలుసుకోగలిగేందుకు భారత నూనెకంపెనీ శాఖాకార్యాలయం న్యూఢిల్లీలో ఏర్పాటు కాగలదని కూడా తెలిసింది.

ఇక్కడ కొన్ని విషయాలు దాపరికం లేకుండా చెప్పాలి. భారత నూనెకంపెనీ అనే పేరుతో ప్రభుత్వం ఏర్పాటు చేసిన మార్కెటింగ్ సంస్థ కేవలం కాగితాలలోనే ఉన్నది. ఈ సంస్థకు సిబ్బందిగాని, నూనె నిల్వచేసేందుకు తగు సదుపాయాలుగాని లేవు. ఆఖరికి ఒకపంపు కూడా దీనికిలేదు. ఈ సంస్థ ఏర్పాటైన వెంటనే, శ్రీ కృష్ణమీనన్ ధర్మమా అని, బ్రిగేడియర్ లూథ్రా నాయకత్వాన 12 మంది సైనికోద్యోగులు మార్కెటింగ్‌లో ఉన్నత శిక్షణ పొందేందుకు రష్యా వెళ్లారు. వీరు ఇటీవలే స్వదేశానికి తిరిగి వచ్చారు.

భారతదేశానికి తమ దేశంనుంచి నూనె పంపే విషయమై రష్యనులు మంచి ఆసక్తి

(62వ, పేజీ చూడండి)



# రోడ్డు రోలరు— ఇంజను—

**తిప్పావఝుల వెంకట్రామయ్య**

విశాల గదిలో బల్లమీద బోర్లాపడుకుని చిలిపితనం చిలికే తన విశాల వినీల నయనాల్తో కిటికీగుండా వీధిలో వచ్చే పొయ్యే బండ్లవైపు చూస్తోంది. పొడుగాటి తెగ బారెడు నల్లనిజడ జడకుచ్చుల బరువుకు బల్లమీదనుండి జారి నేలను తాకుతోంది. రాత్రి పడుకోబోయేప్పుడు తీసి నీళ్ళల్లోపెట్టి ఉదయమే పెట్టుకున్న విరబూసిన మల్లెలు జడలోంచి జీరాడుతూ గుప్పున వాసనలు వెదజల్లుతున్నయ్. కొద్దిగా పైకెత్తిన పాదాలమీంచి క్రిందికిజారిన పసుపు పచ్చవన్నె పట్టుపరికిణీ ఆమె శరీరకాంతితో పోటీ చేయలేక వెలవెలపోతోంది. క్రిందికి జీరాడుతున్న ఆమె నైలాన్ పమిటతో బాబు బూచాట ఆడుకొంటున్నాడు. దిద్దించిన అక్షరాలు చెరిపేసి వరసాగ్గా పలకమీద గున్నాలు పెడుతున్నాడు నాలుగేళ్ల రవి. గోపీ కూనిరాగాలు తీస్తూ లెక్కలు చేస్తున్నాడు.

ఇవేవీ గమనించకుండా విశాల ప్రొద్దున జరిగిన సంఘటన్ను గురించే ఆలోచిస్తోంది. అందులో తన తప్పేమిటో ఎంతకూ అరమవటంలేదామెకు. ప్రొద్దున్నే అమ్మ కాఫీ పెట్టమంటే పెట్టింది తను. పిల్లలంతా వచ్చారు. వరసగా లోటాల్లోపోసి ఒక్కొక్కరికిస్తోంది తను. తనకు ముందివ్వలేదని రవి అలిగి వెళ్లిపోయాడు. తనకు కొంచెమేనని రవణ లోటాఎత్తి దిమ్మరించాడు. 'పోరా! వెధవా ఈరోజు నీకు కాఫీలేదు పొమ్మని వాణ్ణి గదిమి రవిని బ్రతిమాలి పిల్చుకొచ్చేసరికి 'నా లోటాతో, గోపీ కెందు కిచ్చావ్! నేను త్రాగను పో!' అని వాడు క్రిందబడి దొర్లడం సాగించేడు. వాణ్ణి రెండంటించేసరికి వాడు గోల ప్రారంభించేడు. ఈలోపలబాబు పోయి గిన్నెడు కాఫీ దొర్లించేసేడు. రవణ పోయి పిర్యాదు చేశాడేమో, పెరట్లో

పనిచేసుకుంటున్న అమ్మ వచ్చింది. వచ్చి చూచింది. తప్పంతా తనదే ఐనట్టు తన్ను తిట్టింది. తన కేమీ పని చేతగాదట. పిల్లల్ని చెండుకుతింటానట. తనకూ మండిపోయింది. తన్ను తిట్టినందుకుగాదు. అలా పిల్లల్ని వెన కేసుకువచ్చినందుకు. అమ్మ రెండంటే బదులు నాలుగంది తను. అమ్మకు కోప మొచ్చి చెయ్యెత్తి కొట్టబోతే చేయి విదిలించేసి వచ్చి అలిగి పడుకొంది.

'ఛీ - వెధవ పిల్లలు! మరీ హద్దూ పద్దూ లేకుండా ఆడుతున్నారు. తనైతే ఇలాగే పెంచేదా! అమ్మనయితే చెవులుపట్టి ఆడిస్తారు గాని నాన్న ఇంటికొస్తే సరి కుక్కిన పేనుల్లా పడుంటారు. ఇంతకూ వాళ్ళ నను కొని ఏం ప్రయోజనం! అమ్మ అలుసు చూసుకొనిగదా వాళ్ళట్లా ఆడేది! ఏమన్నా అనక ముందే వాళ్లను వెనకేసుకొస్తుందాయెను! ఏమిటో మరి తాను నాన్నకు ముద్దుల కూతు గట, తనమీద ఈగ వాలనీడట నాన్న! ఇలాగైతే ఐనట్టే అంటుంది అమ్మ. ఇంతకూ తన చదువు చేసిందంటుంది. ఆమె పిచ్చిగాని తన చదువేమి చేసిందో...' ఇలా సాగిపోతున్న విశాల ఆలోచనలకు బ్రేకు పడింది.

'అక్కయ్యా! ఈ లెక్కెలా చెయ్యాలో చెప్పవే!' అంటూ గోపీ లేచివచ్చాడు. 'పోరా! పో, వెధవ లెక్కలూ నువ్వూ.' అని కసిరికొట్టింది విశాల. 'అమ్మా! అక్కయ్యను లెక్కడిగితే చెప్పలేదేవ్?' అని వాడొక్క గావుకేక పెట్టేడు. విశాలకు ఒళ్ళు మండింది. లేచి వాడి నెత్తిన ఒక్కటి అంటించింది, 'వెధవా, నోరు మూసుకో'మని. వాడు కేకలు వేయబోతే నోరు మూసింది. వాడు కప్పెగిరిపోయేట్టు ఏడుస్తూ గోల చేయడం సాగించేడు, వాకిటవంక చూస్తూ.

ఇంతలో అమ్మ వస్తున్న శబ్దం కాసే ఐంది. విశాల గుట్టుగాపోయి బల్లమీద పడుకుంది, సరోష నయనాల్తో. అవైపు ముఖముంచుకొంది. పార్వతమ్మ రాగానే ప్రారంభించింది. 'ఏమిరా! ఏమి ముంచుకుపోయిందిరా అలా గోలచేస్తావ్!...అబ్బబ్బ! ఈ స్కూళ్ళకు సెలవులైతే ఇచ్చేరుగాని నా దుంప తెగిపోతోంది బాబూ! ఇంతకూ ఏమి జరిగిందిరా, గోపీ!' అని ప్రశ్నించింది. గోపీ ఏడుపు మానలేదు. నాలుగేళ్ళ రవి అందుకున్నాడు.

'మరేం! అక్కయ్య, గోపి గొంతు పిసికిందేవ్!' అంటూ-వింటూ పడుకున్న విశాల ఒక్క ఉదుటున లేచి వాణ్ణి నెత్తిన మొట్టింది. 'ఎప్పుడురా నేను గొంతు పిసికింది!' అంటూ 'అయ్యో, అయ్యో, నా ఎదుట్నే అలా పసివాణ్ణి చావగొట్టున్నావే, ఇంక నే లేనప్పుడు కొట్టటం అబ్బురమటే! ఐనా అడ్డమైన చాకిరీ చేస్తున్నాగదా! పెద్దపిల్లవు, చిన్నవాళ్లను ఆడిస్తామనన్నా

# రోడ్డు రోలరు - ఇంజను -

వెధవగోలైపోయిందమ్మా! పైగా ఏమన్నా అంటే ఎదురుతిరగడం. ఆయన గారివత్తా సొకటి ముద్దులకూతురికి. ఎట్లన్నా ఏడవండి!' అని కేకలేసి విసురుగా ఇవతలికివచ్చింది పార్వతమ్మ. నిమ్మకు నీరెత్తినట్టు నిశ్చలంగా పడుకొంది విశాల. ఇవతలికివచ్చిన పార్వతమ్మ గడపలో చెప్పులచప్పుడు విని తలెత్తి చూసింది. ముఖకవళికల్ని క్షణంలో మార్చుకుంటూ 'రా, అన్నయ్యా' ఇదేనా రావడం? అంటూ పలకరించింది. 'ఏమిటమ్మాయ్ కేకలేస్తున్నావ్' అంటూ ప్రవేశించారు పరంధామయ్యగారు. మామయ్య మాట వినగానే పిల్లలంతా చుట్టుముట్టేరు. 'ఏమిటో అన్నయ్యా! ఈస్కూళ్ళకు సెలవులివ్వడంతో నాదుంప తెగిపోతోంది. విశాల ఏండ్లొచ్చేకొద్దీ మరీ శుద్ధమొద్దవతారం ఐపో



చిత్రకారుడు : కలువకొలను సదానంద
(పాకాల)

తోంది. పిల్లలను కొట్టడం ఏడిపించడం. అడేమంటే నామీదికే వస్తోంది, చూడు. పొద్దుట్నుంచి అలిగి ఎలా పడుకొనుందో! దీనితో ఎలా వేగడమో తెలియకుండా ఉంది అన్నయ్యా!' అని చెప్పుకుపోతోంది. 'అదంతా వయసులో మార్పులు తెచ్చే సంరంభాన్ని తట్టుకోలేక చేసే అల్లరిలే అమ్మాయ్! పెండ్లి చేసేశంటే అన్నీ అణిగిపోతయ్!' అని నవ్వుతూ గదిలోకి చూచి 'ఏమే! విశాలా!' అని పలుకరించారు పరంధామయ్య. 'ఏమి పెండ్లో అన్నయ్యా! పిల్ల చూడబోతే గున్నమావిలా ఎదుగుతోందా! ఆయన చూడబోతే ఏసంగతీ పట్టించుకోరు. దానిరాతెలాగుందో మరి!' పెండ్లిమాట ఎత్తేప్పటికి పార్వతమ్మ స్వరంలో గాద్గదికత ప్రవేశించింది.

'దానికేమే బంగారంటి పిల్ల! ఎవరైనా కళ్ళకద్దుకు చేసుకుంటారు కొంచెం చురుకుపాలెక్కువనేగాని, చిదిమి దీపం పెట్టుకో వచ్చుకదే!' అని ఎందుకన్నానా అమాట అని నాలిక్కొరచుకొన్నారు పరంధామయ్యగారు.

పార్వతమ్మ సమయం జారవిడువలేక పోయింది.

'ఎవరో ఎందుకన్నయ్యా' మనరామ్మూర్తి ఉన్నాడుకదా! లక్షణంగా మేనరికం కావాలంటే నిన్నడ్డే దెవరన్నయ్యా' అంది.

'నీకు తెలీనట్టు అడుగుతావమ్మాయ్! నాదేముంది చెప్పు. ఏమన్నా అన్నానంటే 'గయ్' మని వస్తుంది మీవదిన. నామటుకు నాకు తప్పక చేసికోవాలనే ఉంది. రాముడిక్కూడ ఇష్టమే. ఏంజేస్తాను! మీవదిన నేమో! మొండిపట్టు పట్టిందాయెను' అన్నారు పరంధామయ్య.

'ఐనా వదిన అలా మాట్లాడ్డం భావ్యమేనా అన్నయ్యా! ఆస్తిపాస్తులు శాశ్వతమా! సంబంధాలు చూసుకోవాలిగాని. వదిన కోరినంతకట్నం మేమెలా ఇవ్వగలం చెప్పు. ఆయన తెచ్చే జీతపురాళ్ళు కుటుంబపోషణకే చాలీచాలనిస్థితిలో ఉండె. ఇంతకూ 'ఎలాఉందో దానిరాత' అని కళ్ళనీళ్ళు పెట్టుకొంది పార్వతమ్మ.

'సరే, చూద్దాంలే అమ్మాయ్! నేనిలా వచ్చినసంగతి తెలిసినా ఎగిరి పడ్తుంది. దాన్నెలా ఒప్పించాలో అర్థమవడంలేదు. సాధ్యమైనంతవరకు చెప్పి చూస్తాను.' అని అన్నయ్య చెప్తోంటే పార్వతమ్మ ప్రాధేయపడుతోంది వదినెన్నెలాగయినా ఒప్పించమని.

అంతా వింటున్న విశాల చప్పున లేచింది. 'ఆరోడ్డురోలరు బావను నే నేంచేసికోను. మీరెవ్వరూ అత్తయ్యను బ్రతిమాల నవసరం లేదు. ఇంతకు టీచరేగదా ఆయనచేయబోయే లేదు. పైగా తన్ని ఏడిపించడం!

ఉద్యోగం. ఇంతమాత్రపు సమ్మంధం ఇంకెక్కడా దొరక్కుండా పోదు. పెండ్లి కాకుంటే హాయిగా ఉద్యోగం చేసికొంటాను' అని చఱచఱ వెళ్లిపోయింది విశాల.

'చూశావా అన్నయ్యా! దాని పొగరు. ఇలానే ఎదురతిరుగుతోంటే ఎలా వేగేది చెప్పు. ఇంతకూ స్కూలుఫైనలు పరీక్ష రాశాననేగదా దీనికీగర్వం. ఉద్యోగం చేసుకొంటుందట. ఉద్యోగం! హాయిగా బి.ఇడి. చదివి, హైస్కూల్లో మాస్టరుగా ఉండేవాణ్ని అలాఅంటుందా! దీనినీల్గుడుకు ఆయన ఏకలెక్చరును తెస్తారో నేనూ చూస్తాగా! అవ్వ! అయినా ఇంతగర్వమా' అని నోరు నొక్కుకుంటూ విస్తుపోతోంది పార్వతమ్మ. 'పెండ్లయితే పొగరూ గిగరూ దేశంమీద పోతయ్లే అమ్మాయ్. ఆమూడు ముడ్లూ పడితే పొగరుబోతుకోడెను ముకుదాడు పొడిచినట్లే. వెళ్లొస్తానమ్మాయ్!' అంటూ ప్రయాణమయ్యాడు పరంధామయ్య కోడలిమాటలకు నవ్వుకొంటూ.

'అయ్యో! ఇప్పుడు వెళ్ళడమేమిటన్నాయ్! వంటయింది. భోంచేసి వెళ్దువుగాని' అని పార్వతమ్మ అంటున్నా 'ఎందుకమ్మా బస్సు ఉండనే ఉందిగా. అర్ధగంట ప్రయాణం నాకోసం కాచుకొనిఉంటారు.' అంటూ వెళ్లిపోయాడు పరంధామయ్య.

'ఏమిటో ఈ తండ్రీ కూతుళ్ళ ధైర్యం ఏమి చూసుకొనో వీరి అహంభావం. ఈమె చూడబోతే ఇట్లా. ఆయన చూడబోతే అట్లా. అసలే పట్టించుకోరు. నే నొకతెను దిగులుపడాల్సిందే.' అన్న మెలాపోయిందో ఏమిటో అనుకుంటూ వంటింటివేపు నడిచింది పార్వతమ్మ.

భర్త భోంచేసేప్పుడు అంతా చెపుతోంది పార్వతమ్మ. ప్రక్కనే కూచుని వింటోన్న విశాల 'ఏమిటి నాన్నా! ఆయనేమో భార్య నడగాలో అని ఇదవుతోంటే ఈమె ఎలాగైనా వప్పించన్నయ్యా అని ఏడుస్తోంది. నాకు మండిపోయి మీ రెవరూ బ్రతిమాలనవసరంలేదు. నేనా బావ నసలు చేసికోనన్నాను ఇది తప్పా నాన్నా?'

'లేదమ్మా! మా బాగా చెప్పావ్ లేకుంటే ఏమిటో దీని పిచ్చిగాని అంతఇష్టం లేనివారిని పట్టుకు ప్రాకులాడితే మాత్రం ఏం ప్రయోజనం చెప్పు. వాళ్ళకేదో గొప్ప ఆస్తిపాస్తులున్నాయని దీని ఆరాటం. నలుగురూ పంచుకుంటేగదా తేలేది.' అని ఆయన విసుక్కుంటుంటే 'ఇంతకూ మీ అబ్బా కూతుళ్ళొకటి. నేనొక్కదాన్నే పరాయిదాన్ని. చదివించొద్దో అంటే వినకుండా అలా నెత్తి కెక్కించుకున్నారు నామాట ఎవరికీ పట్టదు' అని కన్నీళ్ళు

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి రోజంతా నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి!



ఎందు చేతననగా: ఒకసారి తోముకుంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 వంతుల వరకు దంతక్షయము లేకుండా చేసి, దుర్వాసన పోగొడుతుంది.**

భోజనం చెయ్యగానే కాల్గేటును ఉపయోగించి బ్రష్‌తో పళ్ళు తోముకొన్నట్లయితే అనేకమందికి దంతక్షయం కావడం ఆగి పోతుందనీ, దంత వ్యాధుల చరిత్రలో ఇది అపూర్వ విషయమనీ, శాస్త్రీయ పరిశోధన వల్ల ఋజువైంది అంతేకాదు నోటినుంచి దుర్వాసన వచ్చేవారు దీనిని వాడినట్లయితే 10 మందిలో 7 మందికైనా వెంటనే గుణమిస్తుందనికూడా ఋజువైంది ఒక్క కాల్గేట్ విషయంలోనే ఇవి ఋజువైనవి

కాల్గేట్‌నుంచి నురనురమంటూ వచ్చేనురగ పళ్ళ సందుల్లోకి లోపలికంటా చొచ్చుకువెళ్ళి అక్కడ ఇరుక్కుపోయి ఉండే ఆహార పదార్థాల నలుసులను బయటికి గిలా వేస్తుంది పళ్ళు చాలా చెడి పోడానికి, దుర్వాసన రావడానికి కారణం ఆ నలుసులే

కాల్గేట్‌తో పళ్ళు తోముకోవడమంటే పిల్లలకు చాలా సరదా ఎందుకంటే దానినుంచి వచ్చి చాలా సేపు ఉండే పిప్పరమెంటు వాసనంతే వాళ్ళు చెవి కోసుకుంటారు




మీకు పళ్ళపొడి అలవాటైతే, కాల్గేట్ పళ్ళపొడివల్లకూడా ఇన్ని లాభాలూ ఉన్నాయి ...... ఒక డబ్బా కొన్ని నెలలు వస్తుంది:

కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతక్షయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం. ..ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

పెట్టుకుంది పార్వతమ్మ...............

'ఏమండీ, మీచెల్లెలుగారింటికి వెళ్ళొచ్చారా! అసలు మీరు వెళ్ళకుండా ఎలా వస్తారులెండి!' అంటూ ఎదురుగుమ్మంలోనే స్వాగతం చెప్పింది భర్తకు లక్ష్మీదేవమ్మ.

'ఆ! ఏమివెళ్ళడంలేవే, ప్లీడరుగారింటికి వెళ్లాలంటే అటేగా వెళ్ళాలి. సరిగ్గా వీధి గుమ్మంలోనే అమ్మాయి నిల్చునుంటే తలొంచుకొని ఎలా వెళ్లేదే? పోయిపదినిముషాలైనా కాకముందే బయలుదేరి వచ్చేశాను' అని కుంచించుకపోతూనే సమాధానం చెప్పారు పరంధామయ్య కోటువిప్పి స్టాండుకు తగిలిస్తూ.

'అవా! అయితే వెళ్ళే వచ్చారన్నమాట. నేనప్పుడే అనుకొన్నాను లెండి. మీ కెలాగైనా ఆ నాపసానిని కోడలుగా తెచ్చుకోవాల్ని ఉంది. మీరూ మీచెల్లెలూ కలిసి ఏదో కుట్రలు పన్నే ఉంటారు లెండి.! పాపం, ఏమంటోంది ఆ వంగనాచి చెల్లెలు!' అని అభినయిస్తూ ప్రశ్నించినది లక్ష్మీదేవమ్మ.

'ఆ, చెల్లె లేమంటుందే నీ పిచ్చిగాని, ఉత్తఅమాయకురాలు. ఒక్కటే ఏడుస్తోంది. ఈ ఇంట్లో నాకెంత స్వతంత్రముందో ఆ యింట్లో దానికీ అంతేగద! మా ఇద్దరికి ఒకే కుంచెతో వ్రాసినట్లున్నాగా బ్రహ్మ. ఐనా నేనింకా ఏమో అనుకొన్నానుగాని నీవన్నదే అక్షరాలా నిజమయ్యేట్లుందేవ్. ఆ కోడలు పిల్ల ఎన్నెన్ని మాటలడిగిందని. అబ్బో! అబ్బో! ఆ సంబంధం తప్పిపోబట్టె సరిపోయిందిగాని లేకుంటే నిన్నూ నన్నూ కూడ గుంజ కీడ్చి కట్టేదేనే అది!'

'ఐతే! మీకూ తెలిసొచ్చిందన్నమాట. ఏముందేమిటండీ. ఇంతకూ జరిగిన సంగతులు చెప్పకుండా ఏమిటండీ సోది!' ఆతురతగా ప్రశ్నించింది లక్ష్మీదేవమ్మ

'ఆ! ఏముందే! దాన్నో ఎమ్. బి. బి. ఎస్. చదివే కుఱ్ఱాడు చూచి వరించి దమ్మిడీకట్నం లేకుండా పెండ్లికి వప్పుకున్నాట్ట. ముహూర్తాలు పెట్టుకోవడమే తరువాయిట. ఈ సంగతిచెప్పి 'అబ్బా కూతుళ్లు నామాటేమైన పడనిస్తారా!' అని చెల్లెలు ఒక్కటె ఏడుస్తోంటే ఆ పిల్ల అన్నమాటలు గాదు. నీ కొడుకో రోడ్డురోలరట. నీ వోరబ్బుడు ప్రతానివట. నిన్ను లేవదీయాలంటే కాడి మానతో పట్టాల్సిందేనట. తను అదృష్టవంతురాలవటంవల్లే మన సంబంధం తప్పిపోయిందట. ఇక అయిదువేలుగాదు పదివేలిచ్చే సంబంధంచూసి చేసుకోమని రుబ్బుడు ప్రతం అత్తయ్యతో చెప్పమనిచెప్పింది విన లేక చక్కా వచ్చేను. దాని ఇకఇకలుగావు, పకపకలుగావు. మనకాపిల్లవద్దో అని నువ్వంటుంటే విననందుకు నాకు మంచి ప్రాయశ్చిత్తమే జరిగింది!' అని ముగించారు పరంధామయ్యగారు; భార్యముఖంలో మార్పులు పరిశీలిస్తూ.

# రోడ్డు రోలరు- ఇంజను-

"ఆ! ఎవిటే! నిన్నగాక మొన్న నాకళ్లెదుట పుట్టి కళ్లుదెరిచిన పిల్ల! దానికింత పొగరా! నిన్నమొన్నటిదాకా గతిమాలి నా చుట్టు తిరిగారే కోడల్నిగా చేసుకోమని. ఇంతలోకి కళ్లు నెత్తికొచ్చాయా! పైగా నన్నే మాటలనడమా! చూస్తాను! దాని తడాఖా! మంచి రోజెప్పుడో చూడండి. ఆ! మంచి రోజేమిటిలెండి! మధ్యాహ్నమే ప్రయాణం. భోజనం త్వరగా కానివ్వండి. మీరుగూడ నావెంట రావాలి. మన్నిగాదని పరాయివాళ్లకెలాయిస్తారో అదీ చూస్తాను." అని గది గుమ్మంకేసి నడిచి 'ఒరే అబ్బాయ్' అని పిలిచింది. లక్ష్మీదేవమ్మ అంతవరకూ గదిలో కూర్చొని సంభాషణంతా చెవులు దోరగించి వింటూన్న రామ్మూర్తి ఏమీ తెలియని వాడ్లా 'ఏవమ్మా' అంటూ వచ్చేడు.

'విశాలను చేసికోడానికి నీకేమి అభ్యంతరం లేదుగదూ!' అంది. అమ్మ అలా ఎందుకడుగుతోందో తెలియని రామ్మూర్తి తెల్లమొగం వేసేడు. ఆమె జవాబు కొరుమూడకుండానే 'నిన్నడిగేదేమిట్లే! నీ మొగం చూస్తేనే తెలియటంలా' అని భర్తవైపు 'ఎలాగైనా అది నాకోడలుగా రావాలి. దానిసంగతి చూడాలి. నామాటకు తిరుగంటూ లేదు. లేవండి భోజనానికి' అంటూ భర్తను త్వరపెట్టింది లక్ష్మీదేవమ్మ.

ఐదువేలు కట్నమిస్తే తప్ప తన గడప త్రొక్కనవసరంలేదని ప్రతిజ్ఞచేసిన వదిన తనంతట తానేవచ్చి పిల్లనిమ్మని ఎందుకడిగిందో! ఆయన మీరడిగిన కట్నంలో పదోవంతైనా మేమివ్వలేమని నిక్కచ్చిగా చెప్పేసినా కట్నం లేకుండానే పెండ్లికి ఎందుకొప్పుకుందో పాపం పార్వతమ్మకు ఎంత తల బ్రద్దలుగొట్టుకున్నా అర్థమవలేదు. ఇంతదగ్గర ముహూర్తం కుదిరిందెలాగో అనుకుంటూ ఆమె పెండ్లిపనుల సంరంభంలో మునిగిపోయింది.

భిక్షుకి-చంటిపిల్లకు పొద్దుటినించిపాలు లేవు, బాబూ?

పెద్దమనిషి—నాదగ్గర పాలు లేవు, పో.

బి. రాజేశ్వర మూర్తి (చిలకలపూడి)

ఆ రాత్రి శోభనపురాత్రి.

ముత్తైదువుల సందడంతా తలుపుదగ్గరే ఆగిపోయింది. విశాలను బలవంతంగా లోపలికి నెట్టి తలుపుమూసి గొళ్లెంపెట్టి అందర్నీ వెళ్లిపొమ్మని చెబుతోంది విశాలతల్లి.

విశాల సిగ్గుతో తలుపు దగ్గరే నిల్చొని వ్రేలితో చీరను మెలిపెడుతోంది. ఒక్కసారి తలెత్తిచూసి దించుకొంది. బుష్‌షర్ట్‌తో బావ రొయింతో అందంగా కనిపించేడు. 'కొంచెం లావైతేమాత్రం మా బావకేం మారాజా!' అనుకొంది విశాల.

తలుపు దగ్గర సందడి పూర్తిగా సర్దుకొన్నాక రామ్మూర్తి లేచి అప్సరసలాగా అలంకరించిన విశాలను తదేకంగా చూస్తూ సమీపించేడు.

విశాల మరీ సిగ్గుతో కుంచించుకపోయింది.

'ఏం! మరీ, అంతగా సిగ్గుపడుతున్నావ్! విశాలా! నేను ఎప్పటి రోడ్డురోలరు బావనేగా! మానాన్న కష్టపడి ఈ సుతిమెత్తని ఇంజన్ను అంటగట్టేడు. ఎలా భరిస్తావో ఏమిటో' అంటూ వెనకనించీ విశాల రెండు భుజాలమీద చేతులువేసి ముందుకు నడిపిస్తూ పాన్పుదగ్గిరికి తీసుకుపోయాడు.

విశాల కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. ఆరోజు అమ్మమీదికోపంతో మామయ్యతో అన్నమాటలన్నీ బావకు చెప్పాడుగాబోలు ననుకొంది. మామయ్యమీద ఎక్కడలేని కోపమూ వచ్చేసింది.

"ఏం! విశాలా పలుకవు!" అంటూ గడ్డం పట్టుకొని ముఖాన్ని పైకెత్తి చూసిన రామ్మూర్తి ఆశ్చర్యపోయేడు.

"ఇంతమాత్రానికేనా విశాలా! ఏడుస్తావెందుకు. నిన్నేమన్నానని..' అంటూ దగ్గిరికి తీసుకున్నాడు రామ్మూర్తి. విశాల అతని కౌగిట్లో కరిగిపోతూ "నేనలా అనాలని అన్లేదు. అమ్మమీద కోపంగాఉండి...' ఏదో చెప్పబోయింది విశాల.

"పిచ్చిదానా! నీవలా అనబట్టే మన పెండ్లి ఇంతత్వరగా అయిందని నీకు తెలుసా!" అని సున్నితంగా ఆమెవీపు నిమురుతూ జరిగిన సంగతంతా చెప్పేసేడు రామ్మూర్తి.

మరునాడుగదిలో దేవుడిముందు కూర్చొని భగవద్గీత పారాయణం చేస్తోన్న పరంధామయ్య, కొడుకూ కోడలూ కలిసికట్టుగా వచ్చి తన పాదాలకు నమస్కరించేసరికి ఆశ్చర్యపోయినా కళ్లద్దాల్లోంచి వారిద్దరివంకా చూసి క్షణంలో సంగతి గ్రహించేసి చిఱునవ్వునవ్వుతూ "శీఘ్రమేవ ఒక చిన్న రోడ్డురోలరు ప్రాప్తిరస్తు" అని దీవించేరు. నిండుహృదయంతో దంపతులిద్దరూ తెల్లబోయి ఒకరిముఖం ఒకరు చూసుకుని నవ్వుకుంటూ వళ్లిపోయేరు. 

# మానవదేహశాస్త్రీయ

## క్రిమిదోషం

**డా॥ గాలి బాలసుందరరావు**

ఇన్‌ఫెక్షన్ అంటే టిష్యూలలోకి క్రిములు ప్రవేశించడం అని యిదివరకే తెలుసుకున్నాము. ఇన్‌ఫ్లమేషన్‌కు ముఖ్య కారణములలో ఇన్‌ఫెక్షన్ ఒకటి. రసాయనిక ద్రవ్యములవల్లా వేడివంటి శక్తులవల్ల శరీర భాగములు ఇన్‌ఫ్లేం అయినా, క్రిమిదోషం ఏర్పడితేనేగాని చీముపట్టడం జరుగదు.

మానవ నాగరికత ప్రారంభమైనది మొదలు రోగానికి కారణం ఏమిటి అన్న ప్రశ్న బుద్ధిమంతులను ఎదుర్కొంటూనే వున్నది. "పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధితః" అన్నారు వేదాంతులు. పిత్త, వాత, శ్లేష్మములనే త్రిదోషములలో ఒకటో, అన్నీనో దేహంలో ప్రకోపించినప్పుడు వ్యాధి ఏర్పడుతుందన్నారు ఆయుర్వేద శాస్త్రజ్ఞులు. మన దేశంలో అనాదినుంచీ వున్న వైద్య విధానం ఆయుర్వేద వైద్య విధానం. శవఖండనం మన దేశంలో మహాపాపంగా పరిగణింపబడింది. ఫిజిక్స్, కెమిస్ట్రీ యీనాడు వృద్ధిచెందిన పద్ధతిలో ఆనాడు వృద్ధిచెందలేదు. సాధారణ దృష్టికి కనుపించని సూక్ష్మవస్తువులను చూడడానికి అవసరమైన "మైక్రోస్కోప్" వంటి పరికరములు ఆనాడు లేవు. శరీరమును అనేక కోశములుగా - అంటే ఒకే కార్యమును సాధించడానికి సహకరించే అంగముల సముదాయము-భాగించి, త్రిదోషముల ఫలితం ఆ కోశములపై ఎల్లా వుంటుంది, అప్పుడు యేర్పడే లక్షణములు ఏమిటి? వాటిని సవరించే ఔషధములు ఏమిటి? ఈ విషయములను గురించే వారు ఆలోచించారుగాని, శరీరమును ఖండించి, అందులో వున్న జీవకణాల స్వరూప స్వభావాదులను గురించి, టిష్యూ భేదములను గురించి, ప్రోటోప్లాజంలో వుండే రసాయనిక పదార్థములను గురించీ, వారు యీనాడు మనం ఆలోచించిన పద్ధతుల మీద ఆలోచించినట్లు కనబడదు. ఈనాటి వైజ్ఞానిక వైద్య విధానం (Scientific Medicine) అన్ని విధములయిన వైద్య విధానములను వినియోగించగా ఏర్పడ్డది. విజ్ఞానం ఇంతగా వృద్ధిచెందిన తరవాతకూడా జర్మనీలో హానిమన్‌గారు, హోమియోపతీ విధానంలో, శరీర కార్యక్రమమును నడిపించే కేంద్రశక్తి-దీనినివారు డైనమిస్ అన్నారు - సోరా, సిఫిలిస్, సైకోసిస్ - అనే వ్యాధి విశేషముల వల్ల క్రమం తప్పినప్పుడు శరీరంలో రోగం యేర్పడుతుందని భావించారు. ఆ విధానంలో రోగి మానసిక లక్షణములనుబట్టీ, దృశ్యమైన శరీరలక్షణమునుబట్టీ, మాత్రమే చికిత్స జరుగుతుంది. వారికి ఏ అవయవంలో ఏ టిష్యూ వున్నది, ఏ రసంలో ఏయే రసాయనిక ద్రవ్యములున్నవి, అనే విచక్షణ అవసరంలేదు. అందుకని అవి పరిశీలించే సాధనములుగానీ, పరిశీలించినవాటిని వర్ణించడానికీ వివరించడానికీ నూతన పదజాలంగానీ, అవసరం లేకపోయింది. వారికి కావలసిన పరిభాష మాత్రమే వారు నిర్మించుకున్నారు. ఆయుర్వేద విదుల విషయంలోకూడా ఇంతే జరిగింది. అన్ని వైద్య విధానాలకూ ఆదర్శం ఒకటే. రోగాన్ని నిర్మూలించడం, అది సాధ్యం కాకపోతే, రోగం కలిగించే బాధనుండి ఇవ్వగలిగినంత ఉపశాంతి యివ్వడం. ఆ దృష్టితో చూస్తే అన్ని విధానాలూ అంతో ఇంతో విజయాన్ని సాధించినవనే చెప్పాలి. కాని, రోగం రాకుండానే వుండడానికీ, జన బాహుళ్యం అంతా అందుకోసం కొన్ని చర్యలు తీసుకోడానికీ, వారెంత కృషి చేశారో చెప్పలేము.

కొన్ని కొన్ని క్రిములు, కొన్ని కొన్ని రోగములకు ముఖ్య కారణములు అనే అభిప్రాయం, మైక్రోస్కోప్ వచ్చిన తరువాత, ఫిజిక్స్, కెమిస్ట్రీ బాగా అభివృద్ధిచెందిన తరువాత యేర్పడ్డది. అంటే క్రిమి విజ్ఞానం-బాక్టీరియాలజీ - కొద్దికాలంనించే అభివృద్ధిచెందిన శాస్త్ర భాగం

క్రిములన్నీ శరీరాన్ని రోగగ్రస్తము చేసేవి కావు కొన్ని క్రిములు లేకపోతే, కొన్ని శరీర కార్యక్రమములే సాగవుకూడా.

క్రిమి అన్న మాటను 'మైక్రోబ్' అనే ఇంగ్లీషు మాటకు సమపదంగా ఉపయోగిస్తున్నాను.

సాధారణంగా క్రిమి శూన్యమైన టిష్యూలలోకి క్రిములు ప్రవేశించి ఆ భాగములలో రోగ కారకములైన మార్పులను చేసినప్పుడు 'ఇన్‌ఫెక్షన్' యేర్పడిందన్న మాట.

క్రిములలో చాలా రూపములు వున్నవి. కొన్ని పుల్లల్లాగా నిడుపుగా వుంటవి. మరికొన్ని కామా (,) ఆకారంలో వుంటవి. ఇంకా కొన్ని బిందురూపంలో వుంటవి. మరికొన్ని డోలు వాయించే కర్రలాగా, చిన్న గదలాగా వుంటవి. కొన్ని ఏకాకులుగా వుంటవి కొన్ని జంటలుగా వుంటవి. మరికొన్ని చీమలబారులాగా శ్రేణిలో వుంటవి ఇంకొన్ని ద్రాక్ష గుత్తిలాగా గుంపుగా వుంటవి ఏ రూపంలో వున్నా ఏ విధంగా అవి వసిస్తోన్నా అవి కంటికి కనపడేవి కావు కాని రక్తంవంటి పదార్థంలో వాటిని ప్రవేశింపచేస్తే, అవి ఒకటి రెండయి రెండు నాలుగయి నాలుగు ఎనిమి

---

### మార్గదర్శకుడు!

"కృష్ణా గోదావరీ నదీ జలాలు దక్షిణాదికి తరలించకుండా ఒక్కటే మార్గం!" అన్నాడో పెద్దమనిషి నిట్టనిలువుగా నిలబడి చుట్ట మీాటుకుంటూ నలుగురిలో జబర్దస్తీగా..

"ఏమా మార్గం? ఏమా కథ" అన్నాయి తక్కిన చిన్న మనుషులు.

"మరేం లేదు ఈ నవంబర్ మొదటి తేదీనుంచీ ఇవాల్టివరకు మద్రాసుమహానగరంలో రోడ్ల మీాద నిష్ప్రయోజనంగా నిలచిన నడుంలోతు నీళ్లూ కాలువల ద్వారా దక్షిణాదికి తరలిస్తేసరి" అని వళ్లంతా పడ్డ బురద నొక్కసారి చూసుకుని కిమ్మనకుండ కూచున్నాడు ఆ పెద్దమనిషి !!

---

దయి, యిల్లా విపరీతంగా వృద్ధిపొంది 'కాల నీలు' గా ఏర్పడతవి. కాలనీ లంటే అధిక సంఖ్యాకులు నివాసం యేర్పరచుకునే ప్రదేశం. అప్పుడు కొన్ని కోట్ల క్రిములు ఒకచోట చేరినప్పుడు, సాధారణ దృష్టితో, మైక్రోస్కోప్ సహాయం లేకుండానే ఆయా క్రిమి సముదాయమును చూడవచ్చును. ఒక్కొక్క జాతి క్రిమికి ఒక్కొక్క విశిష్టమైన రోగము వున్నట్లే, ఒక జాతి క్రిమి కాలనీకి ఒక విశిష్టమైన వర్ణమూ రూపమూ వుంటవి. అల్లాగే కొన్ని జాతుల క్రిములు. కొన్ని రకముల వస్తువుల మీదనే వృద్ధి పొందుతవి. కొన్ని శాక వస్తువులమీద వృద్ధి పొందుతవి. కొన్ని జంతుజములయిన వస్తువుల మీద మాత్రమే వృద్ధిపొందుతవి. ఇవి ఏకాణు మాత్ర శరీరులు. కాని వీటి దేహంలో సైటోప్లాజం, న్యూక్లియస్ అనే విచక్షణ లేదు. వీటి శరీరంలో రసాయనిక వస్తువులనుబట్టి ఇవి కొన్ని రసాయనిక వస్తువుల సంయోగం పొందినప్పుడు, ఆ వస్తువుల రంగును తమ దేహానికి తెచ్చుకుంటవి. ఈ పై అంశములను అవకాశంగా తీసుకుని క్రిమి శాస్త్రవేత్తలు (బేక్టీరియాలజిస్టులు) ఒక ప్రదేశంలో లభించిన క్రిమిని పెంచి, వాటికి రంగువేసి, పరీక్షించి, ఇది యీ జాతి క్రిమి అని నిర్ణయించ గలుగుతారు. గొంతులో డిఫ్తీరియా అన్న వ్యాధి వచ్చినప్పుడు డాక్టరు క్రిమి శాస్త్రవేత్తను పిలిపించి గొంతులో వున్న తెల్లని పొరమీద రసిని సేకరించి, పరీక్ష చేయించి, డిఫ్తీరియా క్రిమి వుందని తెలిస్తే అందుకు తగిన చికిత్స చేయిస్తాడు. చీము వచ్చే ప్రదేశమును సేకరించి, క్రిములనుపెంచి రంగువేసి, చూచి-వైద్యుడికి సహాయం చేస్తాడు. ఒక్కొక్కప్పుడు వీటితో కొన్ని సీరములను ఇతర పదార్థములను తయారుచేసి చికిత్సకై వైద్యుడికి అందిస్తాడు. ఆ విషయం తరవాత వివరిస్తాను. ఈనాడు బహుజనులను ఏకకాలంలో రోగగ్రస్తులను జేసే, కలరా, మశూచికం వంటి రోగములు రాకుండా ప్రజలకు రోగ నిరోధక శక్తి కలిగించే సాధనము లన్నీ యీ క్రిమి విజ్ఞానం యింతగా అభివృద్ధి చెందినందువల్లనే సాధ్యమైనది.

క్రిముల శరీరం అంతా ప్రమాదకరమైనది కాదు. క్రిములు 'టాక్సినులు' అనే విష పదార్థములను ఉత్పత్తి చేస్తవి. టిష్యూలలో మార్పులు కలిగించి, రోగం ఏర్పడడానికి కారణం యీ టాక్సినులే. కొన్ని క్రిములలో యీ టాక్సినులు శరీరాంతర్గతములై వుంటవి. మరికొన్ని జాతుల క్రిముల శరీరం నుండి టాక్సినులు బహిర్గతములై రక్తంలో ప్రవహించి యితర భాగములను కూడా రోగగ్రస్తం చేస్తవి. మొదటిరకం టాక్సినులను ఎండో టాక్సినులు అంటారు. ఎండో అన్న ఉపసర్గకు అంతర్గతమైన అని అర్థము. యీ ఎండో అన్న ఉపసర్గ చాలా తరుచుగా వైద్య పరిభాషలో వస్తుంది. క్రిమి శరీరమును విడచి బయటికివచ్చే టాక్సినులను ఎగ్జో టాక్సినులు అంటారు. ఎగ్జో అంటే బయట అని అర్థము.

ఒక్కొక్కప్పుడు క్రిములు ప్రవేశించక పోయినా, క్రిముల టాక్సినులు ప్రవేశించి దేహం వ్యాధిగ్రస్తం కావచ్చును.

(సశేషము)

# అలాంటి మగాళ్ళున్నారా?

**చెబువత్తి వెంకట సీతారామదాసు**

"నమ్మి చెడినవారు లేరు, నమ్మక చెడి పోతే పొయ్యేరూ" అన్నాడు అంత వరకూ మౌనంగావున్న కృష్ణమూర్తి కొంచెం సాగుతున్న ధోరణిలో.

ఆరోజున వాన వదలకుండా కురవడం వల్ల మూడో శనివారం అయినా కృష్ణ మూర్తి ఇంట్లో నేను, వేణు, శ్రీను, మోహన్ – మేమంతా సినీమా స్పెషల్ మ్యాటనీ కార్యక్రమానికి తిలోదకా లిచ్చేసి కబుర్లలోకి దిగాము.

కబుర్లంటూ ప్రారంభమైతే అవి ఏ విధముగా అంతం అవుతాయో పరిశీలిస్తే చిత్రంగా ఉంటుంది. అందులోనూ మా కృష్ణమూర్తిలాంటి తాత్కాలిక బ్రహ్మచారి (అంటే భార్యను పురిటికి పుట్టింటికి పంపించి సంసారిగా వండుకుంటున్నవాడు అన్నమాట) మిత్రబృందానికి వేరుశెనక్కాయలు, బటానీలు, తదితర మేత సరుకు సరఫరా చేస్తూవుంటే కబుర్లపాదు కాకరపాదు కాక మానదు.

మేము జాతీయ అంతర్జాతీయ సమస్యల్ని కూలంకషంగా కాకపోయినా మా శక్తికొలది చర్చించి విడిచిన తరువాత 'మానవస్వభావం' అనే అంశం మీదికి మా చర్చ మళ్ళింది. 'మనిషిని నమ్మడమా నమ్మకపోవడమా' అనే సమస్య మీద మా దృష్టి కేంద్రీకృతం అయింది.

ఇక్కడ మా ఉద్యోగాలనుగురించి చెప్పడం అవసరమనుకుంటాను. కృష్ణమూర్తి ఎగ్జామినర్ ఆఫ్ లోకల్ ఫండ్ అకౌంట్సు ఆఫీసులో ఆడిటరు. మోహన్ స్కూళ్ళ ఇనస్పెక్టరు. వేణు టిక్కెట్టు కలెక్టరు. శ్రీను బిల్లు కలెక్టరు. నేను ఈ జన్మలో కలెక్టరును కాను గాని ఎప్పటికైనా ఏమైనా కాగల ఎప్పటికీ ఏమీ కాకుండా ఉండిపో గలగుతూ స్తాను. (నా పేరు శంకరం.) మేమందరం సనత్ నగర్ కాలనీలో ఉండడం వల్ల మా మధ్య చనువు ఏర్పడింది. వేణు మాత్రం బెజవాడలో వున్నాడు. పనిమీద హైదరాబాదు అప్పుడప్పుడు వచ్చినప్పుడు కృష్ణమూర్తికి బంధువు కాబట్టి వాళ్ళింట్లో దిగుతాడు.

'ఎంత జబ్బే! చచ్చినా మనిషిని నమ్మడానికి వీల్లేదు' అనే సూత్రం క్రింద మా అనుభవాలను ఏకరువు పెట్టాము.

ఉదాహరణలతో వచ్చిన చిక్కేమిటంటే మన వాదనకు పనికివచ్చినవ టనే ఎన్నుకుంటాము. మన వాదాన్ని త్రోసి రాజనేవి ఎన్నివున్నా మన కంటికి ఆనవు.

అంతవరకూ మా అనుభవాల్ని ఓపికగా వింటూ కాఫీ కుంపటికి గాలి విసురుతున్న కృష్ణమూర్తి "నమ్మి చెడినవారులేరు, నమ్మక చెడి పోతే పొయ్యారూ" అని మళ్ళీ మూనిరాగం తీశాడు.

కృష్ణమూర్తి ఎవరైనా కబుర్లు చెబితే వినేవాడే కాని స్వతహాగా కబుర్ల ధోరణిలోనివాడు కాడు. వాడు సైతం అభిప్రాయం వెలిబుచ్చడం అంటె మాకు కొంచెం చిరాకు వేసింది.

"వట్టినే స్వీకరించడం ఒప్పుకోము" అన్నాడు వేణు.

"నీ అనుభవం ఏదైనా చెప్పాలి చేవవుంటే" అన్నాడు శ్రీను.

"చెప్పకేం, చెబుతాను. కుంపటికి గాలి విసిరే బాధ్యత ఎవరైనా తీసుకోండి" అన్నాడు కృష్ణమూర్తి.

మా మిత్రబృందం వుంది చూశారూ, అది కబుర్లలో చూపగలిగినంత వడి ఏదైనా పని చేయాలంటే మందకొడిగా తయారవుతుంది. ప్రపంచ బద్ధకస్తులలో ప్రథమ బహుమానం ఇవ్వాలంటే మా నలుగురిలో ఎవరికి ఇద్దామా అని జడ్జీలు తికమక పడవలసిందే. ఇంతకూ కుంపటికి గాలి ఎవరు విసరాలనేది తేలక దానిని గాలివచ్చే వైపుకు పెట్టేద్దాం అని ఏకగ్రీవంగా అంగీకరించాము.

"ఇప్పుడు నేను చెప్పబోయే అనుభవానికి సాక్షి మనలో ఒకరున్నారు." అన్నాడు కృష్ణమూర్తి.

ఆ సాక్షి ఎవడైవుంటాడా అనే జిజ్ఞాస మమ్మల్ని కొంతసేపు పీడించింది.

"మమ్మల్ని చంపక ఆ సాక్షి ఎవరో చెప్పేద్దూ" అని బ్రతిమాలాడు మోహన్.

"చెబుతూవుంటే మీకే తెలుస్తుంది, వినండి.

"రెండు సంవత్సరాల క్రితం ఒకనాడు రాజమండ్రి మ్యునిసిపాలిటీ లెక్కలు తనిఖీ పూర్తిచేసుకుని హైదరాబాదు తిరిగి వచ్చేస్తున్నాను, పూరీ ప్యాసెంజరులో

"నేను కూర్చున్న కంపార్టుమెంటులో జనం క్రిక్కిరిసి ఉన్నారు."

"నువ్వు కూర్చున్న రైలు పెట్టెలోని జనం వివరాలతో మమ్మల్ని చంపకు. రైలు పెట్టెలన్నీ ఇంచుమించు ఒకేవిధముగ వుంటాయి" అన్నాడు వేణు.





"సరేలేవయ్యా...ఇక వినండి. సాయంకాలం ఆరుగంటలకు రైలు బండి తాడేపల్లిగూడెం స్టేషనుకు వచ్చేసరికి టిక్కెట్టు కలెక్టరు వేణు మా పెట్టెలోకి వచ్చి తనిఖీ ప్రారంభించాడు. ముందు బల్లల క్రింద దూరిన ముష్టివాళ్ళని దింపేశాడు.

కిటికీలోంచి ప్రకృతిపరిశీలన చేస్తున్న ఇరవైయేళ్ళ యువకుడి భుజం మీద చెయ్యివేసి 'టికెట్. ప్లీజ్' అన్నాడు టికెట్ కలెక్టరు వేణు.

అతని మొగము వెలవెలబోయింది. 'అరెరె, నా పర్సు పోయింది సార్, టిక్కెట్టుతో సహా డబ్బు కూడా పోయిందండీ' అని ఏడ్పు కంఠంతో కేకేశాడు.

"కాని, అతడ్ని టిక్కెట్టు కలెక్టరు వేణు నమ్మలేదు."

"అవును. నేనునమ్మలేదు. అదంతా దొంగ వేషమని నాగట్టి అభిప్రాయము." అన్నాడు వేణు.

"సరేలే. నీ అభిప్రాయం నీది. నన్ను చెప్పనియ్యి. టిక్కెట్టు కలెక్టరు వేణు వాల్తేరునుంచీ టిక్కెట్టు ఎక్సెస్ ఫేర్‌తో సహా కట్టుకోవాలన్నాడు. లేకపోతే రైల్వే మాజిస్ట్రేటు దగ్గరకు వెళ్ళవలసి ఉంటుందన్నాడు.

"ఆ యువకుడు బ్రతిమాలాడు.

'నాదగ్గర డబ్బు లేదు, నన్ను విడిచి పెట్టండి సార్. ఉద్యోగానికి ఇంటర్వ్యూ కోసమని హైదరాబాదు వెళ్తున్నాను, సార్! ఇప్పుడు నేను హైదరాబాదుకు వెళ్లకపోతే నాకు ఉద్యోగం దొరకదండి. మాజిస్ట్రేటుగారు నాకు శిక్ష విధిస్తే ఇక ఎప్పుడూ ఉద్యోగం దొరకదు. నా బ్రతుకు నాశనం చేయకండి బాబూ, నన్ను విడిచి పెట్టి పుణ్యం కట్టుకోండి సార్!'

"ఆ యువకుడి మాటలు వింటే నాగుండె కరిగింది. కాని టిక్కెట్టు కలెక్టరు వేణుది బండ గుండె."

"టిక్కెట్టులేని వెధవలంతా ఇలాంటి కట్టుకథలే చెబుతారు. అవన్నీ నమ్మడానికి వీల్లేదు" అని తన చర్యను సమర్థించుకున్నాడు వేణు.

"నిజమేనయ్యా స్వామీ. మా కథని పూర్తి చెయ్యనియ్యి" అని బ్రతిమాలాడు శ్రీను.

"ఆరోజుల నేను జోక్యం కలిగించుకొని 'పోనీ వేణూ—' అని చెప్పబోయాను. లేదో 'నువ్వేమీ నా వృత్తిధర్మ నిర్వహణలో జోక్యం కలిగించుకోవద్దు' అని ఖండితంగా చెప్పాడు.

'అది కాదయ్యా. నీ వృత్తి ధర్మం భేషుగ్గా నిర్వహించు. ఈ పెట్టె తప్ప మిగతా పెట్టెలన్నీ కూలంకషంగా తనిఖీ చేసేయ్...'

"పెట్టెలోని వారంతా గొల్లున నవ్వారు.

"వేళాకోళానికి కూడా సమయం వుంది" అని విసుక్కున్నాడు వేణు.

"'వేళాకోళం కాదు. ఆ అబ్బాయి కట్టవలసిన డబ్బు నేను చెల్లిస్తాను. రసీదు వ్రాసిఇయ్యి' అన్నాను.

"'నీకంత డబ్బు మిగిలిపోతూ ఉంటే ఇయ్యి. నీకర్మకు నేనేం చేస్తాను' అని డబ్బు తీసుకుని రసీదు వ్రాసి ఆ అబ్బాయి చేతిలో పెట్టి వేరే పెట్టెలోకి పోయాడు వేణు.

"ఆ యువకుడు కృతజ్ఞతా భారంతో కృంగిపోతూ నాకు నమస్కారం చేశాడు.

"అనుభవాల పేరుతో సొంత డబ్బా వాయించుకోడానికి ఈ సభ అంగీకరించదు" అని నేను అభ్యంతరాన్ని తెలిపాను.

"పోనీవోయ్, శంకరం కొంత డబ్బు ఖర్చు పెట్టాడు కనుక కొంచెం వాయించుకో నిద్దాం." అన్నాడు శ్రీను

"అయిపోయిందా నీ అనుభవం?" అనిఅడిగాడు మోహన్

"మీ అసాధ్యం కూలా. నన్ను చెప్పనియ్యరేం?" అన్నాడు కృష్ణమూర్తి.

"చెప్పు బాబూ, చెప్పు" అని మేము వింటున్నాము.

"ఆ యువకుడు నాకు చాలా 'థాంక్సు' చెప్పి 'దయచేసి పెట్టె చూడండి సార్! ఇప్పుడే మంచినీళ్లు త్రాగివస్తాను' అని ప్లాటుఫారం మీదికి వెళ్లాడు.

"ఇంతలో రైలు కదిలింది. అతడు వస్తున్నాడో లేదోనని ఆత్రంగా కిటికీలోంచి చూశాను. పరుగెత్తుకుంటూ వచ్చి చివరి పెట్టెలో ఎక్కాడు.

"అతడు ఏలూరు స్టేషనులో కాని నవరుపేట స్టేషనులో కాని నేనున్న పెట్టెలోకి రాలేదు. క్రిందికి దిగి అన్ని పెట్టెలూ వెదకుదామని మొదట అనుకున్నాను కాని మా ట్రంకుపెట్టెలు ఎవరైనా కొట్టేస్తారేమోనని ఆ ప్రయత్నం విరమించుకొన్నాను.

"రైలుబండి బెజవాడ చేరేసరికి రాత్రి ఎనిమిదింపావు అయింది. అతడు బెజవాడ స్టేషనులో నా కంపార్టుమెంటుకి వచ్చాడు. అతనికేసి ప్రశ్నార్థకంగా చూశాను.

"'నా పర్సు కొట్టేసిన వెధవ దొరుకుతాడేమోనని వెతుకుతున్నాను సార్!' అని సమాధానం చెప్పుకున్నాడు.

"వాడిని మీరు చూడండే ఎలా పోల్చ గలరు?" అని అడిగాను.

" 'వాడు ఇంకొకరి పర్సు కొట్టేయడానికి ఎలానూ ప్రయత్నం చేస్తాడు. అప్పుడు నేను వాడిని పట్టుకుంటాను' అన్నాడు.

"నాకు నవ్వు వచ్చింది.

" 'మీరెంత అమాయకులండీ! మీ పర్సు కొట్టేసినవాడు ఒక్కడే కాకపోవచ్చును. ఒక గ్యాంగు కావచ్చును. వాళ్లు మీ పర్సు కొట్టేసిన తరువాత ఈ రోజుకి 'పని' చాలించుకోవచ్చును' అన్నాను.

" 'మీరు చెప్పింది కూడా సంభవమే కావచ్చును. కాని వాళ్ళు ఇంకా వాళ్ల

# అంతా దగాకోర్లేనా?

కార్యక్రమం కొనసాగించవచ్చుననుకో డానికి కూడా వీలుంది' అన్నాడు.

" 'నిజమే'నని అంగీకరించాను.

" క్యారేజితో భోజనం తెప్పించుకున్నాను. అతడికి కూడా పెట్టాను. అతడు సిగ్గుపడుతూ తిన్నాడు.

" 'మీరు అదునులో అన్నం పెట్టారు. లేకపోతే నాకీ పూట ఏకాదశే' అన్నాడు.

"నాకు చాల జాలి వేసింది.

"భోజనం అయిన తరువాత ఇప్పుడే వస్తానండి' అంటూ అతడు బయటకు వెళ్లాడు.

"మా బండి బెజవాడ విడిచేటప్పటికి రాత్రి పది గంటలయింది ఆ యువకుడు నా కంపార్టుమెంటుకి రాలేదు.

"మా బండి డోర్నకల్లు స్టేషన్ రావడం నాకు తెలియలేదు. అప్పటికే నాకు నిద్ర గాఢంగా పట్టింది.

"తెల్లవారుతోందనగా మెళకువవచ్చింది. బండి ఆగివుంది. బయటికి చూసేటప్పటికి కాజీపేటస్టేషనుకు వచ్చామని తెలిసింది ఏ గూడ్సుబండికోసమని ఎక్కడ నిలిపేశారో యేమో తెల్లవారుఝామున నాలుగుగంటలకు రావలసిన బండి ఆరు గంటలకు కాజీపేట చేరింది.

"మా ట్రంకుపెట్టె లున్నాయో లేదో చూశాను. నా పెట్టె పోలేదు. ఆ యువకుడి పెట్టె కనపడలేదు. తీసుకుని ఇంకొక పెట్టె లోకి వెళ్ళి వుంటాడనుకున్నాను. తలగడ క్రిందనున్న కోటుతీసి పర్సుచూసుకున్నాను మూడు పదిరూపాయల నోట్లు ఉండవలసిన చోట ఒక పదిరూపాయల నోటుంది. ఇరవై రూపాయలు కనపడడంలేదు."

"దొంగవెధవ ఆయువకుడే తీసి వుండాలి" అన్నాడు వేణు.

"మరి డబ్బంతా తీయలేదే" అన్నాడు కృష్ణమూర్తి.

"అందుచేతనే వాడే తీశాడనుకుంటాను" అన్నాడు మోహన్.

ఇంతలో వంటింటిలో కుంపటిమీద నీళ్లు పొంగి పోయిలోపడ్డ శబ్దం వినిపించింది.

"కాఫీ పొడి వేసి వస్తాను" అని కృష్ణమూర్తి వంటింట్లోకి వెళ్లాడు.

"ఆ దొంగవెధవ కబుర్లునమ్మి టిక్కెట్టు కొనిపెట్టి అన్నంకూడా పెట్టినందుకు మంచి శాస్తి చేశాడులే" అన్నాడు వేణు

"మన కృష్ణమూర్తిది జాలి గుండె. మనుష్యుల్ని ఇట్టేనమ్మేస్తాడు, పాపం" అన్నాడు శ్రీను.

కృష్ణమూర్తి కాఫీకప్పులన్నీ ఒక 'ట్రే'లో పెట్టి మా ముందుంచాడు.

"యాభై రూపాయలు వదుల్చుకున్న నీ అనుభవం పూర్తయిందా మూర్తీ" అని హేళనగా 'తగిన శాస్తి జరిగింది' అన్నట్లు అడిగాడు మోహన్. మానవుని నిజాయితీలో నమ్మకం నశించిన మాకు కూడా కృష్ణమూర్తి పడిన దగాకు విచారం బదులు కొంత తృప్తి కలిగింది.

"పదిహేను రోజుల క్రితంవరకూ పూర్తయిందనే అనుకున్నాను."

"ఏం జరిగిందేమిటి?"

"మళ్లీ వాడు కనిపించాడా?" అని మేమందరం ఒకేసారి అడిగాము.

బయట వాన వెలిసింది

"కనిపించలేదు. కాని ఉత్తరం వ్రాశాడు" అని ఇంటిలోకి వెళ్ళి పెట్టెలోంచి ఒక ఉత్తరంతీసి శ్రీను చేతికిచ్చాడు కృష్ణమూర్తి. శ్రీను ఈ విధముగా చదివాడు —

వరంగల్లు
2-8-60

"ఆపదలో ఆదుకున్న కృష్ణమూర్తి గారికి అనేక నమస్కారాలుచేసి రామం వ్రాసే విన్నపములు:

మీరు ఆరోజున నాకు చాలా ఉపకారం చేశారు. నేను ఎన్నటికీ మరువలేను. వరంగల్లు స్టేషనులో ఎక్స్‌ప్రెస్ క్రాసు చేస్తుందని తెలిసి త్వరగా వెళ్లాలనే తలంపుతో నా పెట్టె తీసుకునిపోయాను. మీరు గాఢంగా నిద్రపోతూరు. మిమ్మల్ని లేపడం నాకిష్టం లేకపోయింది. నాకు హైదరాబాదులో ఎవరూ తెలిసినవారు లేరు. ఎవరు నాకు డబ్బిస్తారు? మీరు దయాస్వరూపులు మిమ్మల్ని లేపి అడిగితే మీరు ఇస్తారనే సంపూర్ణ విశ్వాసం నాకుంది. ఇక మీ నిద్ర పాడుచేయడం దేనికని మీ పర్సులోంచి నాకు కావలసిన ఇరవై రూపాయలూ తీసుకున్నాను. దొంగతనం చేశానని నేను అనుకోవడంలేదు. ఎప్పటికైనాసరే మీ డబ్బు (టిక్కెట్టుకిచ్చిన దానితో సహా) మీకు పంపించాలనే ఉద్దేశ్యం నాకుంది. అందుచేతనే మీ చిరునామా ఉన్న కార్డునుకూడా మీ పర్సులోంచి తీశాను.

మీరు సహృదయంతో కొని యిచ్చిన టిక్కెట్టువల్ల క్షేమంగా హైదరాబాదు చేరాను. నాకు ఉద్యోగం దొరికింది. ఆ కంపెనీ వరంగల్లు బ్రాంచిలో వేశారు. ఇప్పుడు వరంగల్లులో ఉంటున్నాను. సంవత్సరంన్నరనుంచీ మీ డబ్బు పంపించాలనే ప్రయత్నిస్తున్నాను. డబ్బు పంపనిదే వుత్తరం వ్రాయడానికి సిగ్గుపడ్డాను. క్షమించండి ఈ రోజునే మీ ఇంటి అడ్రసుకి యాభై రూపాయలు పంపిస్తున్నాను. మీ అప్పు డబ్బురూపంలో వున్నది తీర్చగలిగాను కాని మీరు చూపిన దయ అమూల్యమైనది ఆ అప్పు తీర్చడానికి వీలులేనిది.

హైదరాబాదు వచ్చినప్పుడు తమ దర్శనం చేసుకుంటాను.

చిత్తగించవలెను
రామం."

ఉత్తరం చదవడం పూర్తిచేసి "అయితే మనియార్డరు అందిందా" అని అడిగాడు శ్రీను

"ఇంకా అందలేదు" అన్నాడు కృష్ణమూర్తి.

"కాచుకుని కూర్చో అందుతుంది!" అన్నాడు హేళనగా వేణు.

"వాడు నిన్ను ఇంకా మోసం చేయాలని చూస్తున్నాడు. జాగ్రత్త బాబూ, జాగ్రత్త" అన్నాడు మోహన్.

ఇంతలో పోసుమాన్ వచ్చాడు.

"కృష్ణమూర్తికి మనియార్డరు కాదుకద!" అని హేళనగా అడిగాడు వేణు

"మనియార్డరేనండి, వరంగల్లునుంచి యాభైరూపాయలు వచ్చింది. ఎవరో జి. రామం అనే ఆయన కట్టారు," అని ఏకరువు పెట్టాడు పోసుమాన్.

అందరం ఆశ్చర్యపడ్డాం.

"నమ్మి చెడినవాడూ లేడూ" అని పాడుకుంటూ కలంకోసం గదిలోకి వెళ్లాడు కృష్ణమూర్తి. ★




# మనుషులూ మనసులూ —

**పఠాతుల రామచంద్రయ్య —**

(గతవారం తరువాయి)

అయితే ఆవిడ తమ్ముడియింట్లో అడుగు పెట్టిన పదీపదిహేనురోజులదాకా యీ 'తీర్చిదిద్దే' ప్రయత్నాలేం పెట్టుకోలేదు. పెట్టుకోలేదో, లేక పెట్టుకున్నా సాగలేదో తెలీదు. ఆతరువాత ఒకరోజున పగలు పదకొండుగంటలప్పుడు రత్నమ్మ వంటచేస్తూ, మధ్యమధ్య తీరిక చేసుకుని పూజచేస్తుండగా కాంతారావు వచ్చి,

"వంటయిందా వదినా?" అన్నాడు.

"ఇంకా కాలేదయ్యా!"

"అన్నయ్యకు టైమయినట్టుంది" అంది హేమ. ఆ చెప్పటం వదినెకు చెబితే తను శాసించినట్టుగా వుంటుందని, స్వగతం చెబుతున్నట్టుగా అంది. వదినెగారు మధ్యమధ్యను భక్తిగీతాలు చదువుతూ వంట ఆలస్యం చేస్తున్నట్టనిపించటంవల్ల అలా అంది హేమ.

"వెంగనమ్మా, టైమయిందని! కట్టెలు మండిచస్తేనా? నేనేమో అర్జంటుగా చెయ్యలేకపోతిని, చాదస్తపు చచ్చినదాన్ని!" రత్నమ్మ మామూలుధోరణిలో మాట్లాడినా కూడా, వాక్యానికి కనీసం రెండు చావుపదాలు ఉపయోగించకుండా వుండలేదు.

అన్నాచెల్లెళ్లు జవాబు చెప్పలేదు. రత్నమ్మ తన వంటపనీ, పూజాకార్యక్రమాలూ పూర్తిచేసి కాంతారావుకు విస్తరి వేసేందుకు మరో అరగంట పట్టింది. అప్పుడు టయిం పదకొండున్నర. కాంతారావు యూనివర్సిటీకి వెళ్లవలసింది పదిన్నరకి.

"ఆలస్యమవుతుందని చెప్పివుంటె హోటలుకు వెళ్ళేవాణ్ణిగదా వొదినా?" అన్నాడు కాంతారావు. రత్నమ్మ జవాబు చెప్పలేదు.

"హోటలుకు వెళ్ళొచ్చునసే పాటి ఇంగితమే వుంటే యిక్కడెందుకుంటావు! నలుగురిచేతా నాలుగుమాట లెందుకనిపించుకుంటావు?" అనుకుంది హేమ అతణ్ణి వుద్దేశించి.

విస్తట్లో వడ్డించిన పొగలు కక్కే అన్నం ఆదరాబాదరా ముక్కునా నోటా వేసేసుకున్నాడు కాంతారావు. రత్నమ్మ వారంరోజుల్నుంచీ అతడికి నెయ్యి వడ్డించటం లేదు.

రీసెర్చి మొదలు పెట్టినప్పట్నుంచీ యీ రోజే, కాంతారావు ఆలస్యంగా యూనివర్సిటీకి వెళ్లటం. అందువల్ల ప్రొఫెసరు ఏమీ అనలేదు. గంటన్నర ఆలస్యంగా వెళ్లినందుకు, సాయంత్రం ఓ అరగంట ఎక్కువసేపు డిపార్టుమెంటులో కూచున్నాడు కాంతారావు. నాలుగున్నరకి అతను ఇంటికి బయల్దేరి వస్తుంటే కింది అంతస్తులో కామన్ హాల్లో ఎదురుచూస్తూ కనిపించిం దనూరాధ.

అనూరాధకు కోపం వచ్చింది. రోజూ ఆవిడ అతడికోసం ఎదురుచూచేదికాదు; ఫ్రెండ్సుతో కలిసి వెడుతుండేది. ఈ రోజు వాళ్లు పిలిస్తే రానని చెప్పి అతడికోసం ఎదురుచూస్తూ కూచుంది. రోజూ నాలుగున్నర

కల్లా బయటికొచ్చేసే మనిషి ఈగోజెంగుకు ఆలస్యం చెయ్యాలి? తను ఎదురు చూస్తున్నదని బెట్టుసరిగాఁవల్ను! ఈ మగాళ్లంతా యింతే. ఇవతలివాళ్లు ఎంత బాధపడేదీ గమనించలేరు.

కాంతారావామె దగ్గరగా వస్తూ, "ఎవరి కోసం, ఎగురు చూస్తున్నారు?" అన్నాడు.

"ఊహుఁ. మీ కోసం కాదు లెండి." అతడివేపు కాకుండా, మరెవరికోసమో ఎదురు చూస్తున్నట్టు చూస్తో అంది. తను ఎదురు చూడటం గమనించి కాంతారావు కావాలని ఆలస్యం చేశాడనుకుంటోంది అనూరాధ.

"నాకోసమని కాదు నా కోసం ఎదురు చూచేవాళ్లుకూడా యీ పట్నంలో వున్నారనుకోవడం లేదనుకోండి." అన్నాడతడు

అనూరాధ మనస్సు చివుక్కుమన్నది.

ఆమె మాట్లాడలేదు

ప్రక్కనే కూచున్నాడతడు.

"ఏ సఖురాంద్ర కోసమో. ?"

"నాకే తెలీగు."

"భలే బాగుంది పోనీ, ఆ ఎగురుచూచే వాళ్లు వస్తారో రారో తెలుసా?"

"అదీ తెలీదు."

"అయితే అలాంటివాళ్లకోసం ఎదురు చూడాల్సిన అవసరం లేదు. వచ్చేవాళ్లు వస్తారు. రానివాళ్లు రారు. మనం వెడదాం పదండి." అన్నాడు లేచి నిలబడుతూ.

అనూరాధ నవ్వుతూ లేచింది. ప్రయత్నపూర్వకంగా కాంతారావు మీద తెచ్చుకున్న కోపం ఆమెలో యిప్పుడు లేదు. దారిలో, తను ఇవాళ ఆలస్యంగా వస్తున్నందుకు కారణం చెప్పాడు కాంతారావు.

"వారం రోజుల్నుంచీ అటువేపు రావటమే లేదేం మీరు . ?" అన్నాడు.

ఏం జవాబు చెప్పాలో తోచలేదు అనూరాధకు నిజమే. తను వారం రోజుల్నుంచీ ఆ యింటివేపు వెళ్లటం లేదు; రత్నమ్మ వచ్చాక ఏ ఒకటి రెండు సార్లో తప్పిస్తే. దీనికి కారణంవుంది. రత్నమ్మంటే తనకు గిట్టదు. ఒకసారి రత్నమ్మ తనమీద వ్యంగ్యంగా ఏదో మాట్లాడబోతే తను రెచ్చిపోయి తలవాచేట్టు చివాట్లు పెట్టింది. అప్పట్నుంచీ రత్నమ్మ వుండే పరిసరాలోకి వెళ్లాలంటేనే అయిష్టం తనకి. తను వట్టి పెంకెగి పోయిన పిల్లని ప్రచారం చేస్తుంటుంది రత్నమ్మ.

ఈ విషయాలన్నీ అతడితో ఏకరువు పెట్టడం అనూరాధ కష్టంలేదు. కాని యీ వారం రోజుల్లోనూ ఆ యింట్లో విశేషాలేమిటో, రత్నమ్మగారి పోకడ లెలా వున్నాయో తెలుసుకోవాలని తహతహగా వుంది. అందువల్ల మాట తప్పిస్తూ,

"ఆవిడేమంటోంది?" అంది.

"ఎవరు?"

"ఆవిడే...ఆ పరమ భక్తురాలు."

కాంతారావు ప్రశ్నార్థక ముఖం పెట్టాడు.

అనురాధకు మళ్లీ కోపం వచ్చింది. ఇంత బండమనిషేమిటి? ఏ సంగతిగాని అణా పైసాల్తో సహా చెప్పందే అర్థంకాదూ

"రత్నమ్మ" అంది—'ఇంక అర్థమవటం లేదా?' అన్నట్లుగా—

"ఓహ్ . ఆవిడా? ఆవిడ మామూలుగానే వుంది."

ఇక మాట్లాడదల్చుకోలేదు అనూరాధ. రత్నమ్మ మామూలుగా వుందో, విశేషంగా వుందో తెలుసుకుందామని కాదు అనూరాధ అతణ్ని అడిగింది. ఏదన్నా ఒకమాట చెబితే దాన్ని వెంటనే అందుకుపోవటం కాంతారావుకు అందుబాటులో వున్న విషయం కాదు. రత్నమ్మ మామూలుగా వుండటానికీ, వుండకపోవటానికీ అతడి నిఘంటువులో చెప్పబడిన తేడాయేమిటో అనూరాధ కర్థం కాలేదు.

"మొద్దబ్బాయి!" అనుకుంది స్వగతంగా. యం. యస్ సి. ఫస్టున ప్యాసై రిసెర్చి చేస్తున్న మొద్దబ్బాయి! అపూర్వ మేధాశక్తి, అమాయికత్వాల విచిత్ర సమ్మేళనం! ఈ సమ్మేళనంపట్ల ఆసక్తిగా వుంది అనూరాధ కానిఅర్థం కావటం లేదు.

మౌనంగా నడుస్తున్నారు. అయిదయింది. కాలేజీ విద్యార్థులూ లెక్చరర్లూ అందరూ ఇళ్లకు వెళ్లిపోయి వుండటంవల్ల రోడ్డులో మనుషులు ఎక్కువలేరు. విశాలమైన రోడ్డు మీద నరసంచారం పలచగావుంది. సాయంకాలపు చల్లదనాలను మోసుకొచ్చే పిల్లగాలులు హృదయాలను సంస్పృశిస్తున్నాయి. అనూరాధ అతడి పక్కనే నడుస్తోంది.

అనూరాధ అంది

"పొద్దున్న నేనూ, మా క్లాసుమేటు అరుణా యూనివర్సిటీ ఆఫీసుకు వెళ్లాం. నాకు అప్పటి కప్పుడు గుర్తొచ్చింది మీ స్కాలర్‌షిప్పు సంగతి మేనేజర్నడిగాను. ఇంకో నెలరోజుల్లో ం వచ్చన్నాడు." ఈ విషయం అతడితో చెప్పేందుకే, ఆమె క్లాసు వదిలాక అతడికోసం ఎగురు చూస్తూ కూచున్నది.

ఉపాధ్యాయుడు — మధూ. దేవునికి నైవేద్యం ఎందుకు పెడతార్రా?

మధు — దేవుడు భుజించడు కాబట్టి.

డి. కె వెంకటనారాయణ (పుల్లేటిపల్లి)

"గానిస్తైం వొచ్చినప్పుడదే వస్తుంది లెండి. ఈలోగా మనం ఎంత ప్రయత్నించీ లాభం వుండదు."

"ఆ మాత్రం ఎంక్వయిరీ చేసినందుకు థాంక్స్ అయినా చెప్పరేవిఁటి?" నవ్వుతూ అంది అనూరాధ.

"థాంక్స్ చెబితే మీరు పడ్డశ్రమ తక్కువ చేసినట్లవుతుందని" అన్నాడు; "థాంక్స్ అనేమాటకు విలువేదీ ఈ రోజుల్లో? . అయినా, నెలరోజులనాటి మాట కదా మీరు చెప్పింది! అంతగా థాంక్స్ చెప్పాల్సిన అవసరం కనబడ్డం లేదు"

"అది కాదు నెలరోజుల్లోపుగానే రావొచ్చు."

"వస్తుందనుకుంటున్నారా?"

"నేను ఆశావాదిని."

అతడు నవ్వాడు. అనూరాధ కూడా నవ్వింది. ఆవిడ నవ్వుతుంటే చాలా అందంగా వున్నట్టు మొదటిసారిగా అనిపించింది కాంతారావుకు

## 6

వారం రోజుల్నుంచీ అనూరాధ హేమ దగ్గరికి రావాలనుకుంటోంది. మళ్ళీ, వెడదామా వద్దా అని జిజ్ఞాసపడుతోంది. కొత్త ఆడపడుచు—హేమలమధ్య స్నేహ సంబంధాలెలావున్నాయో, రత్నమ్మ ఆ యింట్లో ఎలా ప్రభుత్వం నెరపుతున్నదీ, చూడాలని ఉత్కంఠ. వెడితే మళ్ళీ రత్నమ్మతో లడాయి పడుతుందేమో— దాంతో తనకూ హేమకూ మధ్య యిప్పుడు తూతూమంత్రంగావున్న స్నేహబంధం కూడా పూర్తిగా అంతరించిపోతుందేమో నన్న భయం. ఈ భయంతో, మధనతో, వాయిదా వేసుకుంటోంది.

తను వెళ్ళకపోతే పోనీ-కాంతారావైనా ఇక్కడికి వచ్చినప్పుడు, ఆ యింట్లో జరిగే కథాకమామీషూ తనకు చెబుతూ వుండొచ్చుగా! అబ్బే, ఆ మనిషికామాత్రం బుర్ర అనేది వుంటే అయినవాళ్ళింట్లో అలా అఘోరిస్తూ పడివుంటాడా?

ఓ శుక్రవారం సాయంత్రంవేళ అనూరాధ యివే ఆలోచనల్లో వుండగా, కాంతారావు వచ్చాడు.

అంతకుముందే తలపోసుకున్న అనూరాధ మేడమీద పిట్టగోడపక్కన కూచుని తల ఆర్పుకుంటున్నది. అంతలో కిందినుంచీ పెద్దన్నయ్య కేకేసి చెప్పాడు, కాంతారావు వచ్చాడని. మేడమీదికి రమ్మని కేకేసింది తిరిగి అనూరాధ.

కాంతారావు వచ్చాడు. ఈమధ్య పది రోజుల్నుంచీ అనూరాధకు 'ఇన్వర్స్ ప్రాబ్లెమ్' ట్యూషను చెబుతున్నాడు కాంతారావు. ప్రతిఫలంగా అతనికి అనూ

ఒత్తుగా వచ్చిన ఎంత సొగసైన కేశములు

—వారు నిశ్చయముగా



టాటావారి
హెయిర్ ఆయిల్స్‌ను
ఉపయోగిస్తూ ఉండాలి

టాటావారి పెర్ఫ్యూమ్డ్ కోకొనట్ హెయిర్
ఆయిల్— శుద్ధిచేయబడిన మరియు
పూల పరిమళముగల కల్తీలేని కొబ్బరి నూనె

టాటావారి కేస్టర్ హెయిర్ ఆయిల్—
విశేష గుణములూ మరియు మంచి
సువాసనగల ఆముదపు నూనె

మీ కేశముల పోషణకు మరియు సొగసుదనము
నకు టాటావారి హెయిర్ ఆయిల్సును
ఉపయోగించండి!

టాటా తయారుదలు



రాధ—రత్నమ్మ అఘాయిత్యాల్ని గురించీ, ఆ యింట్లోనూ బయటి ప్రపంచంలోనూ నెగ్గుకురావటానికి అత డవలంబించవలసిన హింసాయుత విధానాలనుగురించీ ట్యూషను చెబుతోంది.

వచ్చి పక్క నున్న కుర్చీలో కూచున్నాడు కొంతారావు. అనూరాధ కళ్ళతోనే పలకరించింది.

క్షణం నిశ్శబ్దం.

"మిమ్మల్నొక టడగాలనుకుంటున్నాను" అన్నాడు కొంతారావు.

ఏ చిదంబర రహస్యం అడగాలనుకుంటున్నాడోనని ఆశ్చర్యపోతూ, "ఏమిటి?" అంది అనూరాధ. కొంతారావు ఇంతవరకూ ఏనాడూ ఇలా మాట్లాడి వుండకపోవటం వల్ల, ఆమెలో కుతూహలం ఎక్కువయింది.

"ఏంలేదు. నేను మీకోసం ఇలా చనువుగా వస్తుంటానుగదా! మీ యింట్లోవాళ్లు ఇంకోరకంగా అనుకోరూ?"

బాగుంది! చచ్చీ చెడీ చేయంగల విన్నపాలన్నటుగా, ఇంత ఉపోద్ఘాతం చెప్పి, ఈయన అడిగే ప్రశ్న ఇదన్నమాట!.... అనూరాధకు రవ్వంత కోపంకూడా వచ్చింది అతడిమీద; అతడా ప్రశ్న అడిగినందుకు కాదు — తనలో ఉత్కంఠను సృష్టించి దాన్ని తిరిగి ఎందుకూ అక్కరకురాకుండా చేసినందుకు.

అతడు అడిగిన తీరుకు నవ్వుకూడా వచ్చింది. ఆ నవ్వును పూర్తిగా అంతరాంతరాల్లోనే అణిచివేసుకోకుండా బయటికి ప్రదర్శిస్తూ, "అనుకు నేదేమిటి?" అంది.

కొంతారావు తికమకపడ్డాడు. ఏమని, ఎలా సమాధానం చెప్పాలో తెలీలేదు. అసలు సమాధానం చెప్పవచ్చునా అన్నది కూడా సందిగ్ధంగా అయింది.

"అదే... నేను...మీరు..." అని ప్రారంభించాడు. కాని ప్రారంభించాక ఏం చెప్పాలో తోచలేదు. నానుస్తూ వుండిపొయ్యాడు.

ఎర్రని, వంపులుతిరిగిన పెదవుల్ని నొక్కిపట్టి నవ్వింది అనూరాధ. ఆ నవ్వులో నైర్మల్యం, గిలిపితనం కొట్టవచ్చినట్టు కనబడ్డాయి.

"ఆఁ. .నేను?.. మీరు?" అంది ప్రశ్నార్థకంగా. ఆమె పెదాలమీద హాసరేఖ అదృశ్యం కాలేదు.

"దేనికి, నవ్వుతారు?" అన్నాడు కొంతారావు. తనకు మాటలు తడబడటంవల్ల అనూరాధకు లోకువై పోతున్నానేమోనని భయం వేసింది అతడికి.

కుడితిలోపడ్డ ఎలుకలాగా సందిగ్ధావస్థలో ఉన్న అతణ్ని ఇంకా తికమక పెట్టడం బాగుండదని అనూరాధకు తోచిందోయేమో. ఆవిడ అంది: "సరే, మీరు చెప్పేది అర్థ

# మనుషులూ— మనసులూ

మయింది లెండి! అయితే, అలా ఎవరనుకుంటారని మీర నేదీ?"

"మీ యింట్లో ఎవరేనా..."

"ఓస్, ఇదా మీ సందేహం! ఇంత పెద్ద టీకాతో ప్రారంభించి మీరు ఉక్కిరిబిక్కిరౌతుంటే, ఇదంతా ఎవరిమీదకోగదా అనుకున్నా. భలేవాళ్ళండీ!"

ఈమారు కూడా మామూలు స్ఫూర్తితో నవ్వకుండా వుండలేకపోయింది అనూరాధ. మంత్రముగ్ధుడై, సందేహ మనస్కుడై చూస్తున్నాడు కొంతారావు.

ఆమె అలా నవ్వేసినప్పుడు, సమాధానంగా తను ఏదో మాట్లాడటం, లేదా కనీసం ఆమె అందుకు నేట్టు ఏదో మాట ప్రారంభించటం తనవంతు అనుకుని—

"అలా తేల్చేస్తారేమిటి?..." అన్నాడు.

"తేల్చెయ్యక..? మీలా మనసులో పెట్టుకుని అవస్థపడటం నా చాతకాదు బాబు! అయినా, మా నాన్నగారుగాని, అన్నయ్యగాని ఏమన్నా అనుకుంటారని గదూ మీర నేది? వాళ్ళలాంటి వాళ్లు కారులెండి నాన్నగారో ఉమర్ ఖయ్యాంలాంటి మనిషి. ఇహ మా అన్నయ్యంటేనా, మీకు మీవాళ్ళ యింట్లో రత్నమ్మగారు పొదంపెట్టినప్పట్నుంచీ ఏమంత అనుకూలంగా వుండదని, మా యింట్లోనే వుండమని చెబుదామనుకుంటున్నాడు అన్నయ్య అంది అనూరాధ.

ఉపాధ్యాయుడు — గోరిల్లా యుద్ధము అనగానేమి? ఎప్పుడు జరిగినది? నువ్వు చెప్పరా, రంగా!

రంగడు - మనుషులకుబదులు గొర్రెలు యుద్ధముచేయడాన్నే గొరిల్లా యుద్ధమందురు. మొన్న దీపావళి పండగనాడు మన సుబ్బయ్యగారి గొర్రెకు, రామయ్యగారి గొర్రెకు పోరాటము జరిగినది.

—దేవరకొండ రామకృష్ణ
(గొల్లలకోడేరు)

ఆశ్చర్యపోయాడు కొంతారావు. ఇంత అమృతహృదయం కలవాళ్ళుంటారని అతడింతవరకూ వూహించలేదు.

తరవాత అతడేమో మాట్లాడలేదు. మాట్లాడవలసిన అవసరంకూడా కనబడలేదు. నిర్మలంగా, సందేహరహితంగా వున్నది మనస్సు.

సాయంకాలమవుతోంది. ఇప్పట్నుంచీ ప్రపంచంమీద ఎవరు అధికారం నెరపాలన్న సమస్యపై రేబవళ్లు కలహించుకుంటున్నాయి. ఆ కలహంలో పగలు పరాజితయై అదృశ్యమయింది. అది ఎత్తిన శాంతిపతాక ధవళిమలాగా వెన్నెల వస్తోంది.

"ఇహ యీపూట ట్యూషన్ అనివార్య కారణాలవల్ల ఆపివేయబడినది — ఏవంటారు?" అంది అనూరాధ.

"నో. మీరు చెప్పమంటే చెబుతాను."

"ఒద్దొద్దు. అంత మొహమాటంగా చెప్పటం దేనికి లెండి! మనం చెబితే యీ అమ్మాయికి రావాలీ, బాగుపడాలీ అన్న యావతో చెప్పాలిగానీ ఎవరేనా— చెప్పవలసి వచ్చిందే అనుకుంటూ చెప్పే యేంలాభం?...అయినా నేనెవత్తెనులెండి మిమ్మల్ని నిలేసి అడిగేందుకు! నేనేం మీకు జీతం యిస్తున్నాను గనకనా!"

ఈ రెండుమూడు నెలల్లోనూ కొంతారావును సానుభూతితో అర్థంచేసుకుంటూ, కొత్త ఆత్మీయతను ఏర్పరచుకు నేందుకు ప్రయత్నిస్తున్న అనూరాధ ఇలా మాట్లాడుతున్నదంటే, చూసిన వాళ్ళెవరేనా ఆశ్చర్యపడొచ్చు. కాని ఆమె యీ మాటలు కోపంతో గాని, ఇంకో భేదభావంతో గాని అనలేదు. అతడు మృదుహృదయం కల మొద్దబ్బాయని ఆమె దృఢపరచుకుని వున్నందువల్ల, అప్పుడప్పుడూ ఇలా చురక అంటించినట్లు మాట్లాడుతుండటమంటే సరదా అనూరాధకు. ఆ మాటలకు అతడిచ్చే సమాధానాలను బట్టి తను సాన్నిహిత్యానికి విలువకట్టాలని చూస్తుంటుంది.

ఇది కొంతారావుకూడా తెలిసిందే అవటంవల్ల అతడేం బాధపడలేదు. నవ్వేస్తూ వుండిపోయాడు.

తెల్లని వెన్నెల, చల్లని గాలి తరగలు కలిసి కొత్త పానీయంలా ప్రవహిస్తూ ప్రపంచానికి మత్తు కలిగిస్తున్నాయి. ఆకాశంలో చంద్రుడికి సమీపంగా వున్న మబ్బుముక్కల అంచులు జిగేలుమంటున్నాయి.

తల ఆర్చుకోవటం పూర్తిచేసి వదులుగా జడ అల్లుకుంది అనూరాధ. జడకు అందకుండా తప్పించుకుని మొహంమీద పడుతున్న వెంట్రుకలు గాలికి అటూ ఇటూ కదుల్తున్నయ్.

(61-వ పేజీ చూడండి)

"ఏవండీ!"

"  ........."

"అప్పుడే నిద్రపోయారా..."

మేడమీది గదిలో సోఫాలో ఓరగా పడుకుని కునుకు దీస్తూన్న భర్తవేపు క్షణంసేపు తీక్షణంగా చూసి, తను తీసుకొచ్చిన నీళ్ళ చెంబూ, గ్లాసూ కిటికీ దగ్గరపెట్టి "మీకెప్పుడూ నిద్ర కళ్ళమీదే కాచుకు కూర్చొని ఉంటుందండీ మరీనూ!" అంది విసుగ్గా మంజుల. సోఫాలో కునుకు దీస్తూన్న మనిషిలో అప్పటికీ చైతన్యం లేకపోవడం చూసి మంజుల అతని భుజాన్ని కదుపుతూ "ఏవండీ...నా చేత బ్రతిమాలించుకోనిదే లేవ గూడదనుకున్నారా ఏమిటి!......గంట పదన్నా కాలేదు. అప్పుడే ఏమిటీ నిద్ర! లేవండి!" అంది బుజ్జగిస్తూ.

భానుమూర్తి బద్ధకంగా లేచి కూర్చుని అతి ప్రయత్నంతో ఆవులింతడం చూసి, కొంటెగా నవ్వుతూ "అబ్బ, ఇంతసేపూ ఏదో గాఢనిద్రలో మునిగిపోయినట్టూ, యిప్పుడే మళ్ళీ నిద్ర ముంచుకువచ్చేస్తూన్నట్టూ...ఏమి నటనండీ!" అంది వ్యంగ్యంగా, మంజుల చేతులు త్రిప్పుతూ.

ట్యూబులైటు కాంతిలో 'జిగేలు'మని

నిండి, 'అయ్యోపాపం' అని పొరపాటుగా నన్నా ఎప్పుడూ మీ నోటినించి రాదుగా" అంది మంజుల.

ఇంతలో "సుబ్బులూ, చూడూ ఆ తమలపాకుల పళ్ళెం టేబిలుమీదే వదిలిపెట్టి మేడ మీది కెళ్ళిపోయింది అమ్మాయి. ఏమి మతిమరుపు! ఏమి తొందర! కాస్సేపన్నా కాలు క్రింద నిలవదే!...ఆ పళ్ళెం తీసుకెళ్ళి వాళ్ళకిచ్చిరా!" అని భానుమూర్తి తల్లి మాణిక్యమ్మగారు, పనిమనిషి సుబ్బులుని అజ్ఞాపిస్తున్న మాటలు వినబడ్డాయి.

తోడుదొంగల్లా ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు దంపతులు మేడమీది గదిలో. "మరచిపోయానండీ" గొంతుక తగ్గించి తమాషా పూర్వకంగా చెప్పింది మంజుల. భానుమూర్తి సోఫాలోంచి లేచి సీరియస్‌గా ముఖంపెట్టి "ఇవ్వాళ్టికి క్షమించేశాను. మరోసారి ఇలా చేయకేం" అని గద్దించి, వెంటనే కంఠం మార్చుకుని "భోజనం కాగానే తాంబూలం వేసుకున్నాకే సుఖంగా పడుకొనే అలవాటులో...బలవంతాన లేచి..." అంటూ ఆప్యాయంతో భుజాల్ని కుదిపి పరుపుమీద కూర్చొండు...

"అబ్బ బ్రతికించారు! నేనేదో..." అని మంజుల యింకా ఏదో చెప్పబోతూండగా తలుపు తట్టిన చప్పుడైంది. తలుపు తెరచి,

# భరించని ప్రశ్నార్థక



మెరిసిపోతున్న తన ప్రియబాంధవి తెల్లటి పలువరుస చూసి మురిసిపోతూ, ఆమె పరిహాసానికి మౌనంగా మందహాసం చేసి, టేబిలు మీదున్న ప్యాకెట్‌లోని ఆఖరు సిగరెట్టు నోటికి పట్టించి వెలిగిస్తూ, "అర్ధరాత్రవుతున్నా, అమ్మగారికి పని తెమలటం లేదు ఈ మధ్య." అన్నాడు వెటకారంగా భానుమూర్తి—పరుపు సర్దుతూన్న మంజుల నుద్దేశించి.

పొడిగా నవ్వి "ఏం చేయమంటారు? ఇంటెనిండా బోలెడంత పని నాకోసం ఎప్పుడూ ఎదురు చూస్తూంటుంది. పనిమనిషి ఉన్నదని పేరేగానీ ప్రతిపనికీ నేను దగ్గర లేందే ఏదీ శుభ్రంగా చెయ్యదు," అంది మంజుల.

"ఊహూఁ!"

అది తనపట్ల నిజమైన సానుభూతి సూచకమేనా అని క్షణంసేపు మంజుల భర్తవైపు చూసింది. సానుభూతి కాదు కేవలం పరిహాసమేనని అతని క్రీగంటి చూపూ, పెదవుల మీది దరహాసమూ చెప్పేశాయి. ముఖం చిట్లించి అవలికి త్రిప్పేసుకుంటూ "అవు

తాంబూలం పళ్ళెంతో నిలుచోనున్న సుబ్బుల్ని చూసి "యిప్పుడక్కర్లేదు సుబ్బులూ. ఆయన నిద్రపోయారు. క్రిందికి తీసుకెళ్ళిపో" అని పంపించేసింది మంజుల. తలుపు గొళ్ళెంపెట్టి, గ్లాసులో నీళ్లు త్రాగుతూండగా, మళ్ళీ మాణిక్యమ్మగారి కంఠం ఖంగున వినిపించింది—'ఏమే మళ్ళీ వెనక్కు తెచ్చేశావ్?' మరచిపోయింది గాకుండా నేనేదో జ్ఞాపకంచేసి పంపిస్తే, అది వాడికి అందనివ్వకుండా వెనక్కు పంపించేసిందా? అలిగిందేమో అమ్మాయి నామీద...వాడు నిద్రపోతూంటే పోనీ తనైనా వేసుకోరాదూ? ఏదో ప్రీతితో పంపిస్తే.....హుఁ అయినా అమ్మాయి కళ్ళల్లో నేనెంత అలుసైపోయాను!"

నీళ్ళ గ్లాసు చప్పుడు గాకుండా కిటికీ దగ్గరపెట్టి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ భర్త ప్రక్కన చేరి "ఏవండీ విన్నారా మీ అమ్మ నన్ను ఎలా అపార్థం చేసుకుందో? నేనామెను లక్ష్యపెట్టడం లేదుట! మీరు తాంబూలం వేసుకున్నారు

గదా అని వెనక్కు పంపించేస్తే అది మీకు అందనీకుండా చేస్తున్నానట! ప్రతి మాటకీ ఏదో విపరీతార్థం కల్పించి ఎత్తిపొడుపుగా మాట్లాడ్డం ఈ మధ్య మరీ అలవాటైపోయిం



చండ మీ అమ్మకు... ఇంతకు క్రితం నేను అలక్ష్యంగా వచ్చానని విసుక్కున్నారు మీరు. అందుకు ఆమె ఏమందో విన్నారుగా—నాకు కాస్సేపన్నా కాలు క్రింద నిలవదట!—ఏదో నే వెళ్లప్పుడూ ఈ రాజమహలు మేడమీదే తగులడుతున్నట్టు! వింటున్నారా" అంది వింటున్నాడో లేదోనని సందేహంతో భర్తను కదిపి. భానుమూర్తి అటూ ఇటూ కదలకుండ, కళ్లుమూసుకునే "ఊఁ!" అని దీర్ఘం తీశాడు—సావకాశంగా వింటున్నట్టు.

మంజుల మళ్లీ మొదలెట్టింది. "ఎంత సర్దుకుపోదామనుకున్నా మీ అమ్మగారి తత్త్వం ఏమిటో నాకేమీ అంతు చిక్కడంలా. మొన్న నేను విపరీతమైన తలనొప్పితో బాధపడుతూంటే, మీ చెల్లెలిని స్టేషను వరకూ సాగనంపి రాలేదని, ఆ రోజు ఎంత రుసరుస లాడిందనుకున్నారు! నెల్లాళ్ళ క్రితం ఓ రోజు మాట వరసకి సుబ్బులుతో 'ఓ వారం రోజులు మా ఊరెళ్ళి నా చిట్టి తమ్ముడిని చూసిరావాలి" అని అంటూంటే మీ అమ్మ క్షణంలో ముఖం కందగడ్డలా చేసుకుని 'అమ్మగారి ఊరెళ్ళటానికి అదొక సాకు దొరికిందా నీకు? మూపు శివుసమీద, చిత్తం చెప్పులమీద అన్నా సామెతగా మనిషి యిక్కడే ఉంటున్నా నీ మనస్సెప్పుడూ అమ్మగారింటిదగ్గరే ఉంటుంది గాబోలు! ఇక్కడ యిన్ని సదుపాయాలూ, సౌకర్యాలూ ఉంటున్నా అమ్మగారింటిమీది మోజు ఎప్పుడూ తగ్గదే!—అక్కడ మీ అమ్మగారేదో నీ రాక కోసం మహా పడిగాపులు పడుతూన్నట్టు' అని ఏదేదో యిష మెచ్చినట్టు మాట్లాడింది.. ఇంకెందుకండీ నిన్న సాయంత్రం, ప్రతిరోజూ ఆమెకు పళ్ళరసంతీసి పెట్టేదాన్ని. నాకు వంటగదిలో తీరిక లేక సుబ్బుల్ని తీసిపెట్టమన్నాను. అది రసం తీయబోతూంటే 'ఏమే అమ్మాయికి ఆ మాత్రమన్నా తీరిక దొరకలేదా. ఈ పని నీకు వప్పజెప్పింది. నువ్వాపళ్లు అక్కడే పడేసి వెళ్లు. అమ్మాయికి తీరిక దొరికినప్పుడే వచ్చి రసం తీసి పెడుతుందిగానీ' అని దాన్ని కసురుకుని, నేను స్వయంగా వెళ్ళి ఆ పని చేసి పెట్టేవరకూ తన పంతం వదలి పెట్టలా. ఇలా ప్రతి చిన్న విషయానికీ సాధింపులూ, అరుపులూ, పెడబొబ్బలతో మీ అమ్మ మరీ చిరాకు తెప్పిస్తోందండీ ఈ సంగతులన్నీ మీతో చెబితే 'మొగుడికి చాడీలు చెప్పి నూరిపోస్తోందని' అనుకుంటుందని ఇంతవరకు మీ దగ్గరికి తీసుకురాలేదు......అయినా ఏమి విచిత్రమోగానీ ఆమెగారి ఈ విసుక్కోవటాలూ, సణుక్కోడాలూ అంతా ఓ ఆరేడు నెలలుగానే. అంతకు పూర్వం, చెప్పకో వద్దూ, ఆమెకు నేనంటే చాల అభిమానం. ఆఁ మరచిపోయాను మరో సంగతి మొన్న.. "

"ఆఁ యివ్వాల్టికి చాల్లే. నోరుమూసుకుని పడుకో వేయిక. అసలే మా అమ్మకు కాస్త స్క్రూ లూజు. అందులోనూ యిప్పుడు జబ్బు మనిషి. ఇక చెప్పాలా, ఆమె చెప్పే వన్నీ ఆ చెవిలో విని ఈ చెవిలోంచి వదిలి పారెయ్. తెలిసిందా..... లైటు ఆర్పేసి పడుకో యిక!" అని తన సతీమణి చాడీల పురాణానికి సడన్‌గా 'ఫుల్‌స్టాప్' పెట్టేసి ముసుగుదన్ని పడుకున్నాడు భానుమూర్తి.

మంజుల బుంగమూతిపెట్టి "అవునేలెండి. నే నేది చెప్పబోయినా మీ బుర్రలోకి ఏమీ ఎక్కదుగా. మీతో చెప్పటం నా తెలివి తక్కువగానీ" అంది లైటు ఆర్పేస్తూ.

మర్నాడు ఉదయం భానుమూర్తి ఆఫీసు కెళ్ళటానికి కార్లో కూర్చుని 'స్టార్టు' చేశాడో లేదో, ఇంటిలోపలినుంచి 'ఏవండీ!' అన్న సతీమణి సన్నని కంఠం చెవిని బడటంతోటే

చటుక్కున బ్రేకు వేశాడు. గింజుకుంటూ క్షణంలో మంజుల పోర్టికోలో ప్రత్యక్షమై, 'ఏమండీ! ఆ రిఫ్రిజిరేటరు సంగతి యివ్వాళ కూడా మరచిపోరుగా. మళ్ళీ యథాలాపంగా సాయంత్రం ఏదో ఓ కుంటిసాకు పట్రాకండి. ఎల్లాగయినాసరే యివ్వాళ ఆ కంపెనీకి వెళ్ళి దాని సంగతి తప్పకుండ తేల్చుకు రావాలి" అంది కోపం అభినయిస్తూ.

"సరే సరే, ఈ సాయంత్రం నేను క్లబ్బు కెళ్ళకుంటే, నాకు తీరిక దొరికితే, జ్ఞాపకముంటే.. చూద్దాంలే." అంటూ ఒక్కసారి చిలిపిగా మంజుల కళ్ళల్లోకి చూసి నవ్వి 'బుర్రు'మని ఉడాయించాడు భానుమూర్తి.

'అదేమీ కుదరదు. ఎల్లాగయినాసరే ఈ సాయంత్రం మర్చిపోయారా.. (చెబుతా మీ పని.)' — మంజుల వార్నింగు అందుకోకుండానే జారుకున్నాడు భానుమూర్తి.

కారులోని భర్తని కనుచూపుమేర సాగనంపి, హాల్లోకి అడుగిట్టిందో లేదో, 'ఏమిటమ్మాయ్! వాడినలా వీధిలో నిలబడి కాకిస్తున్నావ్. ఇవ్వాళ వాడికి తీరిక లేదంటూంటే, ఏమిటీ అర్థంలేని బెదిరింపు? అయినా మూడు వేలుపెట్టి ఆ పాడు రిఫ్రిజిరేటరు కొనకపోతే ఏం కొంప మునిగిపోయిందీ!' అని ఖంగున మోగే కంచు కంఠంతో మాణిక్యమ్మగారు మందలించింది. రెండు క్షణాలపాటు అయోమయావస్థలో 'ఎలక్ట్రిక్ షాక్' తిన్న మనిషిలా ఉక్కిరి బిక్కిరై పోయింది మంజుల. మరుక్షణం తమాయించుకుని, ఉక్రోషం పెల్లుబికి వస్తున్నా దిగమ్రింగుకుంటూ 'ఎందుకత్తయ్యా మీకు నా మీద అంత కోపం! నేనేమీ ఆయన్ని శాసించలేదు. ఆ సంగతి జ్ఞాపకం చేశాను. అంతే!.. అయినా ఆ రిఫ్రిజిరేటరు ముఖ్యంగా మీ కోసం తెచ్చిన పళ్లు దాచటానికేగా తెమ్మని చెప్పింది. నా స్వంతానికి కాదుగా" అంటూ అత్తగారి ముఖంలోకి కొరకొర చూసి, పమిట చెంగును విసురుగా భుజాలమీదికి లాక్కుని చరచరా, మెట్లెక్కి మేడమీది కెళ్ళిపోయింది మంజుల.

ప్రక్కన డ్రాయింగురూములో న్యూసు పేపరు దగ్గరెట్టుకుని తాపీగా 'చెస్సు' ప్రాంబ్లమ్ సాల్వ్ చేసుకుంటూన్న శేషాద్రిగారు, అత్తా కోడళ్ళ మధ్య చెలరేగిన ఆరాద్ధాంతం విని గది వెలుపలికొచ్చి భార్యతో "ఏమే! ఆ అమ్మాయితో ఎందుకలా లేనిపోని గొడవ పెట్టుకుంటావ్? ఈ సంసారం జరిపించే బాధ్యత వాళ్ళకు వదిలిపెట్టెయ్యక, ఎందుకి [illegible]క్యం కలిగించుకుంటావ్? అయినా నీ జబ్బును గురించి ఆ అమ్మాయ్ ఇంత శ్రద్ధ తీసుకుంటూంటే సంతోషపడాలిగానీ యి[illegible]" అన్నారు.

'అవున్లెండి, ఎన్ని లక్షలు తెచ్చి మీ

# ఫలించని ప్రణాళిక

ముందర కుమ్మరించిందని అస్తమానూ యిలా ఆ కోడలమ్మాయిని వెనకేసుకొస్తూంటారు?'

'నాన్సెన్స్. నోరుమూయ్. ఎవరన్నా వింటే నవ్విపోతారు. డబ్బు తీసుకొస్తేనే నీ కోడలా, నీ వెట్టిగానీ. అమ్మాయి మన కందరికీ నచ్చితేనేగా మన కోడలైంది. వాడూ కట్నం తీసుకోకూడదన్న ఆదర్శాన్ని నిలబెట్టుకున్నందుకు తృప్తిపడ్డాడు. మన కందరికీ సంతోషమేగా."

"ఆ-ద-ర్శ-ం" — ఆవేశంతో ప్రతి అక్షరాన్నీ నొక్కి పలుకుతూ వెర్రిగా అరచింది మాణిక్యమ్మగారు. 'ఎందుకా ఆదర్శం! ఎవరికోసమా ఆదర్శం! కట్నం పుచ్చుకున్న వాళ్ళందరూ నాశనమైపోయారా, లేకుంటే వాళ్ళ ఆదర్శాలన్నీ నట్టేట గలిసిపోయాయా?"

'ఏమిటా పిచ్చివాగుడు? అయినా వాడికి పెళ్ళయి మూడేళ్లు కావస్తూ మరో ఐదారు నెలల్లో మనకో మనమడో, మనమరాలో పుట్టబోతూంటే యిప్పుడెందుకొచ్చిందీ ప్రస్తావన! ఊరుకో యిక మాట్లాడక!" అని గదిలోకి వెళ్ళిపోయారు శేషాద్రిగారు. కట్నం సంగతి యిప్పుడు తన భార్య ఎందుకు లేవదీసిందో, యితరులు ఆట్టే గ్రహించలేకపోయినా, శేషాద్రిగారి ఊహకు అందలేకపోలేదు.

* * *

మూడేళ్ళక్రితం భానుమూర్తి ఎం. ఏ. పూర్తిచేసి రిజర్వు బేంకు ఉద్యోగంలో ప్రవేశించటంతోటే, అతని పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టాయ్. శేషాద్రి, మాణిక్యమ్మ దంపతులకు ముగ్గురు సంతానం—ఇద్దరబ్బాయిలు, ఒక్కమ్మాయి. ఆ ఇద్దరబ్బాయిల్లో పెద్దవాడిని అకాలంగా టైఫాయిడు అంతం చేయగా వరలక్ష్మి, భానుమూర్తి మాత్రం మిగిలారు. వరలక్ష్మి పుట్టిల్లు వదలి అత్తారిల్లు మెట్టేసరికి శేషాద్రిగారి బేంకు నిలవలో అమాంతంగా ముప్ఫైవేలు జారిపోయింది.

ఒకరు - ఏమండీ, రంగయ్యగారిల్లెక్కడండీ?

మరొకరు - ఆయన కేమిపనండీ, ఇల్లెక్కడానికి?

—తాడిబోయిన సాయిబాబ
(గుంటూరు)

అయితే అమ్మాయి శ్రేయస్సు కోసం, అంతస్థు కాపాడుకోవటం కోసం ఆ మాత్రం వదులుకోక తప్పదని తృప్తిపడ్డారు శేషాద్రిగారు. 'ఈ రోజు పాతికవేలు అమ్మాయికోసం కట్నం ఈ చేత్తోయిస్తే, రేపు అబ్బాయిపెళ్లికి అంతకు రెట్టింపు ఆ చేత్తో రాబట్టుకోవచ్చుగదా' అనే ధైర్యంతో అమ్మాయి పెళ్లికయిన ఖర్చుకు ఆట్టే వాపోలేదు మాణిక్యమ్మగారు.

కానీ కానీ ఆమె వేసుకున్న పథకానికి, అందరిలోకీ భానుమూర్తి ఎదురుచుక్క పెడతాడని మాణిక్యమ్మగారు ఏనాడూ కలగనలేదు. భానుమూర్తి, తను పెళ్లాడే పక్షంలో కట్నం చిల్లిగవ్వయినా ససేమిరా పుచ్చుకోనని పంతంపట్టి కూర్చున్నాడు!

"రాయీ, రాయీ కలిస్తేనేగానీ కొండ కాలేదురా అబ్బాయీ! ఇవ్వాళ మన చుట్టాలు పక్కాలు మనల్ని యింతగా గౌరవిస్తున్నారంటే మన ఆస్తిని చూసేరా నాయనా! నీ బావతాలూకువాళ్ళు పాతిక వేలు నిక్షేపంగా కట్నం పుచ్చుకోలా. అయినా మనం ఏమీ అడగక్కర్లేకుండానే పిల్లతాలూకువాళ్లు కట్నమిస్తామంటూ ముందుకొస్తూంటే, పుచ్చుకోటానికి జంకుతావేమిరా!" అని మాణిక్యమ్మగారు కొడుకును ఎంతోదూరం బతిమిలాడింది. వాదించింది.

దానికి భానుమూర్తి యిచ్చిన సమాధానం ఒక్కటే "అమ్మా! నాన్న ఇన్కమ్టాక్స్ ఆఫీసరుగా రిటైరై లక్ష రూపాయలు ఇంటకి తెచ్చారు. చెల్లాయి పెళ్ళి ఒక పెద్ద ఖర్చనుకుంటే, అదీ సక్రమంగా అయిపోయింది. మనకు స్వంత యిల్లూ, వాకిలీ ఉంది. పైగా నా ఉద్యోగం యిప్పుడే నెలకు నాలుగు వందలు పలుకుతోంది. ఇక నా కొచ్చే మామగారి దగ్గర్నించి చిల్లర డబ్బుల కెగురు మూడాల్సిన ఖర్మ మనకేం పట్టిందీ?"

శేషాద్రిగారు ఈ విషయంలో కుమారుడి భావాలవైపు మొగ్గారు. తండ్రీ కొడుకులు ఏకమైనా, తన అభిప్రాయాన్ని ఎంతమాత్రమూ మార్చుకోనని భీష్మించుకు కూర్చుంది మాణిక్యమ్మగారు. రెండు మూడు మంచి సంబంధాలు, అంటే మాణిక్యమ్మగారికి నచ్చినవి, వచ్చాయ్. అయితే తల్లీ కొడుకుల మధ్య రాజీ కుదరక అవి వెనక్కు తిరిగిపోయాయ్. ఆఖరికి మంజుల సంబంధం తగిలింది. మంజుల పరంధామయ్యగారి మొదటి భార్యకు కలిగిన ఒక్కతె కూతురు. ఆయన మొదటి భార్య చనిపోయిన తరువాత ఐదేళ్ళక్రితం రెండో వివాహం చేసుకున్నాడుగాని సంతానం ఏమీలేదు. పరంధామయ్య ఆట్టే కాలేజీలలో చదువుకోకపోయినా, ఆధునిక భావాలు గలవాడు, ఉత్సాహవంతుడూ, వ్యాపారంలో స్వయంకృషివల్ల పైకొచ్చినవాడు. ఆస్తి నికరంగా యాభైవేలకు

పైచిలుకు ఉంది. మంజుల చూట్టానికి రబ్బరు బొమ్మలా మిసమిసలాడే పసిడిరంగుతో, నిండైన విగ్రహం. ఇంటర్మీడియట్ వరకూ చదువుకుంది. స్వతహాగా తెలివైన పిల్ల. అందువల్ల పరంధామయ్య తన కూతురి పెళ్ళి విషయంలో, అమ్మాయికి పదివేల పైచిలుకు నగలు తప్ప, పెళ్ళికుమారుడికి కట్నరూపకంగా ఏమీ యివ్వదలచుకోలేనట్టు నిక్కచ్చిగా చెప్పాడు. అంటే కట్నాల పద్ధతిని తను పాటించగూడదని నిశ్చయించుకున్నట్టు విశదపరచాడు—ఈ సంబంధం భానుమూర్తికీ, శేషాద్రిగారికీ పూర్తిగా నచ్చింది. ఆశ్చర్యం! మాణిక్యమ్మగారుకూడ ఈ పెళ్ళికి 'సై' అంది!

ఓ శుభముహూర్తాన మంజుల శేషాద్రి, మాణిక్యమ్మగార్ల కోడలైంది. క్రొత్తలో కోడలంటే మాణిక్యమ్మగారికి చాల అభిమానం. మంజుల, అత్తారింటికి వెళ్ళిపోయిన తన కూతురిస్థానం భర్తీ చేయటానికే వచ్చినదని ఎంతో మురిపెం చూపెడుతూండేది. మంజుల, యింటిపని ఏదైనా స్వయంగా చేయబోతే, ఆమెను వారించి ఆ పని పనిమనుషులకు వప్పజెప్పేది. మంజుల మేడమీది గదిలో కూర్చుని ఏదైనా నవల చదువుతూ, భోజనాలవేళ కాస్త దాటిపోయినా, చేతులు కడుక్కోటానికి నీళ్ళతో సహా భోజనాన్ని మేడమీదికి సరఫరా చేయించిన రోజులున్నాయ్. ఇక యింటికి వచ్చిన ప్రతి వాళ్ళతోటీ తన కోడలి పుట్టుపూర్వోత్తరాలూ, అంద చందాలూ, నిరాడంబరత్వం, చదువూ, అణకువ మొదలైనవి సోదిలా వల్లించి, వాళ్ళందరూ ఏదో ఓ రకంగా తన కోడలిని స్తుతించేదాకా వదలిపెడుతూండేది గాదు మాణిక్యమ్మగారు!

అలాంటి మాణిక్యమ్మగారికి, కోడలు కాపురానికొచ్చిన రెండేళ్ళ తరువాత ఆమె మీద అనురాగం అమాంతంగా పాలపొంగులా అణగారిపోవటం మాత్రమే గాకుండ, చీదరింపుగా మారటానికి కారణం? ఈ కారణం ఎవ్వరూ పసిగట్టలేకపోయారు—ఒక్క శేషాద్రిగారిని మినహాయించి! ఆమె వైఖరి అలా ఒక్కుమ్మడిగా మారిపోవటానికి కారణం ఊహించలేక ఆదిలో చాల తికమక పడ్డారు భానుమూర్తీ మంజులానూ. కానీ కొన్నాళ్ళకు మాణిక్యమ్మగారిదేహంలో దాగుతూన్న గుండెజబ్బు మళ్ళీ ముదిరి మంచం పట్టటంతోటే, ఆమె వైఖరిలో ఏర్పడ్డ మార్పు ఆ జబ్బు పర్యవసానమేనని సమాధానపర్చుకున్నారు భానుమూర్తి దంపతులు. అంచేత తన తల్లి, భార్యను అనవసరంగా సాధిస్తోందని తెలిసినా, ఆమె మనస్సు నొప్పించకూడదనే భావంతో తటస్థంగా ఉండిపోయాడు భానుమూర్తి. అయితే మాణిక్యమ్మగారి తత్త్వం అలా మారిపోవటానికి ఆమె గుండెజబ్బు కాదు కారణం!

అసలు కారణం? మంజుల పెళ్ళయిన రెండేళ్ళ తరువాత ఓ రోజు ఉదయం పరంధామయ్యగారి ద్వితీయ కళత్రం ఓ చక్కటి మగశిశువును ప్రసవించింది. పరంధామయ్యగారికి వంశోద్ధారకుడూ, ఆస్తికి వారసుడూ ఉదయించాడని అందరూ అతని అదృష్టాన్ని మెచ్చుకున్నారు. చిట్టి తమ్ముడు పుట్టినందుకు సంతోషంతో నాట్యం చేసింది మంజుల లేత మనస్సు.

—అయితే యిది మాణిక్యమ్మగారి ప్రవర్తనలో ఎలా మార్పును తీసుకు రాగలిగింది? మాణిక్యమ్మగారు ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టగల మనిషి. దూరాలోచన గల వ్యక్తి. మంజుల సంబంధాన్ని, కట్నం లేకపోయినా అడ్డుపెట్టకుండ ఒప్పేసుకుందంటే దానికి కారణం—'పరంధామయ్య రెండో పెళ్ళి చేసుకుని ఐదేళ్ళవుతున్నా పిల్లలు కలుగలేదుగదా, యిక ఆయనకు సంతాన ప్రాప్తిలేదు. మంజుల పెళ్ళికి కట్నమిచ్చినా యివ్వకపోయినా, అతని ఆస్తి అంతా, అతని తరువాత విధిగా మంజులకేగా దక్కుతుంది' అనే ఆమె ఆలోచన! కానీ ..కానీ... ఆమె మనస్సులో గూడుకట్టుకుని ఉన్న ఆ ప్రణాళిక, పరంధామయ్యగారి రెండో భార్య గర్భవతి అయిందని తెలియగానే కాస్త చెదరిపోయింది. 'అయినా పుట్టబోయేది ఆడపిల్లయితే ఆట్టే నష్టమేమీ ఉండదులే' అని మనస్సు దిటవు పరచుకుంది. కానీ, మంజులకు సవతి తమ్ముడు కలగటంతోటే ఆమె మనస్సులోని గూడు నామరూపాలు లేకుండా చితికిపోయింది. నిక్షేపంగా తన వంశానికి దక్కుతుందనుకున్న పరంధామయ్యగారి ఆస్తి హఠాత్తుగా చేజారిపోయినందుకు ఆమె మనస్సు అల్లకల్లోలమై ఆ శాకిడి మంజుల మీద ద్వేషంగా రూపొందింది.




చిత్రకారుడు. చెరుకూరి గురవయ్యనాయుడు (పాకాల.)

* * *

మంజుల ఆడపిల్లను ప్రసవించిందనీ, తల్లీబిడ్డా క్షేమంగా ఉన్నారనీ, ఓ రోజు పరంధామయ్యగారివద్దనుంచి భానుమూర్తికి టెలిగ్రాము వచ్చింది. అమ్మకూ, నాన్నకూ ఆ శుభవార్తను అందజేశాడు. ఇంటిల్లిపాదీ ఆ రోజు ఎంతో సంబరపడ్డారు. మాణిక్యమ్మగారు, ప్రత్యేకించి మనమరాలు కలిగినందుకు ఉప్పొంగిపోయింది. "మహాలక్ష్మి పుట్టిందిరా నీకు" అని కుమారుడికి తన ఆనందాన్ని వెలిబుచ్చింది. హఠాత్తుగా మళ్ళీ మాణిక్యమ్మగారిలో ఉబికిన ఈ ఉత్సాహానికీ, ఆనందానికీ మరేదయినా కారణం ఉండేమోనని అనుమాన పడబోయారు తండ్రీ, కొడుకులు.

"ఐదవమాసం తరువాత తల్లీ, బిడ్డను అత్తారింటికి పంపించదలచుకున్నట్టు" పరంధామయ్య జాబులో వ్రాశాడు.

"అంత ఆలశ్యం ఎందుకూ? మూడోమాసం తరువాత యిక్కడికి పంపించమని వ్రాయి. ఇక్కడ యిల్లంతా చంటిపిల్లలు లేకుండా కావురుమంటోంది. నాకూ ఏమీ ప్రొద్దుపోవటంలా. చిట్టితల్లిని త్వరగా చూడాలి" అని మాణిక్యమ్మగారు తన ఆతురతను కుమారుడికి వెలిబుచ్చింది.

ఇన్నాళ్ళూ కోడల్ని వేపుకుతింటూ, కాన్పుకు అమ్మగారింటికి వెళ్ళి రెండు నెలలయినా ఏనాడూ కోడలు యోగక్షేమాలను గురించి అడగని తన తల్లి, మంజుల ఆడపిల్లను ప్రసవించిందని తెలియటంతోటే యింత హంగామా చేస్తోందో, 'ఎంత చపల చిత్తపు మనిషి' అని ఆశ్చర్యపడకపోలేదు భానుమూర్తి. అయినా ఎక్కువసేపు ఆట్టే ఆలోచించక 'ఆడవాళ్ళ మనస్సు యింతే గాబోలు! క్షణంలో గుర్తుపట్టలేనంతగా మారిపోతుంది' అని అనుకున్నాడు.

మూడు నెలల తరువాత మంజుల, బిడ్డ అత్తారింటికొచ్చారు. పరంధామయ్య తీసుకొచ్చి వదలిపెట్టి పోయాడు. మనిషి అస్వస్థతగా ఉన్నా కొడుకుతోటి స్టేషనుకెళ్ళి, కోడల్ని, మనుమరాల్ని స్వయంగా యింటికి తీసుకొచ్చింది మాణిక్యమ్మగారు. స్టేషను నించి యిల్లు చేరేవరకూ ఆమె కారులో మనమరాల్ని తన ఒడిలోంచి కదలనిస్తే ఒట్టు!

ఆ రోజు రాత్రి మంజుల మేడమీది గదిలో బిడ్డను పడుకోబెట్టి భర్తతో కబుర్లాడుతూ "ఏమండీ నేనిక్కడ్నించి వెళ్ళిన తర్వాత మీ అమ్మగారు చిర్రుబుర్రులాడటం మానేసిందా? ఇప్పుడు చూస్తే మళ్ళీ మామూలు మనిషైపోయినట్టుందే?" అంది.

# ఫలించని ప్రకాశిక

"ఆఁ ఆఁ! నువ్వు ప్రసవించిన తరువాత అదేపనిగా నిన్నుగురించీ, పాపను గురించి తలపోయటం మొదలెట్టింది. ముఖ్యంగా పాపను త్వరగా చూడాలని వాపోతూండేది!

ఈ మాటలు విని మంజుల చిరునవ్వుతో, నిద్దరోతున్న పాప చెక్కిళ్ళను ఆప్యాయంగా నిమిరి 'ఫరవాలేదు' అయితే మరి మన పాప ఆమెలో చాలమార్పు తీసుకొచ్చిందన్నమాట !' అంది.

'ఆఁ! తప్పకుండా. ఇకమీద ఆమె నిన్ను కోప్పడినప్పుడల్లా నువ్వు నిస్సంకోచంగా పాపచాటున దాక్కోవచ్చు' అన్నాడు భానుమూర్తి.

మర్నాటినించి మాణిక్యమ్మగారు మనమరాలకి 'దాసురాలై' పోయింది. మనమరాలు కాస్త 'కెయ్' అంటే చాలు ఆమె కర్ణపుటాలు అదిరిపోయి 'అమ్మాయ్,మంజూలా, ఏం జేస్తున్నా వక్కడ? ఇక్కడ చిట్టితల్లి ఏడుస్తోంటే. ఆపనేదో సుబ్బులికి వప్పజెప్పి త్వరగా యిటు రామ్మా' అని పురమాయించేది. ఉదయం మొదలు రాత్రివరకు, పకు పాలు పట్టడం మొదలుకుని, స్నానం చేయించి నిద్రపుచ్చడం వరకు టైము ప్రకారం జరిపించడం ఆమెవంతు.

మాణిక్యమ్మగారు గుండెజబ్బుతో మంచం పట్టి రాదాపు సంవత్సరం దాటింది. జబ్బు మొదట్లో కాస్త తగ్గుముఖం పట్టినా తరువాత ఆట్టే నెమ్మదించలేదు. ఓనాటి సాయంత్రం ఆమె స్నానాల గదిలోకి వెళ్ళబోతుండగా స్పృహతప్పి నేలమీదికొరిగింది. వెంటనే సుబ్బులూ మంజూలా ఆమెను మంచం మీదికి చేరవేసి డాక్టరును పిలిపించారు. డాక్టరు ఇంజెక్షను యిచ్చి మళ్లీ ఉదయం వస్తానన్నాడు మరుసటిరోజు ఉదయం మాణిక్యమ్మగారిని బాగా పరీక్షచేసి వెలుపలికొచ్చి భానుమూర్తినీ, శేషాద్రిగారినీ చాటుగా పిలచి, పెదిమలు విరిచి 'ఇక రెండు మూడురోజులు మాత్రమే' నని వెళ్లిపోయాడు. తండ్రీ, కొడుకులకి గుండెలు అమాంతంగా దిగజారిపోయాయ్

టెలిగ్రాములు అందరు ఆప్తబంధువులకూ వెళ్లాయ్. మాణిక్యమ్మగారి పరిస్థితిని పరామర్శించటానికి గుంపులు గుంపులుగా బంధువులు వచ్చిపోతున్నారు. మాణిక్యమ్మగారికి ఈ రెండు రోజుల్లో మూడుసార్లు మళ్లీ స్పృహతప్పింది. మూడోసారి తెలివి వచ్చిన తరువాత ఆమె మంజులను దగ్గరికి పిలిచి "ఏమమ్మా మీ నాన్న రాలేదా? ఎప్పుడొస్తాడు? చూడాలని వుంది"అని చెప్పింది.

"టెలిగ్రాం యిచ్చారట అత్తయ్యా, బహుశా ఈ రాత్రి మెయిలుకు రావచ్చు."

అనుకున్న ప్రకారమే రాత్రి మెయిల్లో పరంధామయ్య దిగారు. శేషాద్రి గారితోనూ, భానుమూర్తితోనూ ముసలావిడ పరిస్థితిని గురించి మాట్లాడి హాల్లోకి అడుగుపెట్టాడు. గ్లాసులో మంచినీళ్లు యిస్తూ "నాన్నా! మీరింకా రాలేదా అని అడిగింది అత్తయ్య. వెంటనే వెళ్లి చూడండి" అంది మంజుల.

'పరంధామయ్య గారు గదిలోనికి అడుగు పెట్టే సరికి మాణిక్యమ్మగారు ఆమె మంచం చుట్టూ చేరిన నలుగురైదుగురు బంధువులతో ఏదో మెల్లిగా మాట్లాడుతూ, వాళ్ళ చేతుల్లో ఉన్న పాపతో పరిహాసాలాడుతోంది. ఇంతలో మంజుల వచ్చి "అత్తయ్యా, నాన్నా రొచ్చారు" అని చెప్పటంతోటే ఆమె కళ్లు ఆనందంతో మెరిశాయి. పాలిపోయి వణుకుతూన్న ఆమె పెదాలమీద చిరునవ్వు తాండవించింది. లేవటానికి ప్రయత్నం చేయబోగా, పరంధామయ్య 'ఆఁ, ఆఁ ఏమీ ఫరవాలేదు శ్రమపడకండి' అని పడుకోబెట్టి 'ఎలాగుంది మీ ఒంట్లో' అనడిగాడు. 'ఇలాగుంది నాయనా' అని అంటూండంగా మాణిక్యమ్మగారి ముఖం ముడుచుకుపోయి ఆమె కనుకొలకుల్లోంచి రెండు అశ్రువులు ఉబికాయి.

మనమరాల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ పరంధామయ్య 'మీరలా అధైర్యపడకూడదు. డాక్టరు మంచి మందులిస్తున్నాడనివిన్నాను. జబ్బు త్వరలో నెమ్మదైపోతుందిగా' అని ధైర్యం చెప్పాడు.

కాస్సేపు నిశ్శబ్దం. కన్నీటి చుక్కలు తుడిచేసుకుని పరంధామయ్యను తన దగ్గరకు రమ్మని సైగచేసి మాణిక్యమ్మ తడబడుతున్న కంఠంతో 'నాకిక ఆశలేదు నాయనా. కానీ నాకు ఒక్క కోరిక మాత్రం మిగిలిపోయింది. అది కాస్త, నెరవేరుస్తానని మాటివ్వాలి' అని అడిగింది.

'సరే'నన్నట్టు తలూపాడు పరంధామయ్య.

పాపకేసి చూపెడుతూ 'అదిగో నా చిట్టి తల్లిని తప్పకుండ నీ కోడలుగా చేసుకోవాలి నాయనా. ఇదే నా కోరిక – కాదనకు' అని అతని చేతులు తాకింది మాణిక్యమ్మ. పరంధామయ్య పాపను ముద్దుకుని, చిరునవ్వుతో 'సరే అలాగే. మీరేమీ బెంగెట్టుకోకండి' అని పాపను తీసుకుని గది వదలి వెళ్లిపోయాడు. మంచంచుట్టూ ఉన్న బంధుజనం 'ముసలావిడకు ఎంతలావు ఆలోచన! తను చావబోతున్నా పరంధామయ్య గారి ఆస్తి పరాయి వాళ్ళకు దక్కనివ్వకూడదని ఎంత పెద్ద కోరిక కోరిందీ!' అని గుసగుసలాడుకున్నారు!

మర్నాడు ఉదయం మళ్లీ మాణిక్యమ్మగారికి స్పృహ తప్పింది. ఆమె శరీరంలో చిరకాలంగా స్థావరం ఏర్పరచుకున్న మమతలూ, ఆలోచనలూ, ఆశలు ఒక్కసారిగా బహిర్గతమైపోయాయి శాశ్వతంగా! ★




-దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

7-12-60 బుధవారం మొదలు

13-12-60 మంగళవారంవరకు.

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

దైవబలం బాగున్నది. ఇంతకు ముందు అధైర్యంతో చిన వ్యవహారాలలో జయం లభిస్తుంది. లాటరీవంటి పనులలో ఫలితం పొందగలుగుతారు. అపవాదులు తొలగిపోయి సంఘంలో గౌరవం లభిస్తుంది. ఇతరులవద్ద నుంచి రావలసిన ధనం ఆలస్యంగా రాగలదు. కుటుంబంలో మనశ్శాంతి లభిస్తుంది. అనుకున్న పనులు చురుకుగా జరుగకపోయినా అదురాపడవద్దు. మీ సహాయం పొందుతూ ఇతరులతో మిమ్మల్నిగురించి చులకనగా మాట్లాడేవారుంటారు. ధర్మకార్యాలలో పాల్గొంటారు. ఎదటి వారి మెప్పుదల కోసం అప్పుల భారం పైన వేసుకోనటం మంచిది కాదు. తూర్పు దిక్కునుంచి ధనలాభం ఉంటుంది. 12, 13 లలో అసౌఖ్యము, స్వల్ప ఫలము, కార్యభారం.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

శ్రమపడుతూ ముందుకు పోవలసిన సమయం. అసమరులైన మనుష్యుల సహాయంతో మీ కార్యక్రమాలను కొనసాగించవలసి వస్తుంది. కలహప్రసంగాలకు దూరంగా ఉండటం అవసరం. దూరమందున్న వారితో సంప్రదింపులు అనుకూలిస్తవి. కోర్టు కచేరీలలో ధనవ్యయము కనుపించినా మొత్తంమీద మాట దక్కుతుంది. లోగడ చేసిన వాగ్దానాలు, కంట్రాక్టులవంటి పనులు నెరవేరటం కష్టంగా తోస్తుంది. వాగ్ధాటితో పదిమందిని ఆకర్షించి కీర్తిప్రతిష్ఠలు పొందగలుగుతారు. దుబారాఖర్చులను తగ్గించుకోనటం మంచిది. ముఖ్యసందర్భాలలో మీరు సందేహాలు రావటంవల్ల అవకాశాన్ని వదులుకొంటారు. 9, 10 లలో కష్టవార్తలు బంధు విరోధము.

* * *

**మిధునం :**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఇతరులదృష్టిలో మీరు సుఖంగాఉన్నట్లే తోస్తుంది. కాని ఆంతరంగికంగా ఆందోళన పడుతూ ఉంటారు. వృత్తి వ్యాపారాలలో శ్రమకు తగినంత ఫలితం పొందలేకపోతారు. బంధుమిత్రుల కార్యభారం క్రమంగా పెరుగుతుంది. పైత్య ఉష్ణప్రకోపాలవల్ల అసౌఖ్యం కనిపిస్తూ ఉంటుంది. పెద్ద మనుష్యులతో పరిచయం లభిస్తుంది. ఎదురు చూస్తున్న వార్తలు సకాలంలో వస్తవి. ధనలాభం మాత్రం నిదానంగా ఉంటుంది. స్థిరాస్తులు అమ్మటం, మార్పులు చేయటంవంటి పనులు అనుకూలిస్తవి. ఈ సమయంలో ఇచ్చిన అప్పులు తిరిగి వస్తవని ఎదురు చూడవద్దు. విలాస వినోదాలనిమిత్తం ఖర్చులు పెరుగుతవి. కాని సంతృప్తి కలుగదు. అగ్ని, యంత్ర సంబంధమైన పనులలో జాగ్రత్తగాఉండండి. 7, 8 లలో ధనప్రాప్తి, శుభవార్తలు, మిత్రలాభం.

**గ్రహస్థితి**

మిధునంలో అంగారకుడు, సింహంలో రాహువు, వృశ్చికంలో సూర్యబుధులు, ధనుస్సులో గురు శనులు, మకరంలో శుక్రుడు కుంభంలో కేతువు, కర్కాటక సింహ కన్యలలో చంద్రుడు.

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

హుందాతనంతో పనులు సాధించుకోగలుగుతారు. మీ ఆలోచనలు వెంట వెంటనే ఫలిస్తు ఉంటవి. తాత్కాలికంగా బంధు విరోధం వస్తుంది. క్రొత్త మనుష్యులతో స్నేహసంబంధం కలుగుతుంది. పిల్లలమూలంగా సుఖసంతోషాలు లభిస్తవి. పుణ్యకాల క్షేపాలు, తీర్థయాత్రలు నెరవేరుతవి. ఇతరుల వద్దనుంచి ధనం ఎదురు చూచి ఆశాభంగం పొందవలసివస్తుంది. వృత్తి ఉద్యోగాలలో ఇతరుల బాధ్యతలు పైన వేసుకోవలసివస్తుంది. స్వల్పవిషయాలలో మాట వచ్చేటట్లు తోస్తుంది. అయితే ముందు జాగ్రత్తవల్ల తప్పించుకోగలుగుతారు. కుటుంబంలోని వారికి అనారోగ్యం చేస్తుంది. ఇతరుల కలహాలలో ప్రవేశించతగిన సమయం కాదు. 11,12 లలో గృధాకలహాలు, వస్తునష్టం, ధనప్రాప్తి.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఎవరు ఏమి చెప్పినా తలవంచకుండా ఊరుకోవలసిన సమయం. నిదానంగా అన్ని రంగాలలోను మేలు కలుగుతుంది. అసాధ్యమైన పనులయందు ఆసక్తి పెరుగుతుంది. వృత్తి ఉద్యోగాలలో వృద్ధికరమైన సూచనలున్నవి. బంధువులవద్దనుంచి శుభవార్తలు వస్తవి. ఇతరులకు ధనసహాయం చేయగలుగుతారు. క్రొత్తవారి స్నేహంవల్ల మీ అభిప్రాయాన్ని మార్చుకుంటారు. సంఘకార్యాలలో తిరుగుచు పాల్గొంటారు. ప్రయాణాలు సుఖంగానూ, కొంతవరకు లాభకరంగానూ ఉంటవి. కుటుంబంలో మీ మాట చలామణి అవుతుంది. కార్యభారం క్రమంగా తగ్గించుకోగలుగుతారు. అసంపూర్తిగా నిలచిపోయిన మీ ప్రయత్నాలు త్వరలో ఫలిస్తవి. 7, 8 లలో శుభవ్యయం, ఆదాయవృద్ధి, శ్రమ.

* * *

**కన్య :**

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా)

బుద్ధిబలంతో అన్ని రంగాలలోను విజయం సాధించగలుగుతారు. ధనసంబంధమైన చిక్కులు తీరిపోతవి. వ్యవహారాలలో పరిష్కారం కుదరటంవల్ల మీ కార్యక్రమాలకు మార్గం లభిస్తుంది. పిల్లల ఆరోగ్యం లోపించగల అవకాశాలున్నవి. కుటుంబ వ్యవహారాలలో క్రొత్త సమస్యలు బయలుదేరుతవి. ఖర్చులు పెరుగుతవి. ఆప్తులతో వియోగం కాని, విరోధాలు కాని వస్తవి. కొన్ని విషయాలలో అభివృద్ధి కనిపిస్తు ఉన్న సమయంలో కొన్ని సందర్భాలలో బాధపడ

వలసివస్తుంది. ఆదాయం వృద్ధి అవుతుంది. బాహ్య ఆడంబరాన్ని తగ్గించుకొనటంవల్ల కార్యభారం తగ్గించుకోగలుగుతారు. ప్రయాణాలు చేయవలసివస్తుంది దైవకార్యాలు సంతృప్తికరంగా జరుపుకోలేకపోతారు. 12, 13 తేదులలో స్వశక్తివల్ల కార్యసిద్ధి, మిత్రలాభం, ధర్మచింత.

* * *

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

వృత్తికి సంబంధించిన ప్రతిబంధకాలు తొలగిపోతవి. ఇంతకు ముందుకన్నా ఆరోగ్యం బాగుంటుంది. ఇతరుల చేతికి పోయిన డబ్బు కాని, వస్తువులు కాని సక్రమంగా చేరవు. దూరమందున్న స్నేహితుల వద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. ఇతరుల కలహాలలో మీ మధ్యవర్తిత్వం అవసరం అవుతుంది. శుభపుణ్యకార్యాలలో పాల్గొంటారు బంధువర్గంలో ఒకరిద్దరు మీతో వ్యతిరేకిస్తారు. ప్రస్తుతం ఆదాయంకన్నా కీర్తిప్రతిష్ఠలు బాగుంటవి. గొప్ప వారితో సమావేశం లభిస్తుంది. ఇతరులకు ఉత్తర ప్రత్యుత్తరాలలో పొరపాటు రాకుండా చూచుకోనండి. 7, 8, 9 లలో ఇతరులవల్ల సహాయము, ధనలాభము, సంచారం.

* * *

**వృశ్చికం:**

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

సందేహాలు తొలగి కార్యక్రమం నిర్ణయించుకోగలుగుతారు. స్నేహితుల ప్రోత్సాహం లభిస్తుంది. వ్యవహార వ్యాపారాలలో మీ శ్రమ చాలావరకు ఫలిస్తుంది. క్రొత్తవార్తలు వింటారు. బంధువులవద్దనుంచి వచ్చే వార్తలు తాత్కాలికంగా అశాంతిని కలుగచేయవచ్చు. మీ నిత్యకృత్యాలలో పొరపాట్లు,మార్పులురాగలఅవకాశాలున్నవి. మాటలసందర్భంలో తొందరపడి వాగ్దానాలు చేయకుండా చూచుకోనండి. వినోద సంబంధమైన ఖర్చులు పెరుగుతవి. ముఖ్యంగా మనోనిబ్బరము, గుట్టుగా పనులు సాగించుకొనటము అవసరము. ఇతరులవల్ల మోసానికి అవకాశాలున్నవి. 12, 13 లలో లాభవార్తలు, క్రొత్త పనులలో ప్రవేశం.

* * *

**ధనుస్సు :**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ ప్రథమ పాదం)

మీకు సహాయం చేస్తామన్న వారే పోటీకి తయారుకాగల సమయం. ప్రతి పనిలోను అభ్యంతరాలు కనిపిస్తు ఉంటవి. మీకు రావలసిన ధనం సకాలంలో వస్తుంది. వృత్తి ఉద్యోగాలలో మీ ఆశలు ఫలించేటట్లు తోచినా శ్రమ, ఆలస్యము వీటివల్ల నిరుత్సాహం కలుగుతుంది. కుటుంబంలో ఒక ప్రక్క అశాంతి ఉంటున్నా మీ నిర్ణయం ప్రకారం పనులు జరుపుకోగలుగుతారు అనేక రకాల సలహాలవల్ల ఆందోళన కలిగినా బుద్ధిబలంతో నిగ్రహించుకోగలుగుతారు. అకస్మాత్తుగా ఇంతకు ముందు ఏ విధంగాను సంబంధంలేని పనులలో చిక్కుకోవలసి రావచ్చు. సాధ్యమైనంతవరకు "అప్పు చేసి పప్పుకూడు" వంటి పనులకు పోవద్దు ఈశ్వరారాధన చేసుకొనటం మంచిది 10, 11 తేదులలో శుభవార్తలు, కార్యసిద్ధి

* * *

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

క్రమక్రమంగా మీ శక్తి సామర్థ్యాలకు తగిన అవకాశాలు లభిస్తవి. అయితే మీ మాటలలో, పనులలో ఇతరులకు తేలిక తోచకుండా చూచుకొనటం అవసరం. ధనసంబంధమైన లావాదేవీలలో చురుకుదనం కనిపిస్తుంది. మీ అంచనాకు కొంత తగ్గినా ఫలితం సకాలంలో లభిస్తుంది. గాలివార్తలు నమ్మికుని తొందరపడటంవల్ల వృథాఖర్చులు శ్రమ భరించవలసివస్తుంది. మాటలతో గౌరవిస్తున్నట్లు నటిస్తు క్రియలో ఉపయోగించనివారుంటారు. వారం రెండవ భాగంలో ఇతరుల నిమిత్తం శ్రమ, మీ కార్యక్రమాలకు ఆటంకాలు కనిపిస్తవి. ఋణబాధ తగ్గుతుంది. 12, 13 లలో ధనప్రాప్తి, శుభకార్యసిద్ధి.

* * *

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఇంతకు ముందు బాధిస్తున్న ధర్మ సంకటాలు తీరిపోతవి. బుద్ధిబలంతో పనులు నిరాటంకంగా సాగించగలుగుతారు. కుటుంబంలో శాంతి సౌఖ్యము లభిస్తవి. ఆదాయము, ఖర్చులు కూడా పెరగగల సమయం. దేహసౌఖ్యం సామాన్యంగా ఉన్నా వృత్తికార్యక్రమాలలో చురుకుదనంతో వ్యవహరించగలుగుతారు. అధికారుల ఆదరాభిమానాలు లభిస్తవి. తలవని తలంపుగా కార్యభారం పైన పడవచ్చు. ఆదుర్దా కలిగే వార్తలు తెలుస్తవి. విలువగల వస్తువులు కొంటారు. పుణ్యకార్యాలలో మొదట ఆటంకాలు వచ్చి పిమ్మట నెరవేరుతవి. నౌకర్లు మొదలయిన వారితో కలహాలు వస్తవి. 10, 11 లలో ఆందోళన, కార్యభంగము.

* * *

**మీనం:**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

గౌరవప్రదమైన కాలం. తలచిన పనులు సకాలంలో నెరవేరుతవి. దైవకార్యాలయందు ఆసక్తి పెరుగుతుంది. తగినట్లు అవకాశాలు కూడా లభిస్తవి. ధనసంబంధమైన లావాదేవీలలో కలహాలు వస్తవి. మీ మిత్రులకు మీయందు మంచి అభిప్రాయం ఏర్పడుతుంది. విరోధులవల్ల రావచ్చుననుకొంటున్న కష్టనష్టాలు తొలగిపోయి మనశ్శాంతి లభిస్తుంది. తూర్పు, ఉత్తర దిక్కులనుంచి ధనలాభం ఉంటుంది. ప్రయాణాలు సుఖప్రదంగా జరుగకపోవచ్చు. ప్రస్తుతం వ్యవహార విషయాలలో ఏ పనీ మీరు అనుకున్నంత సులభంగా జరుగదు. క్రొత్త మనుష్యులను నమ్మికుని చివరకు ఆందోళన పడవలసివస్తుంది. జాగ్రత్త. 7, 8, 9 లలో ఆదుర్దా, సంఘకార్యాలు, లాభం.

**ఈ వారము ధరలు**

బంగారు ఈ వారం తగ్గుదలలో ఉంటుంది. 11 పైగా కొద్దిగా పెరగవచ్చు.

వెండి ధరలలో పెద్ద మార్పులు రావు. పసుపు ధరలో ఆరంభంలో పెరుగుదల వచ్చి 10 నుంచి తగ్గుతుంది.

కందులకు గిరాకీ రాగల అవకాశాలున్నవి. శనగల ధరలో వారం చివర పెరుగుదలవస్తుంది మినుముల ధర కొద్దిగా తగ్గుతుంది ప్రత్తినూలుధరలు పెరుగుతవి.

నూవులనూనె ధర నిలకడలో ఉంటుంది. వేరుశనగపప్పు ధర పెరుగుతుంది. వేరుశనగనూనె ధర వారాంతంలో కొద్దిగా పెరుగుతుంది. కాని నిలకడ.



# మహిళాలోకం

## గృహాలంకరణం

"అబ్బా! యెంత బాగుందే వాళ్ల యిల్లు! విడిచిపెట్టి రాబుద్ధికాలేదు" అన్నది మా చెల్లెలు తిరిగి వస్తూనాతో! ... నిజంగా నాకూ అలానే అనిపించింది చెప్పొద్దూ!... ఆవేళ మా ఫ్రెండుని చూడడానికి నేనూ మా చెల్లి కలసి వాళ్ల యింటికి వెళ్లాము. వాళ్ళది చాలపెద్ద కుటుంబము. మా ఫ్రెండే రెండో కోడలు. మధ్య తరగతి కుటుంబము. గేటులో అడుగు పెట్టగానే సువాసనలు వెదజల్లుతూ ఆహ్వానించే తోట, ఆపైన చక్కగా అలంకరింపబడిన వాళ్ళయిల్లు, కలకల్లాడే ఆ యిల్లాలిని చూస్తే నిజంగా నాకా యిల్లు వదిలిరాబుద్ధికాలేదు. వాళ్ల యిల్లు ఏమంత పెద్దది కూడకాదు. అయినా ఎక్కడి వస్తువులు అక్కడ అమర్చబడి చాల నీటుగా ఉంది. ఆ యిల్లు, యిల్లాలిని చూస్తే యిల్లుచూసి యిల్లాలిని చూడు అన్న సామెత జ్ఞాపకానికి వచ్చింది.

స్త్రీకి గృహస్థ ధర్మాలలో గృహాలంకరణ ముఖ్యమైనది. పూర్వకాలమునుంచి గృహాలంకరణకు విశేషప్రాముఖ్యత ఉంది. బహుశః శుక్రవారము పండుగలు అంటూ పెట్టింది యిందుకేనేమో!... స్త్రీపురుషులను సన్నిహితులను చేసి ఒక బంధన మేర్పరచునదే వివాహము. ఆ సాన్నిహిత్యము మరింత దృఢముగచేసి వారి జీవితము స్వర్గతుల్యము చేయునదే గృహము. వివాహములో గృహప్రవేశము కూడ ఒక అంశముగనే యున్నదిగా!.. మానవుని ఆకర్షించునదే అందము. ఆ అందాన్ని ద్విగుణీకృతము చేయుటకే యీ గృహాలంకరణ. శుచి, శుభ్రములేని గృహమున సుఖ సౌఖ్యములు ఉండవు మధ్య తరగతి గుమాస్తాయే ఉన్నాడనుకోండి. అతను పగలల్లా ఆఫీసులో పనితో నుస్తీపడి సాయంకాలము యింటికి చేరేసరికి, యింట్లో అన్నీ చిందర వందరగ ఎక్కడి సామాను అక్కడే పడేసి పక్కవాళ్ల యింట్లోకూర్చుని కబుర్లు చెబ్తూన్న ఆ యిల్లాలిని చూస్తే అతని మనస్సెంత బాధపడుతుంది!...మానవ వికాసమునకు గృహము, దాని అలంకరణము ఆటపట్టులని నా అభిప్రాయము.

ప్రతిగృహమునకు ముఖ్యముగా కావలిసినది వెలుగు, గాలి. కాబట్టి మనము గృహనిర్మాణములోనే తగుశ్రద్ధ తీసికోవాలి. గాలి వెలుతురు లేని యిల్లు యెంత అలంకారం చేసినా అది నిరర్ధకము, నిష్ప్రయోజనము. రెండవది ఆ యిల్లాలి నేర్పు, ఓర్పులపై ఆధారపడి ఉంటుంది ఆ యింటి అలంకరణ. ఎంత చక్కని వసతిగల గృహముంటే మాత్రం ఏం లాభం?...అలంకరణ చేయటం రాని యిల్లాలుంటే అంతా దండగే! మూడ

శాంతిశ్రీ శ్రీమతి

వది గృహపరిసరముల ప్రకృతిననుసరించి కూడ గృహాలంకరణ ఆధారపడి యున్నది నాల్గవది ఆ యింట్లో మసలే మనుష్యులమీద ఆధారపడి ఉంటుంది. ఎంత ఓర్పు, ఎంత నేర్పుగల యిల్లాలుంటే యేం? చేసిన దాన్ని చేసినట్లే పాడుచేసే పిల్లలుంటే- యింట్లో పిల్లలగారాబము ఎక్కువైతే కూడ యిటువంటి సందర్భాలలో ప్రమాదమే!.. మనం ఏవస్తువుని యెక్కడఉంచితే అందంగా ఉంటుందోనని ఆలోచించి అమరిస్తే వెంటనే దాన్ని అక్కడినుంచి తీస్తేనే గాని ఊరుకోని పిల్లలుంటారు కొందరి యిళ్ళల్లో! అటువంటి వారిని చిన్నప్పటి నుంచి అగుపు చేయాలి.

* * *

గృహాలంకరణలో ముఖ్యమైనది యెక్కడి వస్తువులు అక్కడ పెట్టడం. ఇంగ్లీషులో ఒక సామెత ఉంది "ఎ ప్లేస్ ఫర్ ఎవెరిథింగ్ అండ్ ఎవెరిథింగ్ ఇన్ ఇట్స్ ప్లేస్" అంటే ప్రతివస్తువుకు ఒక నిర్ణీత స్థలము ఉంటుంది. ఆ వస్తువుని ఆ స్థలములోనే ఉంచటం అలవాటు చేసికోవాలి. అదీ ముఖ్యమయినది ..ఉదాహరణకు సబ్బుపెట్టె ఉందనుకోండి. దాన్ని నీళ్ళకొట్లోనే ఉంచితే బాగుంటుంది. అంతేగాని దాన్ని తీసికొచ్చి ఎక్కడయినా అలమరలో పెట్టామనుకోండి. మనకవసరమయే సమయానికి ఆ అలమరదగ్గర మగవాళ్లు ఏమయినా మాట్లాడుతూ కూర్చొనవచ్చు. దానివల్ల వాళ్ళని యిబ్బంది పెట్టాలి లేకపోతే వాళ్ళు వెళ్లిపోయేదాక మనం ఆగాలి. . . మాకు తెలిసిన ఒకావిడ ఉన్నారు. ఆవిడకు ఎనిమిదమంది సంతానము. వాళ్ళు ఉన్నది మూడే మూడు గదుల యిలు. అవేనా చిన్నవే. అయినా వాళ్ల యింట్లో సామాను ఒక్కటికూడ క్రింద గాని, చిందరవందరగా కాళ్ళకి వేళ్లకి అడ్డం పడటం గాని నాక్కనపడలేదు అలాంటే ఆట్టే సామాను లేదేమోనని అనుకోవచ్చును. అర్ధాంతరంగా అయిదుగురు కాఫీ ఫలహారాలకెళ్లినా, భోజనాలకు వెళ్లినా సరిపడే సామాను ఉంది. అయితే యెందులో ఉంది యిదంతా! ఆమె నేర్పు. అంతా ఎక్కడికక్కడ సర్దేస్తుంది ఆ యిల్లాలు. ఆమె పెట్టినట్లే ఉంచుతారు ఆ పిల్లలు. ప్రతి గృహానికి ఏడాదికి రెండుసార్లు అయినా సున్నము కొట్టించడము మంచిది లేకపోతే శుభ్రము మాటెలా ఉన్నా అనారోగ్యం ప్రబలుతుంది. ఇంక సున్నముకొట్టిన గోడలను శుభ్రముగా ఉంచుకోవటం యింట్లో వారిపై ఆధారపడి ఉంది. వాటిపై కాటుకలువ్రాయుటం, ఉమ్మి వేయటం, చీదడం వగైరాలతో వాటిని అపరిశుభ్రం చేయరాదు. నెలకు కనీసం రెండుసార్లయినా యిళ్ళు కడగవలెను. మట్టి ఇళ్ళు అయినచో మట్టి పేడలతో శుభ్రంగా అలకవలెను. ముగ్గుకూడ గృహాలంకరణకు ముఖ్యమయినవి. చక్కని ముగ్గులతో అలంకరింపబడిన యిల్లు చూస్తే మనస్సుకు ఆహ్లాదము, హాయి కలుగుతుంది. ఇకపోతే తలుపులకు, కిటికీలకు వార్నీషులు కాని, రంగులు కాని పూస్తే మంచిది. గుమ్మాలకు కూడ వార్నీషు రంగులతో అలంకరిస్తే అందంగా ఉంటుంది. అంత తాహతు లేనప్పుడు ప్రతి శుక్రవారం

శుభ్రంగా గుమ్మాలుకడిగిపసుపు రాసి కుంకుమ పెడ్తే మంచిది. ఈ అందాన్ని ద్విగుణీకృతం చేసేటందుకు యింటిముందు గాని, యింటి వెనకగాని చిన్న తోట పెంచితే బాగుంటుంది. దానికి శ్రద్ధ, నేర్పు, ఓర్పు కావాలి. అది ఆర్థికంగా కూడ చాల లాభాన్నిస్తుంది. ఈ పైన చెప్పిన వన్నీ ఉన్న గృహంలో శాంతి సౌఖ్యాలకు లోటు ఉండదు. అలాంటప్పుడు "గృహమే కదా స్వర్గసీమ" అనటములో తప్పేముంది?

* * *

ఉద్యోగరీత్యా అనండి, ప్రజల్లో నాగరికత పెరగటంవల్ల అనండి, ఏమైతేనేం పట్నాల్లో జనాభా నానాటికి పెరిగిపోతోంది. అలాంటి పట్నాల్లో యిల్లు కట్టుకోలేని మధ్యతరగతి కుటుంబీకులకు అద్దె యిళ్ళే ఆధారము, అవసరము. అద్దె యిళ్ళల్లో ఉన్నా వాటిని స్వంత ఇళ్ళనుకునే భావించి శ్రద్ధగా వాడుకొంటే బాగుంటుంది. కానీ కొంతమంది అలా చేయకపోవటంచేత యీనాడు యింటి యజమానులు అద్దెకున్న వారికి యింటిపై ఏలాంటి స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, యివ్వటం లేదు. మా అక్కకు తోటంటే చాలయిష్టం. ఒకసారి వాళ్ళు అద్దెకుంటున్న యింటిముందు కొత్తగా ప్రవేశించినమర్నాడు తవ్వి మొక్కలు పెడదామని బాగుచేయబోయిందిట. అంతే! దాంతో ఆ యింటి యజమానురాలు భద్రకాళీరూపం దాల్చి "తోటాలేదు గీటాలేదు.. కొంపంతా తవ్వి గోతులు పెట్టారా!... యిలా అయితే రేపే యిల్లు ఖాళీచేయాల్సి వస్తుంది. జాగ్రత్త!" అని అనేసరికి మా అక్క బ్రతుకు జీవుడా అంటూ యింట్లోకి వచ్చేసిందిట... ఆతర్వాత చిన్న చిన్న పూలకుండీలను తెప్పించుకొని సరదా తీర్చుకుంది.. ఇదీ తంతు!... ఇల్లు అద్దెకిస్తే స్వంతయిల్లు కాదుకదా దీన్ని యిలా నాశనం చేస్తే మనకేం అనుకునేరకం వారు ఉన్నారు. మా పెదనాన్న గారి యిల్లు అద్దెకిచ్చి ఆర్నెల్లయ్యాక వాళ్ళు ఖాళీచేసి వెళ్ళాక చూస్తే ఏముంది?... గోడలనిండా సిరామరకలు, కొటుకలు, గోడలనిండా మేకులు, గచ్చుపగలకొట్టడం, చూరునించి వెదురుబద్దలు తీసేయడం—చూస్తే చాల బాధ కల్గింది... ఇలా ఉంటుంది యింకోతరహావారి తత్వం!—

ఏది ఏమయినా, స్వంత యిల్లయినా అద్దె యిల్లయినా శ్రద్ధతీసికొని అలంకరించి జాగ్రత్తగ ఉంచితే బాగుంటుందని నా అభిప్రాయం. ప్రతిగృహిణీ నేర్చుకోవలసిన యీ గృహాలంకరణగూర్చి నేడు పాఠశాలల్లో (హోం సైన్సు) పేరిట కొంతవరకు బోధిస్తున్నారు. పాఠశాలల్లో నేగాక ప్రతితల్లి తనబిడ్డలకు యీ గృహాలంకరణ ప్రాముఖ్యతను చిన్నప్పటినుంచే నేర్పటం మంచిది. వంటా వార్పూ, గృహాలంకరణ చేతగాని విద్యావతులైన మన సోదరీమణు లెందరో ఉన్నారు. స్త్రీకి విద్య విజ్ఞానాభివృద్ధికే గాదు, గృహకృత్యాలలో కూడ తగు వికాసము చూపించిననాడే ఆమెవిద్య సార్థకమవుతుంది. కళలకు, అలంకరణకు మన భారతదేశం పుట్టినిల్లు. ప్రతిగృహిణి తన గృహాలంకరణయందు శ్రద్ధతీసికొన్నచో మన దేశము [illegible], [illegible] తెలియాడగలదు.

## సరళ సలహా!

తరచు బంధువుల ఇంటికి వెళ్ళడం, సంసార విషయాలు - అవీ యివీ తరచి కబుర్లు చెప్పుకోనడం - కోరి అవాంఛనీయ పరిస్థితులు కొనితెచ్చుకోనడమే. ఆప్యాయతకు అమృతంగా ఉంటే బంధువర్గం—వికలమైతే విషంగా మారుతుంది. ఒకానొక వ్యక్తిని గురించిన అభిప్రాయభేదమే వేరుపురుగౌతుంది. పాలలో ఉప్పుగాయి అవుతుంది.

అరుదుగా-అందులోనూ ఆనందకరమైన ఏ కొద్ది సన్నివేశాలలోనో ఈ సమావేశాలు జరగాలి. మితమైన సరసంతో సల్లాపం సాగాలి. అనవసర విషయాల ప్రస్తావన, అక్కడ లేనివ్యక్తిని గురించిన తర్క వితర్కం సుతరామూ పనికిరాదు.

భేదాభిప్రాయం ఉన్నా అది ముఖంమీద ప్రకటించకండి. [illegible]!

ఎప్పుడూఇంతే—61 శంకర్

ఏవమ్మా-బుగ్గమీద మొటిమ ఇంకా
తగ్గలేదూ-ఆయింటుమెంటూ, మాత్ర
లూ రాసిస్తాగానీ-వాడు-రేపటికి
కల్లా తగ్గిపోతుందిగా —ఏమ్మా



గోరుచుట్టే! అడెడెడెడే-ఎంతపని
జరిగిందీ-మరేం భయపడద్దు-
ఇదుగో ఈ పిల్సు పూటకొకటి
వేసుకోండి-రేపటికల్లా
ఘూమ్మని కారు తోలుదురుగాని.



ఆఁ ఆఁ ఆఁ-అద్దో-రాంపాం గింపాం
నేనలాంటి వెళ్ళగానే హౌస్ కాక్
అయిపోతుంది-రేపొద్దున్నే
ఇంకో ఇంజెక్షనిస్తా-మరేమీ
ఆదుర్దా పడకండి-



పొద్దున్నించీ తల బద్దలయిపో-
తోందండీ-వళ్ళు సెలాసలా కాగి
పోతోంది-ఒళ్ళంతా నొప్పులు



కొంత అమృతాంజనం రాసుకుని
కళ్ళు మూసుకు పడుకోగా
అదే తగ్గుతుంది



# పూరీతో స్వీటు

పూరీతో ఒకమంచి స్వీటు తయారుచేయవచ్చు. కానీ తీపి అవడం వల్ల ఎక్కువగా తినలేము. బాగా కారంగా ఉన్న టిఫెను ఏదైనా తిని వెంటనే ఇది నాలుగు చెంచాలు తింటే బాగుంటుంది ఇది ఎట్లా చెయ్యాలంటే, ముందర చిక్కటిపాలు బాగా మరగకాచెయ్యాలి. దాంట్లో పూరీకి-పాలకూ సరిపడ పంచదార ఉజ్జాయింపుగా చూసి వెయ్యాలి. అది ఒక ప్రక్కగాఉంచి, మామూలుగా పూరీలకు పిండికలిపి, అవి వత్తి ఎర్రగా వేయించాలి. అవి ఒక పళ్ళెంలోకి తీసి-చల్లారాక పొడుము అయ్యేలాగ చేతితో చిదపాలి. పూరీలన్నీ అట్లాగే పొడుం చేశాక, ఆ పొడుం, ద్రాక్ష, వేయించిన జీడిపప్పు, ఏలకుపొడి అన్నీ కలిపి ఈ మరిగిన పాలలో పోసెయ్యాలి ఇవిపాలు చల్లారాకగనక పొయ్యకపోతే, పాలు విరిగి పోతాయి అట్లా పోసిన తరువాత రెండు - మూడు గంటలు నాననివ్వాలి. పాలలో ఈపూరీ నాని పేస్టులాగ అయిపోతుందన్నమాట. చాలా బాగుంటుంది. ముఖ్యంగా పూరీ బాగా నానాలి. దాన్ని ముందర చూడగానే 'ఎంతకష్టపడిచేశారో!' అనుకుంటాం, కానీ చేసేవిధం తెలిశాక 'ఓస్! ఇంతేనా!' అని

నండూరి రాజ్యలక్ష్మి

పిస్తుంది. ఎక్కువగా తింటే మొఖం మొత్తుతుంది గూడా.

## పుల్లపకోడీలు

ఈ పుల్లపకోడీలగురించి చెప్పమంటే, మా మామయ్య మూడు గంటల ముప్ఫయి మూడు నిమిషాల మూడు సెకండ్లు అనర్గళంగా ఉపన్యాసం ఇచ్చి, చివరికి అటువంటి టిఫెను ఇలలో-కలలో గూడ లేదని తేల్చి పారేస్తాడు. అంత బ్రహ్మాండంగా ఉంటుందిట. ఇది గూడా చెయ్యడం పెద్ద కష్టం గాదు. శెనగపప్పు నానబోసి - వడేసి గట్టిగా రుబ్బెయ్యాలి. అందులో ఉల్లిపాయలూ, పచ్చిమెరపకాయలూ నూరి కలపాలి. అవి పకోడీలలాగ వేయించాలి. ఒక పెద్ద స్టీల్ గిన్నెలో చింతపండు పులుసు చిక్కగా పిసకాలి. అందులో ఉప్పు, కరివేపాకు వేసి, ఘాటుగా ఇంగువ తిరగమోత పెట్టాలి. ఆగిన్నె పొయ్యిదగ్గరగా ఉంచుకొని, ఈ పకోడీలు మూకుట్లోనుంచి తీసి, ఆపులుసులో పోసెయ్యాలి. అట్లాగే పకోడీలన్నీ వండటం-ఆ పులుసులో పొయ్యడం జరగాలి. పులుసు ఎక్కువా కాగూడదు-తక్కువా కాకూడదు. మనం వండే పకోడీలకు సరిపడా వుండాలి. ఒక అరగంటగనక నానితే పులుసంతా పకోడీలు పీల్చి మెత్తగా ఉంటాయి. తింటే పుల్లగా ఉంటాయి. అందుకే దానికి పుల్ల పకోడీలని పేరు. పులుసులో పకోడీలు వేడి-వేడివి వెయ్యాలి.

## అటుకుల ఉప్మా

బస్తీలలో అన్ని కాలాలలోనూ అటుకులు అమ్ముతుంటారు. శేరు ముప్పావలా లేక పధ్నాలుగణాలు పెడితే మంచివి దొరుకుతాయి. అవి తెచ్చి ఇంట్లో పెట్టుకుంటే, ఇంటికి హఠాత్తుగా ఏ ఫ్రెండ్సన్నా వస్తే చప్పున ఒక అయిదు నిమిషాల్లో టిఫెను తయారుచేసి పెట్టవచ్చు. చాలా తేలిక అన్నమాట. ముందర ఒక అరగ్లాసెడునీళ్ళు మరగనివ్వాలి. ఆ వేడి-వేడి నీళ్ళు దింపి, అటుకులు మరిన్ని పొయ్యాలి. అంటే అటుకులు తడిసేలా నీళ్ళుండాలి. అటుకులకు ఆనీళ్ళు మెత్తబడేలా సరిపోవాలి. తర్వాత మినప్పప్పు ఆవాలూ తిరగమోత వేయించి, కరివేపాకు, అల్లం, పచ్చిమెర్చిగూడా వేసి బాగా వేగనివ్వాలి. దాంట్లో ఈ అటుకులు గూడా వేసి, ఒక రెండు నిమిషాలు ఉంచి దించెయ్యాలి. ఒకటో రెండో నిమ్మకాయలు రసంపిండి, జల్లితే పొడ-పొడ లాడుతూ బాగుంటుంది.

## నాన్‌రొట్టెతో ఉప్మా

ఈ ఉప్మా గూడా అయిదు నిమిషాల్లో అయిపోతుంది. నాన్‌రొట్టెలో పెద్దవి తాజావి తెచ్చుకోవాలి. ఆరొట్టెని చాకుతో చిన్న-చిన్న ముక్కలుగా కోసెయ్యాలి. ఆముక్కల్ని మరింత చిన్నవిగా-పొడుంలాగ చిదిపెయ్యాలి. స్టీల్ గిన్నె ఒకటి కుంపటిమీదపెట్టి కొద్దిగా నెయ్యివేసి మినప్పప్పు, ఆవాలతో పోపు వేయించాలి. కరివేపాకు అల్లం-పచ్చిమెరప ముక్కలు అన్నీ వేసి ఎర్రగా వేయించి, ఈ పొడుం గూడా వేసెయ్యాలి. కొద్దిగా వేగనిచ్చి దింపి నిమ్మకాయరసం పిండాలి. ఇది అప్పటికప్పుడు తింటేనే బాగుంటుంది. ఒక సారి చేసి చూసి బాగుందో లేదో మీరు చెప్పండి. ★



రెండు టేబులుకు డిజైను

గొట్టిపాటి లీలావతి (అనంతపురం)

# వనితా వాణి



## ఎప్పుడూ వంటలేనా

ఆడవాళ్ళకూ-వంటయింటికీ అవినాభావ సంబంధం ప్రకృతి ప్రసిద్ధంగానే యేర్పడి ఉండవచ్చుగాక. కాని వనితాలోకం పేజీలలో కూడా ఎప్పుడూ వంటలూ - వార్పుల గురించి నింపివేయడం ఏం బాగుండడంలేదు.

సాంస్కృతిక, వైజ్ఞానిక, సారస్వతాది విషయాలు చాలా ఉన్నాయిగా వ్రాయటానికి! వాటిని గురించి వనితలు ఎందుకు వ్రాయకూడదు? ఎప్పుడూ నల్లులూ, మొటిమలూ, వంటలూ - యీ పరిధిలోనే మన ఆలోచనలు పరిమితం కాకూడదని నా ఉద్దేశ్యం. రాను రాను వనితాలోకం 'వంటల లోకం'గా మారిపోతూంది.

వనితాలోకంలోని రచనల స్థాయిని పెంచేట్లు వ్యాసాలు వ్రాయాలని రచయిత్రులకు నా సలహా!

చక్రవర్తి అరవిందబాల (అనంతపురం)

* * *

## స్త్రీలను విమర్శించరాదా?

23-11-60వ తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రిక వనితావాణి శీర్షికలో పోతరాజు విజయలక్ష్మిగారు "ఆడపెత్తనం, అఘాయిత్యం" అనే శీర్షికతో వచ్చినవ్యాసంపై ఒక వ్యాఖ్య చేశారు. వనితల విజ్ఞాన అభివృద్ధి నిర్వహింపబడుకోసంతున్న ఈ శీర్షిక చాలా పవిత్రమైనదని పైవ్యాసం చాలా అపవిత్రమైనదని ఒక్కమాటలో తీసి పారేశారు. "ఆడపెత్తనం అఘాయిత్యం"గా తయారవటం కేవలం అవాంఛనీయం.

ఈ మధ్య ఆంధ్రపత్రికలో ప్రకటింపబడిన ఉత్తమ వ్యాసాలలో యిది ఒకటేమో! ప్రతివారు పురుషులను తూలనాడుతూ రాసినారేగాని స్త్రీలలోని లోటుపాట్లను తెలియచేయలేదు. ఇకమీదనైనా కేవలము వనితలను పొగడుతూవచ్చే రచనలను కాక ఇలాంటి వ్యాసాలను ప్రకటించి స్త్రీల విజ్ఞానానికి వనితాలోకం శీర్షిక దోహదము కాగలదని తలుస్తాను.

తిక్కవరపు సుహాసిని (నెల్లూరు)

* * *

## సీతమ్మ కథ - నా కథ

16-11-60 వార పత్రిలో వేదవతీదేవిగారు వ్రాసిన "సీతమ్మ కథ-నా కథ" అన్న వ్యాసము చాల బాగున్నది. మొన్నీ మధ్య మా అన్నయ్యగారి వివాహము జరిగింది. వాకిట్లో పేరు చెప్పించటములో ఆడపడుచు గడుసుదనము చూపుదామనుకున్నాను కాని ఏదో పని తగిలి ఆ సమయానికి అక్కడ ఉండలేకపోయాను. వేదవతిగారు వ్రాసిన వ్యాసము చదువుతుంటే, జారిపోయిన నా పదవకాశము గుర్తుకొచ్చి విచారించాను. భర్త పేరు చెప్పేటప్పుడు భార్యలు పడే సిగ్గు చూడవలసినదేగాని వర్ణించలేము. ఎంత చదువుకున్నా భర్తని పేరుపెట్టి పిలుస్తూవుంటే ఆ ధ్వనిలో ఏదో వెలితి కనపడుతుంది. ఇంత చక్కటి వ్యాసాన్ని పాఠకులకు అందచేసి, ఆనందింపచేసిన వేదవతీదేవిగారికి నా అభివందనములు తెలుపుచున్నాను.

ఎ. కె. సక్కుబాయి (గుంటూరు)

* * *

16-11-60 పత్రికలో ఒక సోదరి ముఖము మీది వెంట్రుకలు పోవుటకు ఏదైనా ఉపాయము అడిగారు. నాకు తెలిసిన చికిత్స చెబుతున్నాను.

చిటుడుకు బియ్యములో (సగము ఉడికి ఉడకని బియ్యము) ఉప్పు, పసుపు తగినంత కలిపి, మెత్తగా నూరి వెంట్రుకలు ఉన్న చోట బాగా పూయవలెను. కొంతసేపటి తరువాత వెంట్రుకలన్నీ ఉండలుగా చుట్టుకొని రాలిపోవును. ఇట్లు ఒకటి, రెండు రోజులు చేసిన మరల రాకుండాపోవును.

చామల పుష్పమాల (ముప్పవరం)

ప్రఫుల్లకుమారిగారు 23-11-60 తేది వార పత్రికలో వ్రాసిన 'బ్రెడ్ పుడ్డింగ్' చేయు విధానము చదివి, చేసితిమి కాని ప్రఫుల్లకుమారిగారు పుడ్డింగ్ చేయువిధానము వివరముగా వ్రాయలేదు. గ్రుడ్లు, చక్కెర కావలసిన సామానులజాబితాలోయిచ్చిఅవి ఎప్పుడు ఉపయోగించవలసినదీ చెప్పలేదు. కాని మాకు తోచిన విధముగా చేసితిమి. బాగా వచ్చినది.

ప్రఫుల్ల కుమారికి మా అభివందనములు మీ (మా) పత్రికద్వారా తెలియచేయుచున్నాము.

ఇందిరారెడ్డి నిర్మలారెడ్డి (కర్నూలు)

* * *

## సరళ సలహా

'అగువు-పరువు' పైన సరళగారు ఇచ్చిన సలహా ఏమంత సమంజసముగాలేదు అగువు తీసికొన్న పరువుపోయిన రోజుల లోకములో ఒకరి కొకరి సహాయమవుసరముండదు.

సాధారణముగా మధ్యతరగతి కుటుంబీకులలో అనేక క్లిష్ట పరిస్థితు లేర్పడుతుంటాయి. అట్టి సమయములందు అరువు పుచ్చుకొనకయుండరు. అంతమాత్రమున పరువుపోదు. అరువు పుచ్చుకొనుటలోకూడ హద్దుమీరకయుండిన చాలు. అంతేగాని బొత్తిగా అరువు తీసికొనక ఉండలేరు సామాన్య కుటుంబీకులు. అందుచేత 'సరళగారిసలహా' ఏ 'గజెటెడ్-ఆఫీసర్ల' భార్యలకో అనువుగా వుంటుంది. ఇకమీదనైనా చక్కని సలహాల నిస్తారని ఆశిస్తున్నాము.

ఎ. ఎస్. పద్మావతి (పలమనేరు)

* * *

శ్రీమతి డి. విశాలాక్షీరావుగారూ, మీరు ఇచ్చిన చిటిపాపలకు ఊలుడ్రెస్సులలో మేజోళ్ళు, టోపీ, మిట్టెను, అల్లి చూచితిని. చాలా చక్కగా కుదిరినవి. మీకు నా అభివందనములు తెలుపుచున్నాను.

23-11-60వ తేదీ ఆంధ్రపత్రికలో శ్రీమతి సత్యనారాయణగారు వ్రాసిన విధంగా నేనకూడా అన్నిభాగములూ అల్లి ఈ సందేహమే వచ్చుటవల్ల నాకుకూడా సగములో అల్లిక ఆగిపోయినది. అంతా మొత్తము పుల్లపైన 249 కుట్లుఉన్నవి. 198 కుట్లు ఏ విధముగా అల్లుతే వచ్చునో దయచేసి వనితావాణిద్వారా త్వరలో తెలియచేస్తారని ఆశిస్తున్నాను.

బి. లక్ష్మి (రూర్కేలా-2)

* * *

దయచేసి సోదరీమణు లెవరైనా ఊలుతో బేగ్ అల్లడం వనితావాణిద్వారా తెల్పెదరని ఆసిస్తాను

మేడేటి రత్నాబాయి (ధవళేశ్వరం)

# హరి వంశము

## మధురాపర్వము — 11

చూపరకోర్కె నింద రిపు
శూరతకుం జనువిచ్చి కొంతసే
పాపగిదిన్ భుజాసమర
మచ్చెరువారగ నిర్వహించి యా
గోప భటు డొకింత యెద
గోపము గైకొని వైరిసత్త్వ వి
ద్యాపటురూఢి యెంతయును
దక్కువగా నొనరించె బ్రేల్మిడిన్.

— హరివంశము.

యశోద రోహిణీదేవితో అన్నది: తల్లీ! మీరైనా చెప్పరాదా! ఈ రాక్షసులతో తండ్రులకు యుద్ధం ఏమిటి? తల్లీ ఆ రాక్షసులు తండ్రులను బ్రతకనిస్తారా! అయ్యో! నా జీవితం మొదటినుంచీ ఇట్లానే వుంది. ఎప్పుడూ తండ్రులకు ఇటువంటి ఆపదలు రాలేదు. అడవులలో సరే. తల్లీ! ఇది నగరం ఇక్కడగూడా అంతేనా?

రోహిణి యశోదను అనునయింప జూచింది. "యశోదా! వీరు తండ్రులను ఏమి చేయగలరే! పూర్వం మన రేపల్లెకు, బృందావనానికి వచ్చిన రాక్షసులకంటే వీరు హీన మిగిలినవారంటావా! నీ భయం గాని, తండ్రులకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదు" అన్నది.

అది ఆమె ధైర్యము. ఆమెకు రామకృష్ణుల సత్తువ తెలుసును. యశోద అట్టిది కాదు. ఆమె దేవకితో అన్నది: తల్లీ! విన్నావుగదా? రోహిణీ తల్లి మాటలు. ఆమె ఎప్పుడూ ఇంతే. మీరు చెప్పరాదా! ఈ యుద్ధం, తల్లీ! అసమయుద్ధం. మన తండ్రులు వట్టి పసివాళ్లు. వాళ్లు, ఆ మల్లులు రాక్షసులు. తల్లీ! ఈ పోరాటం ఏమిటి? నేను చూడలేకుండా వున్నాను. నేను ఏమి పాపం చేసుకున్నాను. తల్లీ! మీరు ఎవ్వరూ మాట్లాడటం లేదు. నేను పాలు ఇచ్చి తండ్రిని పెంచాను. ముద్దులు చూచుకున్నాను. ఈనాటితో అవి అన్నీ సరా! భగవంతుడా! నన్ను ఏమి చేస్తున్నావు. తల్లీ! దేవకీదేవి! నువ్వు మహానుభావురాలివి. నువ్వు చెబితే ఇక్కడ అంతా వింటారు. తల్లీ! ఈ మల్లసంగరాన్ని ఆపించండి. తండ్రులతో తిరిగి మేము అడవులకు పోతాము."

ఆ మాటలు వినగానే దేవకికి దుఃఖము పొర్లుకువచ్చింది. రంగంలో మల్లసంగరం ఘోరంగా సాగుతున్నది. రోషాగ్ని ధూమ ప్రరోహాన్ని పోలి, తలపైన సన్నిని శిఖ వెలుగగా, దిక్కరీంద్రహస్త సన్నిభములైన బాహుదండములు భయంకరంగా ఆస్ఫాలిస్తూ చాణూరుడు శ్రీకృష్ణదేవునిపైకి విజృంభణం చూపిస్తున్నాడు. ముష్టికుడు సంకర్షణదేవునిమీదకు దూకుతున్నాడు. ఆ ఇద్దరి మీసములు లయ సమయాంతకోల్లసిత వంష్ట్రిలను పోలి మెరుస్తున్నాయి. నల్లనినడ కొండలమాదిరి అభీలమైన నీలదేహాలతో వారు మల్లరంగంలో రామకృష్ణులను సరకుగొనక సంచరిస్తున్నారు. వారు కదులుతూవుంటే తచ్చరణహతిచేత ధరణీతలం గ్రక్కదలుతోంది. వాళ్లు మల్లచరస్తూ వుంటే, ఆ ధ్వనితో నభోమండలం నిండిపోతోంది. పౌరలోకానికి వారి మల్లాహవక్రీడ హృదయభల్లంగా పరిణమిస్తున్నది. దేవకి అనుకున్నది: వేచివేచి బిడ్డలను ఏమి దశలో చూస్తున్నాను. పుట్టిన నాడు బిడ్డను ఏమి చూచుకున్నానో-అంతేగాని మరల ఇప్పుడు చూచుకున్నాను. ఇది ఏమి చూచుకోనడం. ఇక్కడ నామాట ఎవరు వింటారు. ఇంతటి సమాజంలో నేను ఏమి మాట్లాడతాను? ఏమి చేస్తాను? భగవంతుడు నా ముఖమున దుఃఖం వ్రాసిపెట్టాడు. ఎంతమంది బిడ్డలను నేను ఈ కంసునికత్తికి ఆహుతిచేయలేదు. అందుకు నాకు ఈ శిక్షను భగవంతుడు విధించాడు. ఇట్లా ఈ అసమమల్లాహవంలో నా బిడ్డల చావును చూడమని వ్రాసినాడు." మనస్సులో ఇట్టి భావములు మెదలాడగా, ఆమె కన్నులవెంట నిరంతభాష్పధురులు ఉద్బుద్ధం అవుతున్నాయి యశోదస్థితియు నట్లుగా వున్నది. రోహిణి ఒక త్రుటిక ధైర్యాన్ని వహించి కూర్చున్నది. కంసుని మాత దేవకిని ఒడిలోనికి తీసుకొని, "తల్లీ! తల్లీ! అదియేమి! నీవు క్షత్రియవు. ఇప్పుడు శుభంగా వుండవలసిందిపోయి, ఈ అధైర్యమేమి?" అంటూ సమాశ్వాసిస్తున్నది. తక్కిన నాగరస్త్రీలు ఆ తల్లుల దుఃఖాన్ని పంచుకుంటున్నారు. వారిలోవారు ఇట్లా అనుకుంటున్నారు "బాలురకు బాలురకు, వృద్ధులకు వృద్ధులకు, మధ్యవయస్కులకు మధ్యవయస్కులకు, బలులకు బలులకు మల్లయుద్ధాన్ని పొసగించడం ధర్మంగాని ఇది ఏమి ధర్మం. ఇది పరమ అసమంగావుంది. పాపంగా ఉంది. దీన్ని దర్శించడానికేనా, మధురేశ్వరుడు అందరిని తనఆజ్ఞగా పిలిపించినాడు. ఇట్టిపాపాన్ని ఎన్నడూ ఎరుగము. ఈ పాపం యొక్క ఫలితాన్ని నేడు మధురేశ్వరుడు అనభవించక తప్పదు."అని అప్పటి నాగరస్త్రీలు అనుకున్నంతలో కంసుని తల్లి విచిత్రంగా నవ్వింది. దేవకిని చూచి, రోహిణిని చూచి, యశోదను చూచి ఇట్లా అన్నది: "బిడ్డలు! మీరు నాగరకాంతల ఆ మాటలు విన్నారు గదా! భగవంతుడు వారి నోట అట్లా అనిపిస్తున్నాడు. కంసుడు తన ఈ పాపానికి ఇవ్వాళ్లే ఫలితాన్ని అనుభవిస్తాడు. అది పాపమో, పుణ్యమో! దేవకీ! ఇది నా శాపమమ్మా! నా శాపము. నేను ఏమని, నీతో, దేవతోపమతో, నా జీవితకళంకాన్ని గూర్చి చెప్పుకోను! నా అనుంగు బిడ్డా! నేను, ఈ కంసుణ్ణి, పుట్టుకకు పూర్వమే శపించానమ్మా! నా వంశంలో, నా కూతుల కడుపున, మేటి బలవంతుడు పుట్టి, నా యీ పుట్టని బిడ్డను, కంసుణ్ణి చంపివేస్తాడని, అంతర్వత్ని నైయున్న కాలంలో శపించానమ్మా! తల్లీ! దేవకి! ఆ మేటి బలవంతుణ్ణి నీవు కన్నావు. నీ బిడ్డ కంసహంత! తల్లీ! నీ బిడ్డ కంసహంత!" ఇక ఆమె మాట్లాడ లేకపోయింది. ఆమె కంఠం రుద్ధం అయిపోయింది. దేవకి ఆమెవంక విచిత్రంగా చూచింది. రోహిణి విచిత్రంగా చూచింది. యశోద విచిత్రంగా చూచింది. చూచి "తల్లీ! తండ్రులు ఈ రాక్షసులను

హరిత శివశర్మ

పిలుకుమార్చివేస్తారంటారా!" అన్నది. కంసమాత విచిత్ర మంద హాసం చేస్తూ "యశోద! నీవు వట్టి అమాయకురాలవు. ఈ ఇద్దరి రక్షకులనే కాదు. లోకంలో అందరు రాక్షసులను ఈ నా మనుమండ్రు పిలుకుమారుస్తారు. పిలుకు మారుస్తారు. అందులో నా బిడ్డ కంసుడు గూడా ఒక్కడు! కంసుడు గూడా ఒక్కడు" అని, కంసుని దిక్కు చూచి, తన జీవితంలో ఒకప్పుడు జరిగిన కళంకచరిత్ర కన్నులముంగు ఆడినట్లయి, రెండు చేతులతో ఆ కన్నులను మూసికొని, దేవకి ఒడిలో వ్రాలిపోయింది.

అంతలో ఆకాశంలో దేవతూర్యములు మ్రోగాయి. తిరిగి అంతర్ధానగతులైన దేవతలు, ఋషులు భగవంతుణ్ణి హెచ్చరించారు. 'జయస్వ కృష్ణ చాణూరం, దానవం మల్లరూపిణం' అంటూ వారు హెచ్చరికలు చేశారు. "భగవన్! ఈ చాణూరుడు, ఈ ముష్టికుడు రాక్షసులు. తారకామయ సమయంలో ఈ రాక్షసులు నీతో పోరు సాగించి వున్నారు. వీరిలో ఒకడు వరాహుడు. రెండవవాడు కిశోరుడు. వీరిద్దరు మహాబలులు. నీమీద పగపెట్టుకుని ఇప్పుడు ఇట్లా చాణూర ముష్టికులై జన్మించారు. వీరు సామాన్యులైన మల్లులు కారు. భగవన్! నువ్వు వీరిని సంహరించాలి. జయగోవింద చాణూరం, జహి కేశవ దానవం" అంటూ దేవతలు, ఋషులు భగవంతుణ్ణి ప్రార్థించారు. ఆ ప్రార్థనలు, ఆ హెచ్చరికలు భగవంతుని చెవులకు సోకినాయా? ఆయన ఆ ప్రార్థనలు, ఆ హెచ్చరికలు విన్నాడా? ఏమో! క్రింద రంగంలో పోరు ఘోరంగా సాగుతున్నది. శ్రీ కృష్ణ చాణూరులు ఉన్నతవిషమములైన శాణలిడి, కరికరి, హరిహరి, గిరిగిరి, ఒండొంటిని తాకినట్లు అతి రౌద్రంగా మల్లాహవం సాగిస్తున్నారు. అశ్రస్త్రము, అతిఘోరము, యుద్ధం దారుణంగా సాగుతున్నది. బలరామ ముష్టికుల నియుద్ధం అంతకన్నా ఘోరంగా సాగుతున్నది. మల్లతూర్యాలు, దుందుభులు భోరన మ్రోస్తున్నాయి. కంసుడు విజయం తనపక్షమే అయినట్లు సంతోషిస్తున్నాడు. మంత్రులతో ఉల్లాసంగా మాట్లాడుతున్నాడు. ఓరగా వసుదేవాది యాదవగణప్రవరులవంక చూస్తున్నాడు. మల్లరంగంలో దావానలం రేగినట్లు, మేఘములు తలపడినట్లు అన్యోన్యతుంగతరంగతాడితములయిన కల్పాంతకాలసముద్రములు రౌద్రంతో ఎదురొన్నట్లు, శ్రీకృష్ణచాణూరులు, బలరామముష్టికులు పోరు సాగిస్తున్నారు. చాణూరముష్టికులు చిరాభ్యస్తవిద్యులు. మరి రామకృష్ణులో అనభ్యస్తులు. అయినా వారు సకల విజ్ఞాననిధులు అవడంచేత, మల్ల యుద్ధంలో విచిత్ర మార్గాంతరాలను ప్రదర్శిస్తూ, మల్లులయొక్కయే గాక, సకల సామాజికజనంయొక్క ప్రశంసలను అందుకుంటున్నారు. తిరుచుట, త్రోచుట, క్రుంగుట, రొమ్ముగయుట, ఎత్తుట, మెలగి నిలుచుట మొదలైన అన్ని ప్రక్రియలలోను సరికిసరిగా వారి పోరాటం సాగుతోంది. మూపులు ఒకటి ఒకటి త్రాకుతూ వుంటే పుట్టిన ధ్వనులచేత, తల, తలసంఘటిస్తున్న సందర్భవశమున పుట్టిన ఉలివుచేత, పటుముష్టిపాతనిర్భరధ్వనులచేత ఆకాశం వజ్రనిర్ఘోషానుకారియై, శబ్దమయాత్మకం అయి పెంపుపోతున్నది. అరచేతులతో, పెడకేలులతో చరుచుకొనుట, కూర్పరకశోరజానునిహాతులతో పరచుట, తరిమి మెడలంటపట్టుట, దంతములచేత, నఖములచేత, ఒండొరులు కరచుకొనుట, పీకుకొనుట, కడకచూపి కనలుట, తొడకాళ్ల నడచిత్రోచుట, మొదలైన మల్లప్రక్రియలన్నీ ప్రదర్శితం అవుతున్నాయి.

ఒకసారి వారు కనిష్ఠాంగుళి వ్యతిరేకంగా అరత్నిముష్టినిపట్టి, ఒకరిని ఒకరు పొడుచుకుంటున్నారు. ఒకసారి చేతులకు చేతులనుఅంది ఇచ్చుకుంటూ, ఒకరికి ఒకరు అందక వారు పరితశ్చాలన మర్యాదంగా పరిభ్రామణ ప్రక్రియలను అనుసరిస్తున్నారు ఒకసారి విక్షేప మర్యాదలను ప్రదర్శిస్తున్నారు అంతలో ఒకరిని ఒకరు బాహువులు బాహువులలో బంధించి పరిరంభణ విశేషాలచేత నిష్పీడించుకుంటున్నారు. అంతలో విడిపడి, అవపాతన చంక్రమణవిశేషాలతో రంగధాత్రిని నూర్పిడిచేస్తున్నారు. అంతలో ఒకరికి ఒకరు ఎదురు బళ్లుగా నడిచి ఉత్సర్పణక్రీడ సల్పుతున్నారు. అంతలో తెలిసి అపసర్పణం చేస్తున్నారు. తిరిగి ఒకరిని ఒకరు దరిసి, విజిగీషతో ప్రత్యావృతవంతులవుతున్నారు. పోరు అసమంగా సాగుతున్నది. చాణూరముష్టికులు శైలనిభులు. రామకృష్ణులు బాలకులు. వీరి ఈ బాహాయుద్ధం అసదృశోహలగావున్నది గాని, సమయుద్ధంగా లేదు. యాదవగణక్షత్రియులకు ఇది పరమ అధర్మంగా తోచింది కాని వారిలో ఎవ్వరు ధైర్యంచేసి ఇది అన్యాయం అని చెప్పలేకపోయినారు. ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. సుదేవుడు, పరమనిర్లిప్తుడు. తాను ఏమియు మాట్లాడడు. యాదవగణసంరక్షణం అతని ఆశయం కాదా? అది తప్పమాట. భోజాంధకవృష్ణిగణాలలో కంసుడు, భోజుడు, బలవంతుడుకాగా, వసుదేవుడు కాలమహత్వాన్ని గమనించి యాదవగణసంరక్షణార్థం తన పుట్టిన శిశువులను శిశువులట్లు కంసుని ఖడ్గానికి బలిపెట్టినాడు. ఇది లోకాద్భుతమైన త్యాగము. అతిలోకమైన ధైర్యము. కాని ఆయన నిర్లిప్తుడు. ఏమియు మాట్లాడడు. అప్పుడు యాదవులు అంధకుని [illegible]నారు. అతడే ధైర్యం చేయగలవాడు. అంధకుడు యాదవప్రవరుల కన్నులలో దైన్యాన్ని గమనించి, తన కన్నులతో వారిని అనునయించి, తన స్థానంలో తిరిగి నిలబడినాడు. నిలబడి "కంస!" అని సంబోధించినాడు "తాత! కంస! ఒక్క అభిప్రార్థనం. నీవు విన్పించుకోవాలి" అన్నాడు. కంసుడు చెసన్నచే మల్లతూర్యములను వారించినాడు. ఆ ధ్వనులు ఆగినవి. నియుద్ధమును ఆగినది. చాణూరముష్టికమల్లురకు ఇది ఆశ్చర్యమైనది కన్నులలో ప్రశ్నగా రామకృష్ణులు గూడ అంధకుణ్ణి ఆలోకించినారు. అంధకుడు కంసునకు ఇట్లా విన్నవించుకున్నాడు: తాత! కంస! నువ్వు వీరుడివి. ఇట్టి అసమమైన నియుద్ధాన్ని ఎట్లా సహిస్తున్నావో తెలియకుండా వుంది. ఇందువల్ల నీ కోరిక నెరవేరుతుందేమో అనుకుంటున్నావు వలె వుంది. నాకు నమ్మకం లేదు. కాని ధర్మాన్ని ఎంచి చెబుతున్నాను. మల్లు పెనగుతున్నవారికి కాలజ్ఞులయిన కులజులు సహాయులు చుట్టనుండి సలిలసేచనాద్యుపచారములు చేస్తూవుండాలి. పరిశ్రమాపనయం పొనరుస్తూ వుండాలి. అంతేకాక బలానికి, క్రియకు అంతరం నిరూపించాలి తగి ఎతిగి నిలుపుతూ వుండాలి. ఇది వేడుక



'నాన్నా నాక్కూడా గోలుసుంది'
చిత్రకారుడు: ఎ. రాధాకృష్ణమూర్తి (గుంటూరు)

(61-వ పేజీ చూడండి)

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మరియు ఫేస్ పౌడరు వాడి అందాల భరిణగా కనపడండి

మొదట, తేలికైన మరియు మంచువలె మన్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును రాసుకోండి. అది మీ సున్నితమైన ముఖ చర్మమునకు రక్షణనిచ్చి దానిని మృదువుగా, మనోహరముగా ఉండేలా ఉంచుతుంది. జిడ్డులేని యీ క్రీము ముఖముమీద చిన్నచిన్న కళంకములను కనపడకుండా ఉంచుతుంది మరియు పౌడరును అంటుకొని ఉండేలా చేస్తుంది।

తరువాత, మెత్తని పాండ్స్ ఫేస్ పౌడరును తేలికగా పైపైన అద్దుకోండి. అది మీ ముఖముయొక్క రంగులో కలిసిపోతుంది మరియు దానికి శోభను చేకూరుస్తుంది!

ప్రతి సారి పైవిధముగా చెస్తే మీరు గంటలతరబడి అందముగా కనబడతారు!

ప్రపంచమంతటా సౌందర్యవతులు వీటినే ఎన్నుకొంటారు




JWT. P. 72

చీస్‌బ్రొ-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో సంస్థాపించబడినది)

# పందెం గెలుపు

ఒక ఊళ్లో ఒకతాత, అవ్వ ఉంటూ ఉండేవారు! తాత మాత్రం పాపం ఉత్త తెలివితక్కువవాడు! ప్రతిరోజు కూడా ఏవో తెలివి తక్కువ పనులు చేస్తూనే ఉండేవాడు! ఊళ్లోవాళ్లు చాలామంది తాతని చూచి చికాకు పడేవారు! కాని పాపం! అవ్వ మాత్రం తాత ఎలాటి పని చెయ్యనీయండి! చికాకు పడేదికాదు! సరికదా ఆపనే ఎంతో బాగుందని తాతని తెగపొగిడేది! ఇంక మరేముంది? తాతకి దాంతో మరికొంచం చలాకీతనం హెచ్చయి మరికొంచం హెచ్చుగానే చేస్తూ ఉండేవాడు తెలివితక్కువ పన్లు! ఇంక వినండి! ఒకనాడు తాత రోజూకంటె కొంచం పెందలకడే లేచి అవ్వనికూడా లేపాడు. తాత పళ్లుతోముకుని వేగంవచ్చి కూర్చున్నాడు మంచంమీద. అవ్వ పెరట్లో తనపన్లు చేసుకొంటోంది. అవ్వ దగ్గరకి హడావుడిగా తాత వచ్చాడు. అవ్వ ఏమిటి చెప్పమన్నట్లు చూసింది తాతవేపు! తాత చెప్పాడు! 'చూశావూ, ఇవాళ నాకొక పని చేద్దామని ఉంది' అన్నాడు. వెంటనే అవ్వ 'ఏ పని? మీరేపని చేసినా మంచిదే చేస్తారు; ఇంతకీ ఆ పనేమిటో చెప్పలేదు.' అంది. తాతకి అప్పుడే సంతోషం పొంగుకొచ్చింది! 'మనింట్లో అన్నీ అమ్మగా ఒకగుఱ్ఱం మిగిలింది కాదూ? ఆ తెల్ల గుఱ్ఱాన్నివాళ సంతకితోలి అమ్మదామనుకొంటున్నాను! 100 రూపాయలు వస్తాయి అమ్మితే! మనకి క్రిస్టమస్ వస్తోంది కదూ? పండక్కి డబ్బు కావద్దూ?' అన్నాడు తాత. అవ్వ ముఖం విప్పారింది! 'అంతకంటే నాక్కావలసిందేమిటి? ఆ నూర్రూపాయలతో పండుగ ఎంచక్కా గడిచిపోతుంది. అయినా నాకింత చక్కటి ఆలోచన తట్టలేదుసుమండీ! అయినా మీరెప్పుడూ ఇలాటి మంచిపన్లే చేస్తూంటారు! కాస్సీ ఎండెక్కితే వెళ్లడం కష్టం కదూ! 4, 5 మైళ్లు నడవాలిగా?

పి. సరస్వతీదేవి

కొంచెం వేగంగా వంట చేస్తాను. ఇంత పెరుగు అన్నంతిని వెళ్లండి! అని అవ్వ వంటింట్లోకి వెళ్లింది. 9 గంటలకల్లా వండి తాతకి పెట్టింది. గుఱ్ఱానికి ఉలవలుడికించి పెట్టింది. తాతకి పొడుండబ్బీనిండా పొడుం పోసిఇచ్చింది! తాత బయలుదేరేడు గుఱ్ఱంతో.

తాత పాటలుపాడుకుంటూ హుషారుగా వెళ్తున్నాడు! ఒకఊరు సమీపానికి వచ్చాడు. ఎండ బాగా ఎక్కిందేమో తల వేడెక్కుతోంది! గబగబా వెళ్తున్నాడు తాత. ఒకడు ఒక ఆవుని తీసుకుని ఆసంతకే వెల్తున్నాడు. ఆవు కడుపుబరువుకిగాబోలు మెల్లగా అడుగులేస్తోంది! వాడు ఆవుని వేగం నడవడానికి అదలిస్తున్నాడు. ఆవు పాపం నడవలేక నడుస్తోంది. తాతకి ఆవునిచూస్తే జాలి ముంచుకొచ్చింది. ఆ అబ్బిని పిలిచాడు. 'అబ్బీ, ఆవుని సంతకేనా తోలుతున్నావ్? అమ్మతావా?' అనడిగాడు. 'ఔను బాబాయిగారూ! ఆవుని ఇవాళ అమ్మక తీరదు! మాకు డబ్బుకి చిన్న అవసరమొచ్చిందీయాల' అన్నాడు ఆ అబ్బి. తాత: 'అయితే, అదినడవలేక పోతూందికదా? నువ్వు దాన్ని ఎట్లా తోలుకెల్తావ్? నీకు తొందరకదా? పోస్సీ ఒకపని చేస్తావ్? నా గుఱ్ఱం వేగం నడుస్తుంది! దీనినితోలుకుపోయి అమ్మకో! నాకా ఆవు నిచ్చేయి! నేను దాన్ని తాపీగా తోలుకెళ్లి అమ్ముతాను' అన్నాడు. ఆ అబ్బి తాతని ఒకసారి బాగా చూశాడు. 'పిచ్చివాడు కాడు కద; గుఱ్ఱాన్నిస్తానంటాడేమిటి? పోనీనాకేమంచిదికదా!' అనుకుని సరేనన్నాడు! తాత గుఱ్ఱం కళ్లెం ఆఅబ్బికిచ్చి ఆవుకన్ని పుచ్చుకున్నాడు. తాత మళ్లీ పాటలుపాడుకుంటూ పోతున్నాడు. కొంతదూరం పోయేసరికి పెద్దగుంపుగా జనం కన



# బూడిదలో పన్నీరు

## శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

ప్రాతఃకాలమున లేచి
శీతలజలమందు మునిగి
ధౌతవస్త్రముల ధరించి
యేతెంచుచు నుండె నొకడు.

మున్ను రుజాపీడితుడై
యున్నప్పుడు మ్రొక్కుకొనియె
సన్నుతించి భగవంతుని
కెన్నో పాలర్పింపగ.

ఒకచేతను పూలసజ్జ
ఒకచేతను క్షీరపాత్ర
అకలంకమ్మగు భక్తిని
చకచక గుడిదరికి సాగ.

అతనియెదుట దయనీయ
స్థితిలో నొక బిచ్చగాడు
మెతుకులుతిని యెన్నాళ్లో
గతియించిన భంగి పలికె.

"ఆకలితో నా ప్రాణము
లేకముగును గాలిలోన
నీ కెంతో పుణ్యమ్మగు
నా కొసగు మెకిన్ని పాలు."

"మ్రొక్కుబడిని చెల్లింపక
ఒక్కచుక్క నీకిచ్చిన
అక్కట నా అపరాధము
ఎక్కరణి క్షమింపబడునో!"

అని దీనుని లెక్కింపక
తన మ్రొక్కును తీర్చుకొనగ
జని సాగిలబడి పూజల
నొనరించెను భక్తితోడ.

పాలు నివేదించుటకై
కేలనున్న పాత్రదీయ
పాలు మాయమయ్యె, ఇంద్ర
జాల మెవరు గావించిరో!

తోడిమానవుని బాధను
చూడలేని దైవభక్తి
బూడిదలో పన్నీరని
పాడె నతని అంతరాత్మ.

# పందెం గెలుపు

బడ్డారు ఒకచోట! దగ్గర కెళ్లి చూశాడు తాత. అక్కడ గొర్రెపోతుల పందాలవుతున్నాయ్! రెండు పక్షాలవాళ్లూ తమతమ గొర్రెల్ని హెచ్చరిస్తూ కేకలు పెడ్తున్నారు. చప్పట్లుకొడ్తున్నారు. తాతకికొంచం సేపు చూడాలనిపించింది. అక్కడే ఒక చెట్టుకి ఆవునికట్టి తనుకూడా వచ్చి వారితో పాటు ఉత్సాహంగా చప్పట్లు కొడుతున్నాడు! రెండు గొర్రెపోతులకీ రక్తాలు చిమ్ము తున్నాయి. ఉన్నట్లుండి ఒక గొర్రెపోతు వెనక్కిపరుగెత్తింది. వెంటనే రెండోగొర్రెపోతుకి పూలదండవేసి తిలకం కుంకుమ పెట్టి చప్పట్లు కొట్టారు! తాతకి ఆ గొర్రెపోతుని చూస్తూంటే చాలాసరదా వేస్తోంది. ఆవుని ఒకసారి చూచాడు. పాపం మందంగా నిలబడివుంది! గొర్రెపోతుని చూశాడు. అదింకా హుషారుగానే తలాడిస్తోంది! అంతే! ఆ గొర్రె గల వాడ్ని ఒప్పించి ఆవు నిచ్చి గొర్రెని తీసుకున్నాడు మనతాత! అక్కడి వాళ్లందరూ తాత తెలివితక్కువ పనికి ఆశ్చర్యపడ్డారు! తాత మళ్లీ పాటలు ప్రారంభించాడు. ...

ఈ సారి తాతకి ఒక కోళ్లపందెం కనపడ్డాది. అక్కడికి వెళ్ళి ఆపందెం అయిందాకా అక్కడ వున్నాడు! ఒక కోడిపుంజు గెలిచింది! రెండవ దాన్ని వాళ్లు చంపివేస్తారని విన్నాడు తాత! వెంటనే కోడికూర రుచి తలపు కొచ్చింది! 'ఆహా ఈ కోడిపుంజుని తీసుకెళ్తేఅవ్వ ఎంత సంతోషిస్తుంది? అవ్వకి ఆ కూరెంత ఇష్టం?' కోడి కూర తలపుకిరాగానే ఆ కోడి గల వాణ్ణి అడిగి కోడిపుంజుని తీసుకొని గొర్రెనిచ్చివేశాడు! నిజమా హాస్యమా గొర్రె నిచ్చి కోడిని తీసుకోవడమేమిటి? అని వాళ్ళందరూ చూచే లోపల మనతాత సంత ప్రయాణం మానుకొని ఇంటిముఖం పట్టి వెనుతిరిగి పోతున్నాడు! అంతలో ఒక ఆసామీ ఒక రామ చిలుకని పంజరంలో పెట్టి తీసుకు వస్తున్నాడు! చిలుకముద్దొస్తూఎంతో బాగుంది! మధ్యలో చిన్న చిన్న మాటలు కూడా పలుకుతోంది! తాతకళ్ళు ఆ చిలకమీద పడ్డాయ్! పడ్డమేమిటి కోడిపుంజు నిచ్చి చిలకని తీసుకోవడమేమిటి రెండూ ఒకేసారి జరిగాయి!

ఇంతలో ఒక ప్రక్కనుంచి ఒక పూర్వస్నేహితుడు వచ్చి తాతని పలకరించాడు! తాతబలేసంతోషంగా ఉందేమో కూనిరాగా లాలాపిస్తున్నాడు. ఇద్దరు స్నేహితులూ తాత ఊరుసమీపానికి వచ్చారు. మన తాతకి పాపం జాలెక్కువ కదూ? ఆ చిలకని పంజరంలో నుంచి పైకి తీసి మాటలు చెప్తున్నాడు. రెండు చేతుల్తో పట్టుకున్నాడు చిలకని! ఆ చిలుక భయపడి రెక్కలు టపటపా కొట్టింది! చేతులు గిలిగింతపెట్టినట్లయి తాతేంచేసా డనుకొన్నారు? ఆ చిలకని కాస్తా వదిలివేసాడు! 'హమ్మయ్య' అని చేతులు దులుపు

కున్నాడు తాత! ఇదంతా చూస్తు ఆ స్నేహితుడు ఆశ్చర్యపోయాడు! 'ఆ చిలకని ఎంతకి కొన్నావ్? ఎందుకలా వదిలేశావ్?' అని అడిగాడు తాతని! 'అరే! కొనడమేమిటి? విను! అంటూ ఉదయం లేచిన దగ్గర్నించీ జరిగిన దంతా చెప్పాడు తాత! ఆ స్నేహితుడు ఇప్పుడు మరింత ఆశ్చర్యపోయాడు! 'నిజంగానే'? అడిగాడు తాతని మళ్లీ! 'ఆహా, పదవేగంగా ఇంటికి పోయి భోంచేద్దాం' అవ్వ వంటయిపోయిఉంటుం దీపాటికి!! అన్నాడు తాత గొప్పగా! 'అరే, నూరురూపాయల గుర్రం పోగొట్టి, ఉట్టి చేతుల్తో ఇంటికి వెళ్తే అవ్వ ఏమీ అనదూ? నీ పనేమవుతుంది ఇంటికెళ్తే? అవ్వ చేత నాల్గు చీవాట్లు నీకు తప్పవు' అన్నాడు స్నేహితుడు. 'ఏమిట్రా భాయీ! అవ్వ నన్ను దెబ్బలాడుతుందనుకొంటున్నావా? నేనివాళ ఇన్నిపన్లు చేసానంటే ఎంతసంతోషపడుతుందనుకొన్నావ్? బంగారం! బట్టలూ కొన్నా అంత సంతోషించదు!' అన్నాడు తాత! ఈ సారి ఇంకా ఆశ్చర్యపోయాడు స్నేహితుడు! 'అదేమిటి ఇలా అంటాడు వీడు? అవ్వ నిజంగా ఏమీ అనదూ? ఎలాటి శాంత వంతులకేనా కోపం వస్తుంది! వీడు నా దగ్గర గొప్పకి అంటున్నాడిలా! ఎలాటి వాడికేనా భార్యచేత చీవాట్లు తినడ వంటే చిన్నతనంకాదూ?' 'ఏమిటలా ఆలోచిస్తున్నావ్? నా మాట మీద నీకు నమ్మకం లేదు కదూ? పందెం వెయ్యివాళ! 100 రూపాయలు! అవ్వేమైనా అంటుందనుకో! నేను నీకు 100 రూ॥లూ ఇస్తాను! ఏమి అనక పోతే నువ్వు నాకు ఇయ్యాలి. 100 రూ॥లూ' అన్నాడు



అయ్యో! రెండోవేపు మిగిలిపోయిందే.

చిత్రకారుడు: కె. సత్యనారాయణమూర్తి (హైదరాబాదు)

తాత! స్నేహితుడికి బలేవింతగా ఉన్నాయి తాతమాటలు. 'సరే' పందెం వెయ్యమన్నాడు అవ్వే మాత్రం చిరాకుగాని చూపించినా తనికి డబ్బివ్వాలని ఒప్పందల చేశాడు స్నేహితుడు. తాత ఒప్పుకున్నాడు. ఊళ్లో కొచ్చారు. తాత ఇంటివద్దకు వచ్చారు. అవ్వవచ్చి ఇద్దర్ని చూచి లోపలికెళ్లి నీళ్లు తెచ్చిఇచ్చింది. ఇద్దరూ కాళ్లు కడుక్కున్నారు. అవ్వ తాత నిట్లా అడిగింది! 'గుఱ్ఱాన్ని అమ్మేరా? ఎంత వచ్చింది? ఇంత ఆలస్యమయిందేం?'. స్నేహితుడు తాత వైపు చూశాడు చెప్పమని. తాత నవ్వుతూ చెప్ప సాగేడు. 'నేనలా గుఱ్ఱాని తోలు కెళ్తున్నాను. త్రోవలో పాపం నెలలు నిండిన ఒక ఆవుని ఒకడు తోలు కెల్తున్నాడు. ఆ ఆవునిచూస్తే జాలేస్తూందనుకో. మన గుఱ్ఱాన్ని వాడి కిచ్చి, ఆ ఆవుని తీసుకొన్నా! 'ఏదీ ఆవు? ఎంతమంచి పని చేసారండీ! 10 రోజులు పెంచామంటే దూడ పుడ్తుంది. దూడని రోజూ మీరాడించవచ్చు. నేను......' మధ్యలో తాత అన్నాడు 'అబ్బ, నీతో నాకు బాధ వచ్చిందిరా బాబూ! పూర్తిగా వినకుండా నువ్వు మధ్యలో మాట్లాడితే ఎలా? పూర్తిగా విను! ఆవుని తోలు కెళ్తూంటే గొఱ్ఱెల పందెం కనపడింది. గెలిచిన గొఱ్ఱెపోతుని చూస్తే ఎలాటివాళ్ళకేనా హుషారు పుడుతుందనుకో! ఈ ఆవు నిచ్చి ఆ గొఱ్ఱెపోతుని పుచ్చుకొన్నా!' మధ్యలోనే అవ్వ అందుకుంది. 'అబ్బ ఏంపని చేశారండీ! నాకు తట్టలేదుగాని, ఆవుతో చికాకెక్కువండీ! పేడ ఎవరెత్తుతారు? అయినా మన కంత జాగా 'ఏదీ? గొఱ్ఱెతే ఎక్కడేనా కట్టేస్తాం! ఏదీ గొఱ్ఱె? నాకివాళ ...' తాత 'చూశావా! మళ్లీ మధ్యలో మాట్లాడుతున్నావ్? మధ్యలో మాట్లాడొద్దని చెప్పానా? పూర్తిగా విను' అని మొదలుపెట్టాడు మళ్లీ! 'ఆ గొఱ్ఱెను తోలుకొస్తున్నా

వనుకో! త్రోవలో కోడిపుంజుల పందెం కనబడింది! ఆ పుంజు లెలా ఉన్నాయనుకొన్నావ్? తెగబలిసి ఉన్నాయ్! ఆ కోడిపుంజుని తెస్తే నువ్వు సంతోషిస్తావని ఆగొత్తె నిచ్చి కోడిపుంజుని పుచ్చుకున్నాను' అన్నాడు. అవ్వ ముఖం విప్పారింది. 'బలే మంచిపని చేసారు మీరు! నాకు కోడికూర ఇష్టమని మీరు మరచిపోలేదన్న మాట! ఔను కానీ ఎదీ కోడి? అబ్బా!'...మధ్యలోనే తాత అందుకున్నాడు 'ఇదిగో! నీ కెన్నిసార్లు చెప్పాను మధ్యలో మాట్లాడొద్దని? పూర్తిగా వినవ్? ఆ కోడిని తెస్తున్నానా! త్రోవలో ఒక చిలకని పంజరంలో పెట్టి ఒకడు తెస్తున్నాడు. ఆ చిల కెంత బాగుం దనుకొన్నావ్? చూస్తే ముద్దులు మూటకట్టూందనుకో! నేను...' ఈ

# పందెం గెలుపు

సారి అవ్వ మధ్యలోనే అందుకుంది. 'నాకు తెల్సు! మీరా కోడినిచ్చి చిలకని తెచ్చారు. ఔను! మీరు చాలా మంచివాళ్ళు. ఆ చిలకతో నాకు తోచకపోయినప్పుడల్లా ఆడుకో వచ్చు...మాట లెన్ని నేర్పుతానో చూద్దురూ? అయితే పంజరం ఎక్కడ కడ్తామంటారు? జామి చెట్టుకి కట్టే?' అంది! తాత 'వినకుండా మాట్లాడ్డం మానవ్ కదా? ఆ చిలక నేం చేశాననుకున్నావ్? పాపం కొంచం విశాలంగాఉంచుదామని పైకితీసి పట్టుకున్నా! అది తప్పించుకు ఆకాశంలోకి ఎగిరి పోయిందే' అప్పుడు చక్కా వచ్చానన్నాడు. అవ్వ సంతోషం పట్టలేక చతికిలబడిపోయింది. నోటంట మాటే రావడం లేదు. స్నేహితు డెలా ఉన్నాడో అని తాత అటు చూచాడు. పాపం! కొయ్యబారి పోయాడేమో! కదల్లేదు. 'లే భాయీ! అన్నం తిందాం!' అన్నాడు తాత! 'లేవండి భోజనానికి. అన్నీ వేడిగానే ఉంచాను. రండి బాబూ! అబ్బ! ఇవాళ ఎన్ని మంచిపన్లు చేశారు? ఎంత అలసటపడ్డారు? వేగంతిని— ఇంత విశ్రాంతి తీసుకోండి! అంటూ అవ్వ వంటింట్లోకి అడుగు పెట్టింది. ఇద్దరూ తృప్తిగా భోంచేశారు. అన్నం తిన్నంతసేపూ అవ్వ తాతని తెగపొగిడింది. స్నేహితుడు ఇప్పుడు నిజంగా ఆశ్చర్యపోయాడు. ప్రపంచకంలో ఇలాటి వాళ్ళు కూడా ఉంటారా అని మర్నాడు పందెం 100 రూపాయలూ ఇచ్చివేశాడు తాతకి......తాత అవ్వకి పందెం సంగతి చెప్పి, 'చూశావా నీ నుంచె

ఈ 100 రూ॥లు గెలిచాను, ఇది నీదే! అన్నాడు!'. అవ్వ 'బాగుంది! మీరంత మంచిపన్లు చేయకపోతే పందెం ఎలా గెలిచేవారు? ఏమైనా డబ్బుమీదే' అంది. ఎలాగైతేనేం పందెం గెలిచిన డబ్బుతో వాళ్ళు పండుగఘనంగా చేసుకున్నారు! కథ కంచికీ—మన మింటికీ! ★

# ఆశాజీవి

(14-వ పేజీ తరువాయి)

వలసినపని మరచిపోయేది. అందువల్ల అత్తగారు కూడా సవతితల్లికి ప్రియమైనదండకం వర్తించడం అరంభించింది. కాని ఈ దీవనలకి మొద్దుబారిన కమలయనస్సు బాధపడడం మానేసింది. కోడలు దగ్గర లేకపోతే కొడుకు ఇంకా పాడైపోతాడేమో నని కమల మామగారు ఆమెను పురిటికి పుట్టింటికి పంపలేదు. అందుకు కమల కూడా విచారించలేదు.

సవతితల్లీ అత్తగారి సాధింపులు చలనరహితంగా సహించడం నేర్చుకొన్న కమల భర్త దగ్గరమాత్రం ఆ ఓర్పు చూపించలేకపోయేది. గాలి ఊదగా ఊదగా అంతా భరించి ఒక్కసారి బ్రద్దలయ్యే రబ్బరుబుడగ లాగ ఉండిఉండి కమల ఉగ్గబట్టలేకపోయేది. నన్ను అన్యాయం చెయ్యవద్దని బతిమాలి ఏడ్చేది. ఒకొక్కసారి ఓర్పులేక భర్త ఉంచుకొన్నదానిని కసిదీరా తిట్టేది మరొక్కొక్కసారి భర్తనే తిట్టేది. అతడు మొదట్లో మాటలతో నోరుమూయించేవాడు. క్రమంగా చెయ్యి చేసుకోవడం కూడా మొదలుపెట్టేడు. క్రాపు మెరిసేటట్లు దువ్వుకొని, సిల్కులాల్చీ జరీకండువా వేసుకొని సెంటుపూసుకొని రాత్రి తొమ్మిది దాటేక వీధిగుమ్మం దాటిపోయే భర్తని కటకటాలలోంచీ కనిపించేటంతవరకూ, కన్నీరు అడ్డుపడేంతవరకూ నిండుమూలాలు కమల చూస్తూ నిట్టూర్పులు విడుస్తూ ఉండేది.

ఒక శుభవేళ కమల కొడుకుని కన్నది. పిల్లవాడిని చూసైనా భర్త తనవైపు తిరుగుతాడని ఆశపడింది కమల. కాని భర్త కొడుకుమీదకూడా అంత మమతి చూపించకపోవడంతో ఆమె పూర్తిగా అధైర్యపడింది.

ఆనాడు పిల్లవాడికి పాలిస్తూ ఉంటే ఎదురింటి ఆవిడ పరిగెట్టుకొచ్చి "చూడూ. మీ ఆయన ఉంచుకొన్న వీరమ్మ ఇలాగ వెళుతోంది. చూస్తావా" అంటూ వీధి వరకూ తీసి

కళ్ళీ చూపించింది. నల్లగా సిద్దిలాగ పెద్ద జై కపుడంత పొంగుగా, గొవునదుమూ మగ ర మొదులాగ విగుచుకొని నవుస్తూ వడు తోంది వీరమ్మ. కమల హృదయం భగభగ మండిపోయింది పచ్చిబాలింత శక్తిలేక వెళ్ళ లేకపోయిందే కాని దాని మొహాన్ని నాలు

## ఆశాజీవి

గూ పెట్టాలనిపించింది కమలకి. ఆరాత్రితాను దేవుడి పటానికి వేసిన మల్లెపూలదండ తీసు కొని అత్తగారు ఘుమఘుమలతో భర్త గది దాటుతూ ఉంటే సహించలేక పోయింది కమల.

'ఆగండి ఆదంత దేవుడికోసం గుచ్చేను. తీసికెళ్ళ వద్దు!'

'నోరుముయ్యి, నా ఇష్టం'

'మీ ఇష్టం! సిగ్గులేకపోతే సరి.. దానికి పువ్వులే తక్కువ. నల్లగా సిద్దిలాగ మగరాయిడులాగ ఉంది. పగలు చూస్తే రాత్రి కల్లోకి వస్తుంది పాపిష్టి వాలకం.'

"నీ కన్నా వెయ్యిరెట్లు బాగుంది. నీ మొహం చూస్తే పాపాలన్నీ చుట్టుకొంటాయి."

"అలాంటివాళ్లెందుకు పెళ్లాడేరూ? పెళ్లి చేసుకొనే ముందు ఈ బుద్దేమైందీ?..." ఆమె ఏడుపులోకి దిగింది." "పిల్లాడి మొహమైనా చూడండి. వాణ్ని చూసైనా..."

"ఏడ్చేవ్. దార్లోతే"

కమలకు మొండిపట్టుదల ఎక్కువైంది.

"ఏమైనా లేవను. మిమ్మల్ని వాళ్ళ వెళ్ళనివ్వను."

"ఒళ్లు చీరేస్తాను. జాగ్రత్త లే. ఆట్టే వాగద్దు."

కమల కదలలేదు. అతడొక్కతోపుతోస్తే పడిపోయి మళ్ళీ పరిగెట్టి కెళ్లి అతడు కాళ్లు కదల్చలేకుండా గట్టిగా పెనవేసుకొన్నది. కాళ్ళతో ఫడీ ఫడీ తన్ని చేతిబలం కొద్దీ కొట్టి, గుప్పెడు బిగించి చేతుల మీదా జబ్బల మీదా గుద్ది నిర్దయగా పచ్చి బాలింతని తన్నేసి 'ఇప్పుడు తీరిందా ఏడు' అంటూ అతడు బయటికి వెళ్ళిపోయాడు.

అత్తగారు లేవదీసి మంచంమీద పడుకోబెడుతూ "వాడు ఇంట్లోవున్న కాస్సేపూ అలాగ మాటలని మనస్సు విరిచేస్తావు. అయినా మగవాడిని అంతేసిమాటలంటే పడతాడా? కొడతానంటే కొట్టడూ" అని గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

కమలకి ఏడుపు రాలేదు. చిన్నప్పటినుండీ కష్టాలనే చవిచూచిన తను అత్తవారింట్లో సుఖపడతాననుకొంది. పుట్టింటిపరిస్థితుల నించి తప్పించుకొని తాను భర్తకి అతుక్కుపోవాలనుకొంది. కాపరానికొచ్చిన కొత్తలో విరామంలేని పనితోన్నా ఉన్న కొద్ది అవకాశంలో అతన్ని దగ్గరకు చేర్చుకోవాలని ప్రయత్నించింది. ఆ అనుబంధమూ సాన్నిహిత్యము ఏర్పడకుండానే తనమనస్సు విరిగిపోయింది. ఎవరి కోసం తానీ ఇంట్లో ఉండడం? తను బతికేం ప్రయోజనం? మల్లెదండలేని స్వామి ఫోటో బోసిగా కనబడింది.

"వెంకటరమణమూర్తీ నన్ను తీసికొనిపో" అని మనసారా దణ్ణం పెట్టుకోబోయింది కమల. పసివాడు కేర్ కేర్ మని గుక్కపట్టేడు. వాణ్ణి అడాల్లోకి తీసికొని పాలిస్తూ వాడి మొహం చూసింది. భర్తా సవతితల్లీ పరాయివాళ్లు కనుక తన్ను ఆదరంగా చూడలేదు. వీడు తన రక్తం పంచుకొని పుట్టేడు కనుక తనని తప్పక చూస్తాడు అనుకొంది కమల. వాడిఒళ్లు నిమురుతూ వీడికోసం తను బతకాలి. వాడివల్ల తనకీఇంట్లో స్థానం ఏర్పడింది. వాళ్ళ నాన్నలాగ కాక వీడు బుద్ధిమంతుడై పెద్దచదువులు చదివి, ఉద్యోగాలు చేసి మా అమ్మ నన్ను కష్టపడి




ఏమ్ పిల్లా' అల్లాంటి పిచ్చపిచ్చ నవలలు చదవకపోతేనేం?
శుభ్రంగా ఈ రేడియో వినరాదూ'?

చిత్రకారుడు. గాదిరాజు రామకృష్ణంరాజు (గొల్లలకోడేరు)

పెంచిందని పువ్వుల్లో పెట్టి పూజిస్తాడు. వాడు పెద్దవాడై తనని గౌరవిస్తూ తండ్రి అంటే లెక్కలేనట్లు ప్రవర్తిస్తే భర్తకి బుద్ధి వస్తుందనుకొంది కమల.

* * *

భర్తమీద మనస్సు విరిగిపోయిన కమల కొడుకే తానై కళ్లలో పెట్టుకొని పెంచింది.

కాలచక్రంలో పాతికేళ్లు గడచిపోయాయి. కమల కమలమ్మగారిలాగ మారింది. కొడుకు పెద్దచదువులు చదివి మంచి ఉద్యోగం సంపాదించాడు. గొప్పింటి పిల్లని పెళ్లి చేసుకొన్నాడు. కాని తండ్రిని లెక్కలేనట్లు చూసి తనని గౌరవించాలనే కమలమ్మ ఆశ తీరకుండానే ఆమెభర్త పరలోకానికి పయనమయ్యాడు.

కోడలు రమ కాపరానికి వచ్చిన కొత్తలో తాను పడిన బాధలు జ్ఞాపకంవచ్చి రమని ఏపనీ ముట్టుకోనిచ్చేది కాదు. ఏ కలతా లేకుండా కొడుకూ కోడలూ హాయిగా గడపాలని ఆమె కోరిక. వాళ్లని సినిమాలకీ షికారుకీ పంపించి తాను ఇంటిపనంతా మీదవేసుకొనేది. వాళ్లిద్దరూ ఇంట్లో ఉన్నప్పుడు తాను ఎదురుగా వెళ్లడంకూడా వారి సరదాలకి అంతరాయమేమోనని సాధ్యమైనంత వరకూ వంటింటినుండి ఇవతలికి వచ్చేదే కాదు. వారి ఏకాంతానికి భంగం కలుగుతుందేమోనని తనకి అలవాటు లేకపోయినా పొరుగిళ్లకి పెత్తనాల కెళ్లేది. దీనివల్ల ప్రాణపదంగా పెంచుకొన్న కొడుకుతో ఒకొక్క రోజు ఒక్క ముక్కకూడా మాట్లాడే అవకాశం లభించకపోయినా ఆ బాధని అవలీలగా భరించగలిగేది కమలమ్మ. ఆమెకి కావలసినది తనులాగ కాక కొడుకూ కోడలూ చిలకాగోరువంకల్లాగా కలిసి పోవడం.

కాని కమలమ్మ ఇచ్చిన అలుసుతో కోడలు క్రమంగా నెత్తికెక్కి కూర్చుంది. ఆమెకి భర్త అన్నా అత్తగారన్నా గౌరవం పోయింది. భర్త డబ్బు సంపాదించే మనిషిగానూ, అత్తగారు పనిమనిషిగానూ ఆమె అభిప్రాయపడి నిర్లక్ష్యంగా ప్రవర్తించేది. ఈ నిర్లక్ష్యం చిన్నతనమనీ ఒక్క నలుసు పుడితే బాధ్యత తెలుస్తుందనీ కమలమ్మ సరిపుచ్చుకొంది.

ఒక శుభముహూర్తంలో కమలమ్మకి మనవడు పుట్టేడు. కానీ కోడలిలో తానాశించిన మార్పేమీ కనబడకపోగా ఇంటి బాధ్యతతోపాటు పిల్లవాడి బాధ్యత కూడా తనమీదనే వేసి కొడుకూ కోడలూ విహారాలకి వెడుతూ ఉండడం కమలమ్మకి కష్టంగానే అనిపించేది.

చిన్నతనంనుండీ ఊపిరి సలపని చాకిరీయే తప్ప మరొక ప్రపంచం ఎరుగని

కమలమ్మకి చుట్టుపక్కల ఇళ్లల్లో తీర్థయాత్రలని బయలుదేరుతూఉంటే తానూ కొన్నాళ్ళు సంసారాన్ని మరిచి వారితోపాటు వెళ్లి భగవంతుని సేవ చేసుకోవాలనిపించింది. కొడుకుతో ఈ విషయం ప్రస్తావించాలనుకున్నదామె. ఎప్పుడూ భార్యతో సరసాలాడుతూ గడిపే కొడుకు ఆమెకు ఏకాంతంగా లభించడమే కష్టమైంది. వీలుచూసుకొని కమలమ్మ తన మనస్సులోని కోరిక చెప్పుకొంది కొడుకుతో.

"నీ ఆరోగ్యం సరిగ్గా లేదమ్మా. ఈ వయస్సులో యాత్రలకి తట్టుకోలేవు. పైగా నువ్వు వెళ్లిపోతే ఇంట్లో ఎలాగా?"

యాత్రలకి వెళ్ళేందుకు అడ్డువచ్చే అనారోగ్యం చాకిరీకి అడ్డురాదు గాబోలు.

'నీవు వెళ్లిపోతే ఇంట్లో ఎలాగ' అనడంలో 'ఈ చాకిరీ ఎవరు చేస్తారూ' అనే అర్థం గోచరించిందామెకు. 'ఇంట్లో ఎలాగ'

# ఆశాజీవి

అనేబదులు 'నాకెలాగ' అన్నా కొంచెం తృప్తిపడేదేమో! తను ఇంట్లో లేకపోతే పనికి కష్టం. అంతేనా? అనిపించిందామెకు.

"అది కాదురా నాయనా. నేనూ పెద్దదాన్ని అయిపోయానా? ఇప్పుడున్న ఓపిక ఇంకొన్నాళ్ళకి అసలే ఉండదు. కనుక ఏదో దేవుడూ దేవతా అని చూసుకోవాలా?"

"ఆఁ. తీర్థయాత్రలకి వెడితేనే దేవుడూ దయ్యమూనా. ఇంట్లోనే పూజలు చేసుకో. అంతేకాక ప్రస్తుతం తీర్థయాత్రలంటే ఏ రెండువందలో నీకివ్వాలి. క్రిందటి నెల రమకి టెరిన్యాచీర కొన్నానా? ఈ నెల బాబుకి తోపుడుబండీ కొన్నానా.. "

కమలమ్మదృష్టి కొడుకునుండి గోడపైపుకి మళ్ళింది. ఎగుడుగా వెంకటరమణమూర్తి ఫోటో గాలికి అల్లల్లాడుతోంది. ఆమె మెల్లిగా నడిచి వసారాలోకి వెళ్ళిపోయి మంచం మీద నిర్లిప్తంగా కూర్చుంది. ఆమె ఆలోచనలు స్తంభించిపోయాయి.

"వెధవా! క్యూటెక్సు పారబోస్తున్నావా" అంటూ దబదబా మనవడిని కోడలు బాదేస్తూ ఉంటే వాడు గొల్లోమని గుక్కపట్టడంతో కమలమ్మ ఈలోకంలోకి వచ్చింది. గబగబా వెళ్ళి "వాణ్ణి ఇలాగతే" అంటూ తీసుకొని ఒళ్లో పడుకోబెట్టుకుని సముదాయిస్తూ నిద్రపోగొట్టింది. నిద్రలో కూడా వెక్కుతున్న వాడిమీద చెయ్యివేసి అమాయకంగా ఉన్న వాడిమొహం చూస్తూ కమలమ్మ అనుకొంది - వీడు పెరిగి పెద్దవాడై తనని తీర్థయాత్రలన్నిటికీ తీసికెడతాడని. ★

# సినిమా

## తెలుగు తెరకు సరికొత్తకానుక

# 'చివరకు మిగిలేది'

కథలో, కథనంలో, సాంకేతిక పద్ధతుల్లో, సంగీతంలో, తారాగణంలో - ఈ పంచ శిలాల్లో కొంత కొత్త పుంత త్రొక్కి నల్లేరుపై బండిగా నడిచే చిత్రం మంజీరా వారి "చివరకు మిగిలేది"!

ఈ చిత్రాన్ని నవంబరు 22వ తేదీన విజయా స్టూడియోస్‌లో పత్రికా ప్రతినిధులకు చూపారు. "దీప్ జలేజాయ్" అనే బెంగాలీ చిత్రం దీనికి మాతృక.

మానసిక వ్యాధుల చికిత్సాలయాన్ని నిర్వహిస్తున్న ఒక డాక్టరు (ప్రభాకరరెడ్డి) తన వద్ద పనిచేస్తున్న పద్మ (సావిత్రి) అనే నర్సును విదేశాలకు పంపి ఆధునిక చికిత్సా పద్ధతులలో శిక్షణ గరిపిస్తాడు. తిరిగి వచ్చిన తరువాత, ఆమె తాను నేర్చుకొనివచ్చిన చికిత్సా విధానాలను భాస్కర్ (కాంతారావు) అనే రోగిపై ప్రయోగించి, అతనికి మానసిక స్వాస్థ్యం కలిగిస్తుంది. చికిత్సా కాలంలోనే పద్మ, భాస్కర్ సన్నిహితులు కావటం, వారి పరిచయం ప్రణయంగా మారటం జరుగుతుంది. డాక్టరుకు ఈ విషయం చూచాయగా తెలుస్తుంది. పద్మకు వృత్తిధర్మాన్ని గుర్తుచేసి, భాస్కర్‌పై ఆమె చూపిన ఆదరాభిమానాలు చికిత్సా విధానాన్ని అనుసరించి చేయవలసివచ్చిన అభినయ విశేషాలు మాత్రమేనని చెబుతాడు. తను చేసింది అభినయం కాదనీ, భాస్కర్‌కు తనకు మధ్య నిజమైన ప్రేమబంధం ఏర్పడిందనీ ఆమె చెప్పలేకపోతుంది. భాస్కర్ చాటుగా ఉండి, వీరిద్దరి సంభాషణ వింటాడు. పద్మ, డాక్టరు మాటకు ఎదురు చెప్పకపోవటంతో, తనయందు ఆమె ప్రవర్తన అంతా నటనేనని భాస్కర్ నమ్ముతాడు. చికిత్సాలయం విడిచి వెళ్లిన కొంతకాలానికి వేరొకరితో అతని వివాహం నిశ్చయం అవుతుంది. భాస్కర్ స్వయంగావచ్చి పద్మకు శుభలేఖ అందజేస్తాడు. అంతవరకు భాస్కర్ మీదే ప్రాణాలన్నీ నిలుపుకున్న పద్మ ఆశాసౌధాలు ఒక్క వేటున కూలిపోతాయి. ఆ బాధ నంతటిని మనస్సులో మరుగుపెట్టుకొని, ఆస్పత్రిలో తన విధులను యథాప్రకారం నిర్వహిస్తూ ఉంటుంది. ఈ కథ ఇలా ఉండగా వేరొకవంక ప్రకాశరావు (బాలయ్య) అనే యువకుడు లక్ష్మి (శోభ) అనే గాయకురాలిని ప్రేమించి, ఆమెచేత అవమానింపబడతాడు. అతని మనస్సు పాడవుతుంది. ఆస్పత్రిలో చేరతాడు. డాక్టరు, ఈ కేసునుకూడా పద్మకే అప్పగించాలనుకుంటాడు. వెనుకటి అనుభవం తాజాగా వచ్చి ఇంకా ఆరనందువల్ల ఆమె అంగీకరించలేకపోతుంది. చికిత్సా విధానాన్ని అనుసరించి చేయవలసిన అభినయం తనవల్ల కానిపని అని డాక్టరుకు నిక్కచ్చిగా చెబుతుంది. అయితే రోగి పరిస్థితి నానాటికి దిగజారి, ప్రాణానికే ముప్పు ఏర్పడిందని తెలుసుకున్నాక, ఆమె తన నిర్ణయం మార్చుకుంటుంది. పద్మ, భాస్కర్‌తో తాను గడిపిన మధురక్షణాలను స్మరించుకుంటూ, ప్రకాశరావుకు చేయవలసిన సపర్యలు చేస్తుంది. అతను క్రమేణా కోలుకుంటాడు. ఆమె ఆదరాభిమానాలు తనయందు ఆమెకుగల ప్రేమకు చిహ్నాలని అతను అపోహపడతాడు. అతని మనస్సును నొప్పించడానికి ఇష్టంలేక పద్మ ఆ అపోహను తొలగించదు. ప్రకాశరావు పద్మను విడిచి ఉండలేని స్థితికి వస్తాడు. ఈ నూతన పరిణామంవల్ల ఆమె హృదయంలో అజ్ఞాతంగా ఉన్న అగ్నిపర్వతాలు బ్రద్దలవుతాయి. ఆమె తట్టుకోలేకపోతుంది. ఎవరి సేవకోసం తనజీవితం అంకితం చేసిందో, ఆమెకూడా చివరికి వారిలో ఒకరుగా అవుతుంది.

మంజీరా ఫిలిమ్స్‌వారు తమ చిత్రానికి ఇలాంటి ఇతివృత్తాన్ని ఎన్నుకోటం తెలుగు తెరకు క్రొత్త. ఆదినుంచి తుదివరకు పిచ్చి ఆస్పత్రి వాతావరణంలో నడిచిన ఈ కథను ప్రేక్షకులకు జుగుప్స కలుగని విధంగా తెరకెక్కించటం తేలికయిన పనికాదు. అయినా సాహసించి ఇందుకు పూనుకున్న యువదర్శకుడు శ్రీ రామినీడు చాలావరకు కృతకృత్యులయ్యారనే చెప్పాలి. కథా సంవిధానంలో ఒకటి రెండు లోపాలు కనిపిస్తున్నాయి. వైద్యుడేగాని, నర్సేగాని, వృత్తిధర్మాన్ని



మంజీరావారి 'చివరకు మిగిలేది'లో చదలవాడ, బాలయ్య, రమణారెడ్డి.

# బొమ్మ - బొరుసు

### బొమ్మ

మద్రాసులో నవంబరు 18 నుండి 25 వరకూ పశ్చిమజర్మనీ చలనచిత్రోత్సవాలు జరిగాయి. "ఈ చిత్రాలనుండి మనం నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది" అన్నారు ఒక సినీమనిషి.

### బొరుసు

"ఔనౌను బ్యాగ్రౌండు మ్యూజిక్ బిట్లు చాలా మంచివి ఉన్నాయి. మనకి చాలా పనికొస్తాయి" అన్నాడొక సంగీత దర్శకుడు; 'మ్యూజికేవిటి కథల్లో ఎల్ హాకీను పదహారణాల తెలుగు కథలా ఉంది. ఒక్క ఫ్రేం మార్చకుండా తెలుగులో డైరెక్టుగా తీసేసుకోవచ్చు, అన్నాడొక దర్శకుడూ, నిర్మాత.

### బొమ్మ

"జర్మన్ తారలు ఏక కాలంలో రెండు పిక్చర్లకు మించి నటించరుష. అందువల్ల వారు వేస్తున్న వేషంమీద, ఆయొక్క కథమీదా ఏకాగ్రత చెడదు" అన్నారు ఒకాయన మనతారలకేసి కోరగా చూసి

### బొరుసు

"మై డియర్ వెంకటేశం! మేకె నోట్! మెకేనోట్ ఎట్‌వన్స్! రేపు మనం జర్మనీ వెళ్ళినపుడు ఈ పాయింటుమీద లెక్చరు దంచి వాళ్ళు మనవాళ్ల దగ్గర నేర్చుకోవలసింది యంతైనా ఉందని చెప్పొచ్చు. ఇండియన్ స్టార్స్ పదేసి పిక్చర్లలో ఉన్నా కాన్సెంట్రేషన్‌లో వీళ్ళతరవాతే యవరైనా. ఏగోజున షూటింగుకొచ్చినా పదకొండింటికొచ్చి పన్నెండున్నరకల్లా వెళిపోతారు. బుర్రని ఏమాత్రం శ్రమపెట్టరుగదా" అన్నారు గిరీశం.

### బొమ్మ

భారతీయచిత్రాలను వాణిజ్యస్థాయిన యూరప్‌లో ప్రదర్శించడానికిగాను రాంక్ ఫిలిం కంపెనీద్వారా ఏర్పాట్లు జరుగుతున్నట్లు కేంద్రప్రభుత్వ ప్రతినిధి ఒకరు గతవారం వెల్లడించారు.

### బొరుసు

వార్నింగులేకుండా ఇలాటిపన్లు చెయ్యడం సబబుకాదు. ఇంకా నయం అమెరికాతోకూడా ఇలాటి ఎగ్రిమెంటు రాసుకోలేదు. వాళ్ల కథలూ, వాళ్ల సీనులూ, వాళ్ల పాటలూ గట్రా వాళ్లకే పట్టిగెళ్ళి అమ్మజూపితే ఏం బావుంటుంది. వెంటనే లీగల్ ఎడ్వైజర్నుకూడా వేసుకోవాలి ఎందుకయినా మంచిది అన్నాడు బొంబాయిసినిమాలంటే అపేక్షఉన్న ఒక పెద్దమనిషి.

### బొమ్మ

హాలీవుడ్ చిత్రాలు అమెరికన్‌ల నిజజీవితాన్ని ప్రతిబింబిస్తున్నాయని అనుకోవడం పొరబాటు అని అమెరికన్ ప్రతినిధి ఒకరు హెచ్చరించారు.

### బొరుసు

ఈముక్క మా విమర్శకులకు కాస్త గట్టిగా చెబితేమంచిది. వాళ్లెప్పుడూ సమానం బొంబాయి పిక్చరు అమెరికన్ ధోరణిలో ఉండి ఆ జీవితాన్నే చూపిస్తున్నాయంటున్నారు. ఆపని హాలీవుడ్ చిత్రాలకే చాతకానపుడు అందులో శకలాలుమటుకే తీసుకునే మాకు మటుకు చేతనవుతుందా' అన్నాడు ఒక బొంబాయి సినీవాలా

### బొమ్మ

సమకాలిక భారతీయ జీవితాన్ని ఇక్కడి నిజమైన సమస్యలను చూపిస్తూ మీరు చిత్రాలుతీస్తే అవి యూరప్‌లో తప్పకుండా ప్రజల ఆదరణ పొందుతాయి. వ్యాపారరీత్యా ఘనవిజయం సాధిస్తాయి అన్నారు బ్రిటన్‌నించివచ్చిన ఒక ఫిలిం ప్రతినిధి.

### బొరుసు

ఆయన చెప్పినపని చేస్తే మన పిక్చర్లు ఇంగ్లాండులో హిట్లవుతే కావచ్చుగాని ఇండియాలో పనికిరావు. మనవాళ్ళకిలాటివి నచ్చవు. అన్నాడొక బాక్సాఫీసు సూత్రధారిటీ.

### బొమ్మ

మనతారలు ఎంతసేపూ కార్లలో తిరుగుతూ జనానికి భయపడుతూ ఉంటారు. వాళ్లు జనంలో కలిసిపోయి తిరిగి కష్టసుఖాలు చూడకుండా సామాన్యుల జీవితాలను ఎలా తెలుసుకుంటారు. సామాన్యుడిలా ఎలా సహజంగా నటిస్తారు? అన్నారు బల్‌రాజ్ సాహ్ని.

### బొరుసు

మనతారలు కష్టపడి అంతపనీ చేస్తేమటుకు ఏమి లాభం? మన చిత్రాలలో కథలు "సామాన్యమైనవి" కావే! అవన్నీ అసహజంగా ఉంటగా వీళ్ల నటనమటుకు సహజమైతే ఏంబావుంటుంది గనక. ముందర కథ గలిచి రచ్చకెక్కడం మంచిది అన్నాడొక ఫిలిం విమర్శకుడు.



---

విస్మరించి, తమ సేవలను అందుకునే రోగుల యందు రాగద్వేషాలు పెంచుకోటం సాధారణంగా జరుగదు. ఈ విషయం తెలుసుకోటానికి మన స్తత్వ శాస్త్రంతో గాని, లేక దానిలో వున్న ప్రత్యేక చికిత్సావిధానాలతో గాని పరిచయం అనవసరం. చికిత్స ప్రభావంవల్ల రోగి నర్సును ప్రేమించే అవకాశం వున్నా, నర్సు అతనిని ప్రేమించే అవకాశం కనిపంచదు. కారణం ఆమె అనుసరిస్తున్నది వృత్తి ధర్మం. తాను చేసే పని, లక్ష్యం ఆమెకు తెలుసు. అయినా ఆమె రోగిని ప్రేమించిందంటే తన వృత్తిధర్మాన్ని విస్మరించిందన్నమాట. మానవ సహజమయిన వాంఛలకు, వృత్తి ధర్మానికి మధ్య సంఘర్షణ ఏర్పడి, వాంఛలది పైచెయ్యి అయిందని అర్థం చేసుకోవాలి. భాస్కర్‌ను ప్రేమించినప్పుడుగాని, ఆ తరువాత ప్రకాశరావుకు సపర్యలు చేస్తున్నప్పుడు గాని, పద్మలో ఈ విధమయిన సంఘర్షణ కలిగినట్లు చిత్రంస్ఫురింప చేయలేదు అసలు ఈ సంఘర్షణ సూచన ప్రాయంగానైనా లేకపోయినప్పుడు చిత్రానికి పిచ్చి ఆస్పత్రి వాతావరణమే అక్కరలేదు. ఏ వాతావరణమయినా ఫరవాలేదు. కాని అప్పుడు కథకు ప్రత్యేకత ఏమీ కనిపించదు. ఇద్దరబ్బాయిలు ఒక అమ్మాయి ప్రేమ గాథగా మిగిలిపోతుంది.

## కానుకలు

ఈచిత్రంలో నటనటులంతా ఉత్తమంగా నటించారు. పద్మగా సావిత్రి నటన ఉన్నత శిఖరాలను అందుకున్నది. కాంతారావు, బాలయ్య ప్రతిభావంతమైన నటన ప్రదర్శించారు. కొండలుపాత్రధారి రమణారెడ్డి చక్కని హాస్యాన్ని పోషించారు. ఒక్క మాటలో చెప్పాలంటే, చిత్రంలో ఏ మూల వెదకినా అశ్లీలంగా వున్న సన్నివేశం గాని, ముతక సంభాషణలు గాని కనిపించవు. ఇందుకు రచయిత శ్రీ పిచ్చేశ్వరరావు, దర్శకుడు అభినందనీయులు శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి గారి పాటలకు, శ్రీ అశ్వత్థామ వినులకు విందైన బాణీలు కట్టారు. శబ్దగ్రహణం, ఛాయాగ్రహణం నిర్దుష్టంగా వున్నాయి.

తెలుగు తెరకు సరికొత్త కానుక 'చివరకు మిగిలేది'. నిర్మాత శ్రీ పురుషోత్తము రెడ్డి అభినందనీయుడు.





అంజలీపిక్చర్స్‌వారి 'ఋణానుబంధం'లో అభినేత్రి అంజలీదేవి.

# సంక్రాంతి కానుకలు

సంక్రాంతి కానుకల విడుదలకు సన్నాహాలు ఆరంభమయ్యాయి. దేశంలో పొలాలకిలాగే ఫిలిం 'పొలం'లో రూపాయల పంట కోసి నూర్చేందుకు కూడా ఇదే ఋతువు. అందువల్ల ఈ విడతలో పోటీలు తప్పవు. ఫిలిం పరిశ్రమ పరిమాణం బాగా పెరిగినందువల్ల, నెల్లాళ్ళు అటూ ఇటూ కూడా ఇంకో చిత్రం లేకుండా వీలు చేసుకొని ఒక చిత్రం విడుదల చేసే సదుపాయాలు ఇక కుదరవు. వారానికో చిత్రం వస్తూనే వుంటుంది. క్రిందటి సంక్రాంతికి రెండు మూడు రోజుల తేడాలో మూడు నాలుగు భారీ చిత్రాలు పంపి ప్రేక్షకులను తాడో పేడో తేల్చవలసిందని మొహమాట పెట్టకుండా వుండాలని ఈమాటు కొంత జాగ్రత్త పడుతున్నారు. అయినా పండగవేళకి పోటి రద్దీ వుండవచ్చుననే ఇప్పటి వార్తలు చెబుతున్నాయి. వారం పదిరోజుల్లో నిర్ణయాలు మారినా మారవచ్చు ననుకుంటున్నారు. ముమ్మరంగా యుద్ధం జరగడం రివాజైన తమిళ చిత్ర ప్రదర్శన రంగంలోనే సర్దుబాట్లకు కృషి జరుగుతున్నందువల్ల తెలుగు సినిమా సీమలో ఆపాటి సర్దుబాట్లు తప్పక సాధ్యపడతాయనీ, సంక్రాంతికి విడుదల చేయాలని చాలా కాలం క్రితమే నిర్ణయించి నిర్ణీత కార్యక్రమం ప్రకారం పనిచేస్తున్న చిత్రాలు ముందరా, తరువాతవి తరవాతా వచ్చి ప్రేక్షకుల శ్రమ తగ్గిస్తాయనీ ఆశిస్తున్నారు.

## డిసెంబరు

సంక్రాంతి కానుకలుగా పరిగణించ తగ్గ చిత్రాలు ఈ నెలలోనే ఆరంభం అవుతున్నాయి. ఇప్పటికి తెలిసిన కార్యక్రమం ప్రకారం డిసెంబరు 7 న అంజలీవారి సాంఘికం 'ఋణానుబంధం' వస్తుంది. ఒకవారం తరవాత సంగీతా (ఇంటిగుట్టు) ప్రొడక్షన్సు వారి 'మామకు తగ్గ అల్లుడు', డిసెంబరు 21 న ప్రగతీ ఆర్ట్సువారి 'మా బాబు' విడుదల కావాలి. రెండోవారంలోనే బహుశా అనువాద చిత్రం 'వీరసామ్రాజ్యం' రావచ్చు.

ఋణానుబంధంలో నాయికా నాయకులు అంజలీదేవి, నాగేశ్వరరావు. దర్శకుడు వేదాంతం రాఘవయ్య. రచయిత ఆత్రేయ. సంగీత దర్శకుడు, నిర్మాత ఆదినారాయణ రావు.

సంగీతా వారి చిత్రంలో ముఖ్య పాత్రను రేలంగి నిర్వహిస్తున్నారు. బహుళ జనాదరణ పొందిన హాస్య ప్రధాన చిత్రం 'పక్కింటి అమ్మాయి' తరువాత రేలంగి 'హీరో'గా నటించిన చిత్రం ఇదే. ఈ చిత్రానికి వేదాంతం రాఘవయ్యగారే దర్శకులు. రచయిత సదాశివబ్రహ్మం. సంగీతం ఎం. ఎస్. ప్రకాష్ సమకూర్చారు.

ప్రగతి ఆర్ట్సువారి 'మా బాబు' షూటింగ్ మొన్ననే పూర్తి అయింది. తుది మెరుగులు దిద్దుతున్నారు. 'చిరాగ్ కహా రోష్నీ కహా' అనే హిందీ చిత్ర కథ ఆధారంగా తీస్తున్న ఈ చిత్రానికి తాతినేని (ఇల్లరికం) ప్రకాశరావు దర్శకుడు. నాగేశ్వరరావు, సావిత్రి, రేలంగి, ఎం. ఎన్. రాజం, ఎం. సరోజ, కన్నాంబ, మిక్కిలినేని మొదలుగువారు పాల్గొన్నారు. రచయిత సముద్రాల జూనియర్.

## జనవరి

జనవరినెల నేషనల్ ఆర్ట్ థియేటర్స్ వారి భారీ పౌరాణికం "సీతారామ కల్యాణం" చిత్రంతో ఆరంభమవుతుంది. రామాయణేతిహాసాన్ని, పూర్వోత్తర గాథలు సహా సమగ్రంగా సేకరించి మూడు చిత్రాలుగా నిర్మించాలన్న బృహత్పథకంలో ప్రథమ భాగమే ఈ చిత్రమనీ ఇందులో రావణ బ్రహ్మ ఉదంతాన్ని విపులంగా చర్చించడం జరిగిందనీ నిర్మాత ఎన్. త్రివిక్రమరావు చెప్పారు. రావణుడి భూమికను ఎన్. టి. రామారావు నిర్వహించారు. మండోదరి బి. సరోజాదేవి. రాముడుగా హరనాథ్ నటిస్తున్నాడు. విశ్వామిత్రుడు గుమ్మడి. దశరథ, జనక మహారాజులు నాగయ్య, మిక్కిలినేని. పరశురాముడు కె. వి. ఎస్. శర్మ. ఈ చిత్రానికి కథ, మాటలు పాటలు సముద్రాల రాఘవాచార్య వ్రాశారు. సంగీత దర్శకుడు గాలిపెంచల (బాలరాజా) నరసింహారావు. చక్కని తెలుగు సంగీతం సమకూర్చగలవారిలో ముఖ్యులని కిందటి దశకంలో పేరు గడించిన గాలిపెంచల ఇందులో చాలా మంచి సంగీతం వినిపించగలరని విన్నవారన్నారు. ఈ చిత్రంలో రావణ వీణావాదన ఘట్టం ఒకటి విశిష్టంగా ఉంటుంది. వైణికశిఖామణి ఈమని శంకర శాస్త్రిగారు అక్కడ సమ్మోహనకరంగా తానం వాయించారు.

'సీతారామకళ్యాణం' ఛాయాగ్రహణ దర్శకుడు రవికాంత్ ఇందులో 'మాయా ఛాయాగ్రహణ' శిల్పంలో ఎన్నతగ్గ ప్రయోగాలు చేసి చిత్రాన్ని అత్యంత దర్శనీయంగా తీశాడని తెలుస్తోంది.

* " *

ఈ చిత్రం విడుదల కావడంతోనే



ప్రగతి ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి 'మా బాబు'లో నాగేశ్వరరావు, గుమ్మడి మొదలైనవారు.



అన్నపూర్ణావారి ఆరవచిత్రంలో సావిత్రి, నాగేశ్వరరావు.

రెండవ భాగం—రాముడి వనవాసం నుండి రావణవధవరకూ.— ఆరంభిస్తామని త్రివిక్రమరావు చెప్పారు. అందులో రామరావణ పాత్రలు రెండూ రామారావు నిర్వహిస్తారు. ఇంచుమించుగా దానితోపాటే 'గులేబకావలి' జానపద చిత్రనిర్మాణం కూడా ప్రారంభిస్తారు.

* * *

దీనితరువాత, జనవరి 9న రాగలది అగ్రశ్రేణి తారాగణంతో, విజయత్రయ సాధకులు అన్నపూర్ణా (దొంగరాముడు, తోడికోడళ్లు, మాంగల్యబలం) పిక్చర్స్‌వారు నిర్మిస్తున్న సాంఘికం.

దీనికి 'సుఖదుఃఖాలు' అని నామకరణం చేశారు.

నాగేశ్వరరావు, జగ్గయ్య, సావిత్రి, రంగారావు, సూర్యకాంతం, రేలంగి, రాజసులోచన, సంధ్య మొదలగువారంతా ఇందులో పాల్గొన్నారు. రచయిత ఆత్రేయ, సంగీత దర్శకుడు: పెండ్యాల. పాటలు: శ్రీశ్రీ, కొసరాజు రాఘవయ్య వ్రాశారు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. నిర్మాత డి. మధుసూదనరావు. గతవారం రాజసులోచన, బృందం నృత్యాన్ని తీసి నాగేశ్వరరావుతో ఒక ప్రబోధగేయం చిత్రించి రెంటినీ మనోహరంగా మేళవించారు.

* * *

జనవరి 14న శ్రీ రాజరాజేశ్వరీవారి పౌరాణికం "ఉషా పరిణయం" విడుదల కాగలదని తెలుస్తూంది. జమున, కన్నాంబ, సూర్యకళ, మీనాకుమారి, మోహన్, కాంతారావు, ఎస్. వి. రంగారావు, రేలంగి, రఘురామయ్య, కె. వి. ఎస్. శర్మ, సూరిబాబు, పేకేటి, నల్లరామ్మూర్తి, సీతారాం, రాజనాల, మిక్కిలినేని నటించారు. రచయిత సదాశివబ్రహ్మం. సంగీతదర్శకుడు సాలూరి హనుమంతరావు. ఛాయాగ్రహణం లక్ష్మణ్ గోరే. దర్శకుడు కె. బి. నాగభూషణం

* * *

తేదీ నిర్ణయం కాలేదుగాని ఆర్. ఆర్. పిక్చర్స్‌వారి సాంఘికంకూడా ఈ వేళకే విడుదల కాగలదని తెలుస్తూంది. రామారావు, జగయ్య, బి. సరోజాదేవి, రమణారెడ్డి ప్రభృతులు పాల్గొంటున్న ఈ చిత్రానికి వి. ఎస్. రెడ్డి, దర్శకుడు రచయిత ఆత్రేయ.

## ఫిబ్రవరి

ఒకటిరెండు వారాలలో నిర్ణయాలు మారితే వీటిలో ఒకటిరెండు చిత్రాలు బహుశా— ఉషాపరిణయం, ఆర్. ఆర్. పిక్చర్స్‌వారి చిత్రం జనవరి నెలాఖరుకు గాని ఫిబ్రవరి తొలివారానికిగాని రాగలవనుకుంటున్నారు. ఫిబ్రవరిలో విడుదలకు నిర్ణయించిన మరిరెండు చిత్రాలు: ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స (ఇల్లరికం) వారి సాంఘికం. నాగేశ్వరరావు, కృష్ణకుమారి నటిస్తున్నారు దర్శకుడు ప్రత్యగాత్మ. సంగీతం రాజేశ్వరరావు. రెండవది మహేంద్రవారి 'కృష్ణప్రేమ' జమున, ఎస్. వరలక్ష్మి, బాలయ్య, గుమ్మడి మొదలగువారు నటిస్తున్నారు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. నిర్మాణం నూరింట 90 పాళ్ళు పూర్తి అయిపోయింది.

* * *

చాలకాలంగా నిర్మాణంలో ఉండి ఇప్పుడు పూర్తి కావస్తున్న గీతా పిక్చర్స వారి 'ఋష్యశృంగ' కూడా ఫిబ్రవరిలోనే రావచ్చునని తెలుస్తూంది. నిర్మాత శేషాచలం అనారోగ్యంవల్ల ఆగిపోయిన కార్యక్రమం ఇప్పుడు తిరిగి చురుకుగా సాగుతోంది. ముక్కామల కృష్ణమూర్తి దర్శకత్వాన రూపొందుతున్న ఈ చిత్రంలో ముఖ్య పాత్రను హరనాథ్ నిర్వహిస్తున్నాడు. గుమ్మడి, రాజసులోచన ఇతరముఖ్యనటులు. ఈ చిత్రం తమిళంలో కూడా తయారవుతోంది.

* * *

శ్రీ శ్రీనివాసా ప్రొడక్షన్స్‌వారి 'టైగర్ రాముడు' రెండు రీళ్ళు తయారైంది. రామారావు, రాజసులోచన, రంగారావు, రేలంగి నటిస్తున్నారు. రచయిత సముద్రాల జూనియర్. సంగీతం ఘంటసాల. దర్శకత్వం సి. ఎస్. రావు నిర్వహిస్తున్నారు. నిర్మాతలు పంతం చిన్నారావు, వడ్డి శ్రీరాములు.

* * *

హైదరాబాద్ (జల్నారాయుడు)మువీస్ వారి కొత్త చిత్రానికికూడా సి. ఎస్. రావుగారే దర్శకుడు. జగ్గయ్య, జమున, ముఖ్యనటులు. రచయిత సదాశివబ్రహ్మం.



# బొంబాయి టాకీ టాకీ వార్తలు

## మొగలే ఆజంలో మార్పులు

దర్శకుడు కె. అసిఫ్, తాను తీసిన చారిత్రిక "చారిత్రక" చిత్రం 'మొగలే ఆజం' విడుదల అయిన ఇన్నాళ్ళకు సవరణలు తల పెట్టినట్లు తెలిసింది. కథాంతం, అనార్కలీ చిత్రవధాంతం కాకుండా, "అనార్కలీ కథాంతికం"గా చేసిన మార్పుని జనంకూడా హర్షించలేదట. కొత్తల్లో, ఈ చిత్రమంటే గిట్టనివాళ్లు—పత్రికలవాళ్లు ఆడిపోసుకున్నారని కినిసినా చిత్రంలో ముగింపు చారిత్రకంగా, అసత్యంఅని ఋజువు చేసిన వారికి చాలాడబ్బు బహుమతీ ఇస్తానని ఆయన అనడం జరిగిందంటారు.

## కొత్త బాట

అయితే, అసలు అనార్కలీ కథకే చారిత్రికంగా ఏమంత ఆధారం ఉందిట అని కొందరు అడిగారు. అది లేనపుడు అందులో మార్పులకు నిజాయితీ ఎక్కడ తెస్తారన్నారు. అందువల్ల సవాలు తేలిపోవడం జరిగింది ఇపుడు ప్రజలకు, ఈ ముగింపు ఇంపుగా లేదని, అనార్కలీ అమర గాథపట్ల ఉన్న గౌరవం, ప్రేమ ఈ మార్పుతో అడుగంటి పోతున్నాయనీ విమర్శలు వచ్చాయట. అందువల్ల ఇపుడు ఉచితమైన మార్పులు చేయదలచినట్లు ఒక సినీమ పత్రిక వెల్లడించింది.

## కొత్త పాట

వీటితోపాటు ఈ చిత్రంలోని మధుమధురమైన పాటలలో రుచి సేరుగా ఉందనిపించుకున్న మొహబ్బత్ జిందాబాద్ (రఫీ) తీసేసి ఆ స్థానంలో 'హమే కాష్ తుంసే మొహబ్బత్ నహోతీ' అనే మరో పాటని ప్రవేశపెడుతున్నారట. ఈ పాటను లతా పాడిందనీ ఇది బహుళ జనాదరణ పొందగలదనీ విన్నవారు అంటున్నారు.

## ఫిలిం జర్నలిస్టుల బహుమతులు

బొంబాయి ఫిలిం పత్రికారచయితల సమితి 1959 లో విడుదల అయిన చిత్రాలలో ఉత్తమ చిత్రంగా బిమల్ రాయ్ ప్రొడక్షన్స వారి 'సుజాత'ను ఎన్నిక చేసింది. వివిధశాఖలలో వీరు ఉత్తమప్రమాణాలు అందుకొన్నగా ఎన్నికచేసి ఇస్తున్న 18 బహుమతులలోను 'సుజాత' చిత్రం ఆరింటిని సంపాదించింది. ద్వితీయ శ్రేణిలో ఎల్. బి. ఫిలింస్ వారి 'అనాడీ' 5 బహుమతులు అందకొంది. ఈ సంవత్సరం ఉత్తమ సంగీతదర్శకుడుగా వసంత్ దేశాయ్ (గూంజ్ ఉఠీ శహనాయి) ఎన్నిక అయ్యారు. గతసంవత్సరం ఈ బహుమతి సువర్ణసుందరి సంగీతదర్శకుడు ఆదినారాయణరావుకు లభించిందన్న విషయం విదితమే.

## వివరాలు

బహుమతి వివరాలు: 'సుజాత'కు వచ్చిన ఆరు బహుమతులు—ఉత్తమచిత్రం, కథ (సుబోధ్ ఘోష్), దర్శకత్వం (బిమల్ రాయ్), నటి (నూతన్), గాయకుడు (తలత్), శబ్దగ్రహణం (ఎం. సూరత్ వాలా).

అనాడీ—ఉత్తమనటుడు (రాజ్ కపూర్) సహాయనటి (లలితాపావర్), పాటలు (శైలేంద్ర, హస్రత్ జైపురి), మాటలు (ఇందర్ రాజ్ ఆనంద్), కూర్పు (హృషీకేశ్ ముఖర్జీ)

ఉత్తమ సంగీతదర్శకుడు వసంత్ దేశాయ్. గాయని లతామంగేష్కర్, (గూంజ్ ఉఠీ శహనాయి).

కాగజ్ కే ఫూల్ చిత్రంలో కళాదర్శకత్వం (అచల్ కర్), ఛాయాగ్రహణం (వి. కె. మూర్తి), బహుమతులందుకొన్నాయి. సహాయనటుడుగా మన్ మోహన కృష (ధూల్ కా ఫూల్) ఎన్నికఅయ్యారు. నవరంగ్ చిత్రం నృత్యదర్శకుడు శ్యామ్ ఒకబహుమతి నందుకొన్నారు.

ఉత్తమ విదేశీయ చిత్రంగా చాప్లిన్ చిత్రం 'లైమ్లైట్' ను ఎన్నిక చేశారు

బొంబాయి మేయరు శ్రీ వి. ఎన్ దేశాయి గతవారం బహుమతులు పంచిపెట్టారు.

## చలనచిత్రోత్సవం

వచ్చేవారం బొంబాయిలో ఆఫ్రికా ఆసియా దేశాల చలనచిత్రోత్సవం జరుగుతోంది ఆసియా ఆఫ్రికా స్నేహసద్భావాలు పెంపొందించడం లక్ష్యంగా జరుగుతున్న మహాసభల సందర్భంగా ఈ ఉత్సవం, లలితకళాప్రదర్శనం ఏర్పాటుఅయ్యాయి. ఉత్సవంలో కథా చిత్రాలు, డాక్యుమెంటరీలూ కూడా ప్రదర్శిస్తారు. ★



# హరివంశము

(45 వ పేజీ తరువాయి)

పెనకువ అంటావు. అయితే వీరిలో రోషమాత్సర్యాలు పెరగక ముందే పోరును ఆపించు. పసదనం ఇచ్చి మాన్పించు. నీవు నిర్ణయించిన ప్రాశ్నికులు అకౌతరులు కారు. పరమభీరువులకువలె కన్పిస్తున్నారు. కాదో ఈ నియుద్ధాన్ని, ఈ అసమమల్లయుద్ధాన్ని వాళ్లు ఎప్పుడో ఆపివుండే వాళ్లు. మల్లయుద్ధంలో బాలురతో బాలురను, వృద్ధులతో వృద్ధులను, బలియురతో బలియురను పోరించడం తగవు. కక్ష్యాంతరధర్మాలేమో స్పష్టంగా నిర్ణయం అయివున్నాయి. ఇక్కడ నీయీ ప్రాశ్నికులు, నీవు, ఆ ధర్మాలను పాటించడం లేదు. ఇప్పటికే నీవు చాలా పాపాలు చేశావు. ఇప్పుడు ఈ పాపం గూడా ఎందుకు చేస్తావు?"

సమాజవాటం అంతా వింజమాకిడినమాదిరి అయిపోయింది. అంధకుని ఆ ధైర్యాన్ని మెచ్చుకుంది. స్త్రీలలో విచిత్రకోలాహలం బయలుదేరింది. వారిలో ఒకర్తుక ఒక్కర్తుకతోగా ఇట్లా అనుకున్నారు. అంధకుని వాక్యం బాగుంది. వజ్రసారసర్వాంగులు, శైలేంద్రసమ్మతులు అయిన చాణూరముష్టికులు ఎక్కడ? అతి సుకుమారంగులు, కిశోరులు, నాప్తయౌవనులు అయిన ఈ పసివాళ్లెక్కడ? ఈ మల్ల సంగరం ధర్మవ్యతిక్రమంగా సాగుతున్నది. రాజు ఈ అసమ యుద్ధాన్ని వారించాలి. అంధకుని మాట బాగుంది ఒక్క అంధకుడు తప్ప తక్కిన సభాస్తారులంతా అబ్రువమాణులు, విబ్రువమాణుల అయి తూష్ణీంభావం వహించి కూర్చున్నారు. వారిని ఏమనాలి? ఆ కృష్ణుని ముఖం చూడండమ్మా! శ్రమవార్యుప్తమై, జలబిందువులతో నిండినపద్మకోశాన్ని పోలి అందగిస్తున్నది. ఆ రాముడి ముఖం చూడండమ్మా! హాససంరంభశోభనమై, ఆతామ్రమలోచనమై వుంది. ఈ ఇద్దరి క్రీడలను చూచి ఆనందాన్ని పొందిన వ్రజమే ధన్యమైంది. ఈ సభ యేమి సభ! ధిక్! ధిక్! ఈ సభ యేమి సభ!"

కంసుడు అన్నిమాటలు విన్నాడు. విని మందహాసం చేస్తూ మౌనం వహించాడు. అప్పుడు అంధకుడు మళ్ళీ ఇట్లా అన్నాడు: "తాత! కంస! ప్రస్తుతం ఈ కృష్ణాంధ్రమల్లుల పోరాటం, ఈ రామ ముష్టికుల పోరాటం అసమంగా వుంది. రామకృష్ణులు బాలకులు. ఆంధ్రుడైన చాణూరుడు మహాబలుడు. ముష్టికుడును వానియంతవాడు. ఈ యుద్ధం ధర్మయుద్ధం కాదు. దీన్ని ఆపించు" కంసుడు ఆ మాటలు చెవిని పట్టించుకోలేదు. చేసన్నచేత తూర్యములు మొరయగా ఆజ్ఞాపించినాడు తిరిగి నియుద్ధం ప్రారంభం కాబోతున్నది. అప్పుడు శ్రీకృష్ణదేవుడు ఆజ్ఞాగంభీరమైన కంఠంతో ఆ తూర్యములను ఆపివేసినాడు. సభను ఉద్దేశించి, సర్వసమాజవాటాన్ని ఉద్దేశించి ఇట్లా అన్నాడు: "మీరు చూపించిన ఈ ధర్మపక్షపాతం మాకు నచ్చింది. మీరు అన్నట్లు మేము బాలురము. ఈ ఆంధ్రుడు, ఈ ముష్టికుడు, మహాబలవంతులు. పర్వతోపమవపుష్మంతులు. మాతో వీర్యవంతులై నియుద్ధం ఆచరిస్తున్నారు మేము వద్దనడంలేదు ఈ యుద్ధంలో మేము ఎట్టి వ్యతిక్రమము చేయము. ఈ యుద్ధధర్మాన్ని ఇతరులు గూడా వ్యతిక్రమించగలరని మేము అనుకోవడం లేదు. ఇక్కడ రంగధర్మాలు చెల్లడం లేదనడం చెల్లదు. కరీషధర్మం చెల్లుతున్నది. తోయ ధర్మం చెల్లుతున్నది. కషాయానులేపన ధర్మాలు చెల్లుతున్నాయి. మల్లయుద్ధంలో అన్యోన్యాపసరణం, అనపసరణం, హస్తపాదాదిచాలనం, మర్మస్పర్శిత్వం, బలంచేత జయాఖ్యమైన సిద్ధిని పొందడం, సాధనవిశేషాలుగా యుద్ధవిదులయినవారు చెప్పగా వింటున్నాము. ఈ సాధనములనే వారు సమయం, స్థిరతా, శౌర్యం, వ్యాయామం, సత్క్రియా, బలం, సిద్ధి అని అంటున్నారు. వైరంతోగాని, అవైరంతోగాని, ఈ సాధనములతో నియుద్ధం చేయవచ్చు ఇందులో నిగ్రహం కార్యమై చెల్లుతున్నది ఇప్పుడు మీకు తెలియని ఒక రహస్యాన్ని చెప్పబోతున్నాను. ఆంధ్రుడైన చాణూరమల్లుడు చారుకం అనే చోట జన్మించాడు. అందుచేతనే వానికి చాణూరుడని పేరు వచ్చింది. వానితో నాకు వైరం లేదు. వానితో వైరంతో నిమిత్తంలేకుండానే పోరాలని వుంది. కాని కంసునకు నాయందు వైరం వుంది. అందువల్ల వీనిమీద వైరంచేయక తప్పడంలేదు. వీడు వాని బంటు. తనకుబదులు వీనిని కంసుడు నామీదకు పంపినాడు. రామునిమీదకు ముష్టికుణ్ణి పంపినాడు. వీరిద్దరు దోషచారితులు. నిపాతానంతరం మల్లురను చంపరాదన్నది ఒక ధర్మం. ఈ ఇద్దరు ఆ ధర్మాన్ని ఎప్పుడూ పాటించలేదు. తమ చేత చిక్కిన పెక్కండ్రు మల్లురను వీరు ధర్మవ్యతిక్రమంగా వధించారు. వీరిని ఇప్పుడు మేము వధిస్తాము." ❖

---

# మనసులూ మనసులూ

(31-వ పేజీ తరువాయి

అయస్కాంతంతో లాగబడ్డ వాడికి మల్లే ఆమె వేపు తదేకంగా చూస్తున్నాడు కాంతారావు. అబ్బ! ఇప్పుడెంత అందంగా వుంది! ఈ అందాన్ని ఇంతదాకా తను గుర్తించలేదు

ఎవరిఅనుభవంకోసమని, ఈ సౌందర్యమంతా? అంతరాలలోక దూసుకు పోగలమని ధీమగా చెప్పే ఆ చూపులూ, వాటి వెనకదాచి వుంచిన మెత్తని మనస్సూ—ఎవరికి అంకితం కావాలని?

అతడలాగే తనవేపు చూస్తోండటం గమనించి ఆమె సిగ్గుపడి మొహం మరోవేపుకు తిప్పుకుంది అతడు అనియంత్రితంగా లేచాడు. ఆమె ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని దగ్గరికి లాక్కుంటూ పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు.

అనూరాధ కిదంతా అయోమయంగా వుంది. అతను చేతులు భుజంమీద వేస్తుంటే చేతనా రహితంగా, యాంత్రికంగా, పరాధీన అయినట్టుగా అలాగే వుండిపోయింది. వదిలించుకుందామనైనా తెలియలేదు. అంతే ఒక విచిత్రానుభూతిగా ఆమెను కలవరపెట్టింది. కాంతారావు దూరంగా జరిగాడు.

ఆవేశం వదిలి పోయింది. తనేం చేశాడు! ఒక్క క్షణం ఆలోచన తన నింత నిగ్రహం లేని వాణ్ణిగా చేసిందేమిటి? అనూరాధ ఏమనుకుంటుంది!!

మళ్ళీ అతడామె మొహంవేపు చూడలేక పోయాడు. ఇహ అక్కడ నిలవలేదు. గబగబా మేడదిగి ఇవతలికి వచ్చేశాడు

అనూరాధ తేరుకుని చూసింది కాంతారావు అక్కడ లేడు ఆమె బాధపడింది అతడిని వెళ్ళవద్దని ఎందుకు చెప్పలేదు తను.

కాంతారావు కూర్చుండిన కుర్చీ ఆమె కేసి పరిహాసంగా నవ్వింది. (ఇంకా ఉంది)

# న్యూఢిల్లీ లేఖ

(16-వ పేజీ తరువాయి)

చూపుతున్నారు. నిర్ణీత తేదీకి ముందుగానే 11 వేల టన్నుల నూనె దిగుమతి అయింది. మళ్లీ శ్రీ కృష్ణమీనన్ దయవల్ల ఆనూనెను సైనికశాఖ తాలూకు టాంకులలో నిల్వ చేయటం జరిగింది.

ఈ విషయాలన్నీ చెప్పటం నూనె కంపెనీలను సమర్థించడంకోసం కాదు. కాని వాస్తవానికి ఇవే రవాణాకంపెనీలకు ఆది నుంచి నూనె సరఫరా చేస్తున్నాయి. కొన్ని సందర్భాలలో ప్రపంచదేశాలన్నిటి నుంచి టెండర్లుకోరటం ప్రభుత్వ విధానం. తక్కువ ధరకోరిన టెండర్లను కొన్ని సందర్భాలలో ఎందుకు అంగీకరించలేదో వివరిస్తూ, కేంద్ర సరఫరాలమంత్రి అప్పుడప్పుడు పార్లమెంటులో ప్రకటనలు చేయాలి. స్టాండర్డ్ వాక్యూమ్ కంపెనీ టెండర్లద్వారానే బొంబాయిలో కంట్రాక్టు సంపాదించింది. దేశంలోకల్లా ఒక్క బొంబాయి రవాణా సంస్థకే నూనె రవాణాకు కావలసిన లారీలు ఉన్నాయి. భారత నూనె కంపెనీ, మాట వరుసకు రాజస్థాన్‌కు ఎలా నూనె పంపగలుగుతుందో తెలియదు. మార్కెటింగ్, పంపకంసదుపాయాలు లేకపోయినందువల్లనే మరో నాలుగు నెలలవరకు నూనె ఎగుమతి చేయవద్దని భారత ప్రభుత్వం రష్యా ప్రభుత్వాన్ని కోరవలసి వచ్చింది.

రష్యానుంచి వచ్చిన నూనె ధరలు పడగొట్టేందుకు, స్టాండర్డ్ వాక్యూమ్, కాల్టెక్సు కంపెనీలు, తమకు పన్నుల విషయంలో ప్రభుత్వం కల్పించిన రక్షణ సదుపాయాన్ని వినియోగించుకుంటున్నవని ఒకవాదం వినవస్తోంది. అయినప్పటికి ప్రభుత్వ నూనె మార్కెటింగ్ సంస్థ పంజాబ్ మార్కెట్‌లోకైనా అడుగు పెట్టకుండానే, బర్మాషెల్ కంపెనీని కాంట్రాక్టు సంపాదించుకోనిచ్చింది. పన్నుల విషయంలో ప్రభుత్వం కల్పించిన రక్షణను ఈ కంపెనీ వదలుకున్నది. ఆ తరువాత స్టాండర్డు వాక్యూం కంపెనీకూడ ఈ సదుపాయాన్ని వదులుకున్నది.

పై విషయాలనుబట్టి ప్రభుత్వం చేసే పనులు ఎంత అపసవ్యంగా ఉన్నవో స్పష్టమవుతోంది. రష్యానుంచి నూనె దిగుమతి చేసుకునే ముందే, ప్రభుత్వం నూనె కంపెనీలతో సంప్రదించి,ఆ నూనె మార్కెటింగ్‌కు తగు ఏర్పాట్లు చేయవలసింది. అట్లా చెయ్యని పక్షంలో తమ ఆధ్వర్యం క్రిందే అన్ని ఏర్పాట్లు చేసుకోవలసింది.

* * *

ద్వితీయ పంచవర్ష ప్రణాళికకాలంలో 1 కోటి 60 లక్షల టన్నుల సిమెంటు ఉత్పత్తి చేయాలని లక్ష్యం. 1958 సంవత్సరం సగపడి గడిచేసరికి, 1 కోటి 40 లక్షల టన్నుల సిమెంటు తయారుచేయగల ఫ్యాక్టరీలకు లైసెన్సులు ఇవ్వటం జరిగింది. ఆ ఏటి అంతానికి సాలుసరి 74 లక్షల టన్నుల సిమెంటు తయారు చేయగల ఫ్యాక్టరీలు ఏర్పాటయ్యాయి. కాని ఉత్పత్తికి తగినట్లుగా గిరాకీ లేకపోయింది. ఈ కారణం చేత, పరిశ్రమను విస్తృతం చేసే కార్యక్రమాన్ని నెమ్మదిగా అమలుచేయటం వాంఛనీయమని భావించారు. లైసెన్సింగ్ సంఘం 1959 మార్చి 17 వ తేదీన సమావేశమై, 18 మాసాలవరకు సిమెంటు పరిశ్రమ విస్తరణకు అనుమతించరాదని తీర్మానించింది. ఈ గడువు 1960 సెప్టెంబరు 17 వ తేదీతో తీరిపోయింది.

ప్రస్తుతం దేశంలో 85 లక్షల 72 వేల టన్నుల సిమెంటు ఉత్పత్తి చేయగల ఫ్యాక్టరీలు ఉన్నాయి. మరో 16 లక్షల 64 వేల టన్నుల సిమెంటు దిగుమతికి లైసెన్సులు ఇవ్వడమైనది.



ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## గళ్ళ నుడికట్టు-30



### ఆ ధా రా లు

#### అడ్డం

1. ఇది సరికాదు. మరోమాట వేసి చూడండి.
3. కొకరపొదు కదిలింది. అక్కడ జోడు జాడ తెలుస్తుందేమో చూడండి.
5. సందడి తగ్గింది మధ్యతడకేశాక.
6. 3 నిలువుతలలోనూ, ఖలుడికి నిలువం తానూ, హరుడి మెడలోనూ ఉండేది.
8. ఆడ నిశాచరుడు!
10. చెడ్డది కాదే.
11. "కలి"గానికలి ఏ కలి?
13. 14 నిలువులో జరిగే అభాసు.
15. జవరాలికురులలో, మరులు కొలిపేవి.
16. "ఓరి దుష్టుడా! ఇందుకా మము ఆదరించి తెచ్చావు" అన్నారు హీరోయిను లిద్దరు. దుష్టుడిదుర్బుద్ధి కనిపిస్తూనే ఉంది.
17 మనలోనే మన మనసుంది.
19. దీనికి ఎద్దుల్ని కడితే గిరగిరా తిరుగుతాయి.
20. లలలా అని ఎప్పుడూ పాడుతూ కులికే కలికి.
23 హవ్వ! సడిచెయ్యొద్దంటె వినరేం!
24 ఝుటిటో! తలక్రిందులయిన కథలండీ!
25. అంథా ప్రయత్నంలోనే ఉంది స్వండీ!
26. రెండుసార్లు చాలు.
28, రయంగాపోతున్న యమున, దానివేగం కలిసిపోయాయి.
30. ఊరుగాయి ఊరుచోటు.
31. బరువులేదుకదా అనికొట్టిపారవేయకండి!
32. సావడిలో అంతతొందరెందుకు?

#### నిలువు

2. కేశాలంకరణలో వాసి గన్నది.
3. పాకముందూ వెనకా పాకేదుంది.
4. కాంచి.
5. ముందరికివెళ్తే దగ్గరగా ఒడ్డు కనిపిస్తుంది.
7. బూడిదయిపోయినా పతి తనకు మాత్రం సజీవుడుగా కనబడేటట్టు వరం పొందిన సతి.
9. ఎంత చూచినా పొడుగు వెడల్పులలో తేడా ఎంచదరముగానిది.
10. దీంతో దెబ్బకి రోగం కుదుర్తుంది.
11. చిలకా గోరింకల్లా ఉండాల్సినవాళ్ళు.
12. ఇది కలికాలం. కాబట్టే ఇంత గంద్రగోళంగా ఉంది.
14. సమావేశం.
18. ఇది నల్లదైతే బొత్తిగా కనబడదు.
19. సంగీతంలో నిధులు కాకపోయినా మహా చెడ్డపాట మాటొచ్చినపుడు తరుచుగా 'వీరిని' తల్చుకుంటూనే ఉంటాం.
21. చూచేది.
22. ఇదిగో! ముద్దు చెయ్యొద్దని చెప్పవే వాణ్ణి!
26. కృష్ణుడి అల్లరి పనులగురించి యశోదకు గోపికలు చెప్పినపుడు అవి లీలలు కావు; ఇది.
27. గోడమీది గొలుసులబొమ్మ పైకి పాకుతోంది జాగ్రత్త.
28. మీరు ఊ అంటే ఊరకనే దొరుకుతుంది అనకపోతే పై కొసతెగిన పరక మిగులుతుంది.
29. కొత్తమాట.

### ఆధారాల పోటి

గళ్ళనుడికట్టు — 30 లో 17 అడ్డం మాటకు, 11 నిలువు మాటకు మేము యిచ్చిన ఆధారాలకన్న ఉత్తమయినవి పంపేవారికి రు. 5లు బహుమతి ఇస్తాము. ఆధారాలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ డిసెంబరు 10, 1960.

—సంపాదకుడు.

### 29-వ గళ్ళనుడికట్టుకు ఆధారాలు



### గెలుపెవరిది?

బిల్లు రూపాయిపావలాకు రావడం చూచి "ఇదేమిటి, నా బిల్లు పన్నెండణాలకు మించి వుండదే" అన్నాడు సప్లయర్‌తో అతను. సప్లయర్ "నవ్వి నిజమే సార్, కానీ మీరు లెక్క లేకుండా ఎంతవేస్తే అంతా చెల్లించిపోతారని మా కాషియర్ అన్నారు. అలా కాదన్నాను నేను. సరే ఈవేళ తేల్చుకుందామని అయిదు రూపాయలు పందెం వేసుకొన్నాం సార్" అన్నాడు.

"అలాగా"! అని నవ్వి ఆ బిల్లు వెనక ఏదో వ్రాసి. "ఇది తీసుకుపోయి మీ కాషియర్‌కు యిచ్చిరా" అన్నాడు. అలాగేనని కాషియర్ దగ్గరకుపోయాడు సప్లయర్. ఆ కాషియర్ సప్లయర్లతో చెప్పి అలాంటిమోసాలు చేయిస్తాడు. సప్లయర్ తెచ్చిన చీటీ విప్పిచూస్తే- అందులో "ఇది మీరుచదివేసరికి నేనీప్రాంతాల్లో వుండను, పదిరూపాయలు పందెం. సరేనా, అని వ్రాసిఉంది. అదిచూసి సప్లయర్, కాషియర్ కళ్లు తేలవేశారు!

ఎస్. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి
(విశాఖపట్టణం)

* *

### లోభిచూపిన కృతజ్ఞత

నదీస్నానంచేస్తూ, ఒకలోభి ప్రవాహవేగానికిఆగ లేక కొట్టుకుపోతున్నాడు! గట్టున నిల్చొని చల్లగాలిపీలుస్తున్న ఓ యువకుడు, గభాలునదూకి, ఈదుకొంటూవెళ్ళి అతన్ని ఒడ్డుకు తీసుకొచ్చాడు? తుండుగుడ్డతో ఒళ్ళు తుడుచుకొని తన చొక్కా తీసికొని, జేబులో చేయిపెడుతూ ఆ వ్యక్తి యిలా అన్నాడు "చాలా ధైర్యంగా నన్ను రక్షించావు! నీకేదైనా బహుమానం యివ్వాలనుకొంటున్నాను! నీదగ్గ అర్ధరూపాయకుచిల్లరఉందా?"

ఎస్.సి. సంతానగోపాలకృష్ణ (నందలూరు)

### బహుమతి పొందిన కార్టూన్



Printed and Published for NageswaraRao Estates (Private) Ltd., by S Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

